# చతుర


సంపుటి:3 సంచిక:8

సెప్టెంబర్ 1980


## ఈ నెల సమగ్ర నవల

మెతన ఒంటరితనపు ఎడారిలో తోడుగా నిలిచి సేదతీర్చే ఒయాసిస్ నుకున్నాడతను. జీవితాంతం ఆమె చల్లని చేయూతతో న్నత శిఖరాలు అధిరోహించగలననుకున్నాడు. అందుకే ఎవరే మనుకున్నా లక్ష్యపెట్టక తను నమ్మిన వ్యక్తిని ఆరాధించేడు ప్రాణాధికంగా.

అయితే ఆమె వేరే వ్యక్తితో కనిపించగానే అతన్లో బాధ సుళ్లు తిరిగింది. తనని చూసి భయపడి దూరంగా పారిపోయిన ఒంటరితనం తిరిగి తన్నావరించు కుంటుందని భయపడ్డాడు.

అతని భయం నిజమైందా ?

ఆమెకీ, అతనికీ మధ్యనున్న అడ్డుగోడలు కూలిపోయాయా ?

అవధుల్లేని ఆమె ఆత్మీయతాను రాగాల...

# నీడ

లో అతని వ్యక్తిత్వం ఏ రూపు దాల్చింది ?

భౌతికానుభవాల ఉద్రేకాలకు అతీతమైన ఇద్దరు వ్యక్తుల పరస్పర అనురాగాన్ని హృద్యంగా చిత్రించిన

## నండూరి రామకృష్ణ

నవల 'నీడ' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం : ఫొటో : దిలీప్ బెనర్జీ

2 వ కవరు : అజంతా గుహలు     3 వ కవరు : బాదామి శిల్పం

ఫొటోలు : గీతాదత్త

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.

* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 - 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతున్న నవలికలు చతురలో అచ్చులో 60 - 70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడుతాయి.

* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.

* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

## చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500004.

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యంచిందే గట్టి పళ్ళు



# కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంది. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన అపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:

- మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.
- కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.
- ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.

## నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!




సంపూర్ణమైన దంతరక్షణ కోసం

1 పళ్ళ ఎనామిల్‌కి రక్షణ

2

3 చిగుళ్ళకు రక్షణ

DC.G.74 TL

# కోపం

కృష్ణశాస్త్రిగారు మహా కోపిష్టి పంతులని పేరు పడిపోయింది. ఆయనకు కోపం వచ్చినపుడు క్లాసులో పిల్లల్లో ఒకణ్ణి లేపి ఒక ప్రశ్న వేసేవాడు "ఒరేయ్ వెధవా! మీ అమ్మ...ఇన్ని గారెలు తింది, మీ నాన్న...ఇన్ని గారెలు తిన్నాడు. మొత్తం ఎన్నో చెప్పరా ?" అనేవాడు.

గారెలంటే కృష్ణశాస్త్రిగారికి విపరీతమైన ఇష్టం. దాంతో ఆయన ఆ గారెల ప్రశ్ననే దాదాపు పది సంవత్సరాలుగా వేస్తూ వస్తున్నాడు. ఆయన ప్రశ్నలో గారెల సంఖ్య ఎంత వుంటుందో చెప్పలేం. ఒక్కోసారి లక్షలు, వేలు వున్న సందర్భాలు కూడా వున్నాయి. కృష్ణశాస్త్రిగారి గారెల ప్రశ్న విని కుర్రవాడు టక్కున జవాబు చెప్పాడా సరేసరి - చెప్పకపోయాడో ఆరోజు వాడి వీపుమీద ఈత బెత్తం నాట్యమాడేది. కుర్రాడి వీపుమీద వాతలు తేలేవి. అంతటి కోపిష్టి ఆయన.

ఒకరోజు ఆయన పిచ్చి కోపంతో ఊగిపోతున్నాడు. అంతకుముందే హెడ్ మాస్టర్‌కూ, ఆయనకూ మధ్య ఏదో గొడవ జరిగినట్టుంది. అదే కోపంతో క్లాసు రూంలో కొచ్చాడు. వెంటనే ఓ కుర్రాణ్ణి నిలబెట్టి "ఒరే..మీ అమ్మ ! ఇన్ని గారెలు తంది, మీ నాన్న ... ఇన్ని తిన్నాడు. మొత్తం ఎన్నిరా వెధవా ? చెప్పు'' అనడిగాడు.

మాష్టారి ఉగ్రనరసింహ రూపం చూసి భయపడిపోయిన ఆ కుర్రాడి నోట్లోనుంచి చాలా సేపటివరకు మాట రాలేదు. అంతే కృష్ణశాస్త్రిగారి బెత్తం ఆ రోజు ఆ కుర్రాడి వీపుమీద శివ తాండవం చేసింది. కొట్టి కొట్టి అలసిపోయి చివరికి అదే కుర్రాణ్ని మళ్ళీ అదే ప్రశ్న వేశాడు-

"ఒరేయ్ వెధవా! మీ అమ్మ ఇన్ని గారెలు తింది, మీ నాన్న ఇన్ని గారెలు తిన్నాడు, నువ్వు ఇన్ని గారెలు తిన్నావు మొత్తం ఎన్ని...చెప్పు - ఈ సారన్నా చెప్పకపోయావో నిన్ను చంపేస్తాను" బెత్తాన్ని అలాగే చేత్తో పట్టుకుని ఊగిపోతూ అన్నాడు.



కుర్రాడు ఈసారి ఇంకా కంపించిపోతూ అన్నాడు "నాకు అమ్మ, నాన్న లేరుసార్. వాళ్ళు ఎప్పుడో చనిపోయారు. మరి చచ్చిపోయిన వాళ్ళు గారెలు ఎలా తింటారు సార్" అన్నాడు.

కొద్ది నిమిషాలు గడిచాక చూస్తే కృష్ణశాస్త్రిగారు కన్నీళ్ళతో కనిపించారు. బెత్తం దూరంగా బజారులోకి విసిరేసారు. కుర్రాడి వీపు, తల ప్రేమగా నిమురుతూ వాడ్ని కౌగిలించుకుని కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్నారు.

# 'డిటో' రియక్షన్

ఎడిటర్‌గారు ఇచ్చిన టెలిగ్రాం చూసుకుని ధామ్మని కిందపడిపోయాడు దిన పత్రిక న్యూస్ ఎడిటర్‌గారు. సబ్ ఎడిటర్లందరూ చుట్టూ మూగారు. న్యూస్ ఎడిటర్ చేతిలో ఉన్న టెలిగ్రాం అందుకుని ఒక్కొక్కరే చదివారు. ఆశ్చర్యం-చదివినవాడు చదివినట్టు స్పృహతప్పి కింద పడిపోతున్నారు. కాసేపట్లో ఎడిటోరియల్ సెక్షన్ అంతా అల్లకల్లోలంగా తయారైంది.

ఇంతకీ అసలు విషయం ఏమిటంటే ఆ దిన పత్రిక ఎడిటర్ రెండు నెల్లుగా ఊళ్ళోలేరు. అనారోగ్యం వదిలించుకోవటానికని ఏదో ఆశ్రమంలో చేరి కాయకల్ప చికిత్స చేయించుకుంటున్నారు కేరళలో.

మన సంపాదకుడి సంపాదకీయాలు సుప్రసిద్ధాలు. దేశం మాంచి సంక్షోభంలో వున్నప్పుడు "చింతపండులోంచి తేలిగ్గా గింజలు తీసే విధానం"మీదా, "అతి శీఘ్రంగా కందిపప్పు ఉడకబెట్టే టెక్నిక్" గురించీ సంపాదకీయాలు రాసేవాడు. చైనాతో యుద్ధం జరుగుతుంటే మన సంపాదక మహాశయుడు బీరకాయల్లో విటమిన్ల శాతం గురించి సవివరంగా చర్చించేవాడు.

అలాంటి ఎడిటర్ మహాశయుడు ఆశ్రమానికి కేరళ ప్రయాణమై వెళ్తూ రెండు నెల్లకు సరిపడా సంపాదకీయాలు ఒకేసారి రాసిచ్చి మరీ వెళ్ళాడు. మామిడికాయ ముక్కలు ఆవకాయలోకి రూపాంతరం చెంది పన్నెండేసి నెలలు నిల్వ వుండగా లేంది, తన ఎడిటోరియల్స్ మాత్రం ఎందుకు నిల్వ వుండవు అనేది ఆయన థియరీ. పైగా ఆంధ్రులకు నిల్వ సరుకులు అంటే మహా మోజు. నిలవున్న కొద్దీ వూరి రుచి పెరిగిపోతుంది కదా అని ఆయన వాదం.

దాంతో న్యూస్ ఎడిటర్, సబ్ ఎడిటర్ రెండు నెల్లపాటు చచ్చినట్టు ఆవకాయ ముక్కల్లాంటి ఆయన ఎడిటోరియల్స్‌ని అచ్చేసి పేపర్ బయటకు తెచ్చారు. అయితే అంతక్రితం రోజు ఆ ఎడిటోరియల్స్ అన్నీ అయిపోయాయి. ఎడిటర్‌గారు మరో నెల అదనంగా ఆశ్ర




మంలో వుండవలసి వచ్చేట్టున్నదని వార్త అందింది.

"మీరిచ్చి వెళ్ళిన అరవై సంపాదకీయాలు అయిపోయాయి. రేపటి పేపర్ కోసం సంపాదకీయం వెంటనే పంపండి" అని టెలిగ్రాం కొట్టాడు న్యూస్ ఎడిటర్.

వెంటనే ఎడిటర్‌గారు రిప్లై టెలిగ్రాం ఇచ్చారు. అందులో ఇలా వుంది "ప్లీజ్. రిపీట్ దెం" అది చదువుకునే అందరూ నేల కొరిగారు.







FAREX

# పక్కింటి అమ్మాయి

తనకో రూం ఉండాలి; తన రూం ఉండే ఇంటి పక్కనే మరో ఇల్లుండాలి. అందులో మాంచి అందమైన అమ్మాయుండాలి. అప్పుడు ఆ అమ్మాయిని తను ప్రేమించాలి.

పట్నంలో అడుగు పెట్టిన దగ్గర నుంచి ఈ ప్రేమ పిచ్చి బాగా పట్టుకుంది శిరోమణికి. అలాంటి ఇంటి కోసం పట్నమంతా గాలించాడు. కానీ ఎక్కడా దొరకలేదు. అక్కడక్కడా వున్నా బ్రహ్మచారికి ఇల్లు ఇవ్వం పొమ్మని తరిమేసేవారు.

రోజు రోజుకీ పక్కింటి అమ్మాయిని ప్రేమించాలన్న కోరిక మరీ బలపడసాగింది. ఏం మరో అమ్మాయిని ప్రేమించకూడదా ? అని శిరోమణిని అడిగితే "అబ్బే అది కాదు, దగ్గరుంటే ఎక్కువసేపు ప్రేమించుకోవచ్చు కదా ! అదీకాక అమ్మాయి దూరంగా వుంటే రోజూ సిటీబస్సుల ఖర్చు, రిక్షాల ఖర్చు పెరిగిపోతుంది" అని ఎకానమీ ఆఫ్ లవ్‌ని విడమర్చి చెప్పేవాడు.

వెతగ్గా వెతగ్గా చివరికో ఇల్లు దొరికింది. పక్కనే మరో ఇల్లు కూడా వుంది. అయితే అందులో అమ్మాయి వుందా అంతే నిర్ధారణగా తేలలేదు. ఎవరో ఒకరు వుండక పోతారా తన అదృష్టం పండి ప్రేమలో పడకపోతనా అని ఆశపడ్డాడు శిరోమణి. ఆ రోజు రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో ఇంట్లో దిగాడు. అప్పటికి పక్కింటి వాళ్లు భోజనాలవీ చేసేసి నిద్ర కుపక్రమిస్తున్నారు. వాతావరణం నిశ్శబ్దంగా ఉంది. పక్క ఇంట్లోంచి ఓ ఆడ గొంతుక ఓ ప్రేమ గీతాన్ని తియ్యగా ఆలపిస్తోంది.

ఆ గొంతు విని ఎగిరి గంతేశాడు శిరోమణి. తప్పకుండా అమ్మాయి గొంతుకే అని నిర్ణయించుకున్నాడు.

తెల్లవారింది. పక్కింటిలోంచి ఓ యువకుడు బయటకు వచ్చాడు. శిరోమణి అంతకు ముందే లేచి రాత్రి పాట పాడిన అమ్మాయి ఎప్పుడొస్తుందా అని ఎదురు చూస్తున్నాడు.

ఎంతకి రాలేదు. చివరికి యువకుడు



వచ్చాడు. బహుశా ఈ యువకుడు ఆ అమ్మాయికి అన్న అయ్యుంటాడనుకుని వెంటనే ఆపుకోలేని తమకంతో అడిగేశాడు శిరోమణి.

"ఏమండీ ! రాత్రి మీ ఇంట్లో ఎవరో పాట పాడుతున్నారు...మీ సిస్టరా ?"

"అబ్బే లేదండీ! ట్రాన్సిస్టర్"

టక్కున జవాబు చెప్పి లోపలకెళ్ళిపోయాడు. ఆ ట్రాన్‌సిస్టర్ ఓనర్.

—గౌస్

చప్పట్లతో హాలు దద్దరిల్లిపోయింది.

చివరనుంచి 'వన్స్‌మోర్'లు వినిపించాయి. సంతోషం పట్టలేకపోయాను.

ఏదో సాధించినట్లనిపించింది నాకు.

లక్ష్మి నవ్వింది మూడో వరసలోంచి. సైగ చేసింది మరో పాట పాడమని. టానిక్ తాగినంత ఉత్సాహం వచ్చింది లక్ష్మి చెప్పటంతో.

'వెలిగించవే చిన్ని...' అందుకున్నాను.

అంత ఎమోషనల్‌గా ఎప్పుడూ పాడలేదేమో!

పాటవగానే మళ్ళీ చప్పట్లు. కాస్త సద్దుమణిగాక ప్రిన్సిపాల్ గారు ఉపన్యాసం మొదలెట్టారు.

"డియర్ స్టూడెంట్స్....కొలీగ్స్–ఈ రోజు చాలా మంచి రోజు. మన కాలేజి పెట్టి అయిదేళ్ళే అయినా ఎంతో అభివృద్ధి సాధించాం. ప్రతీఏడు మనం ఇలాగే సాంస్కృతిక కార్యక్రమాలు జరుపుకోవాలి. చక్కగా చదువుకోవటం ఒకటే కాకుండా, మిగతా వాటిల్లో కూడా ప్రతీ విద్యార్థీ ఆసక్తితో కృషి చేయాలి.

"మన రాజు చదువులో ఎటువంటివాడో మీకు తెలుసు. ఇక సంగీతంలో అతనికి ఎంత సామర్థ్యం ఉందో మీరిప్పుడే చూశారు. రాజు మన కాలేజీ విద్యార్థి అయినందుకు నేనెంతో గర్వపడుతున్నాను. అతను తప్పకుండా ఏదో ఒకనాటికి గొప్ప గాయకుడవుతాడు..."

నవ్వొచ్చింది నాకు.

స్టేజెక్కి కాలేజీలో నాలుగు పాటలు పాడినంత మాత్రాన ప్రతివాడూ గొప్ప గాయకుడై పోతాడా?

కాలేజీలో నాకూ ఓ ప్రత్యేకత ఉంటుందని పాటలు పాడటం నేర్చుకున్నా. అంతేకాని అదేదో కూడూ గుడ్డా పెడుతుందనీ కాదు, నన్నో గొప్ప గాయకుడిని చేస్తుందనీ కాదు.

చుట్టూ ఫ్రెండ్సంతా మూగారు.

లక్ష్మి కోసం చూశాను. ఎక్కడా కనపడలేదు. తొమ్మిదయింది అప్పటికే. ఇంటికెళ్ళిపోయుండేమో! ఆలస్యమయిందని వెళ్ళిపోయుండవచ్చు.

తాతయ్య వచ్చాడు దగ్గరికి.

"చాలా బాగా పాడావురా నాన్నా!" అన్నాడు.

"నీకు నచ్చిందన్నమాట!"

"నువ్వు మొచట పాడావు చూడు – 'పలుకే బంగార మాయెరా...' అది అన్నిటికంటే బాగా నచ్చిందిరా"

ఇద్దరం కాలేజీ బయటకొచ్చాం.

"తాతయ్యా! ఈ కప్పు కాస్త పుచ్చుకో" అంటూ కప్పు అందించి సైకిలెక్కాను.

"దీని బరువెంతుంటుందిరా?"

"కొంపతీసి ఇది వెండిదనుకున్నావా?"

"మరి...?"

విరగబడి నవ్వాను నేను.

"ఏం కాదా?"

"కాదు తాతయ్యా! అది ఒట్టి పైపూత..అంతే!"

అర్థం కానట్టు చూశాడాయన.

"ఈ రోజుల్లో పాటలు పాడినందుకు వెండీ, బంగారం ఎవరిస్తారు చెప్పు? పూచో ... ఇప్పటికే ఆలస్యమయింది వెళ్దాం" అన్నాను.

కాళ్ళలో బలమంతా పెట్టి స్పీడ్‌గా పోనిచ్చాను సైకిల్‌ని. ఎప్పుడు ఇంటికి చేరదామా అని ఉంది. పొద్దుట్నించీ ఫంక్షన్ హడావిడితో చాలా అలసి

పోయాను.

"కాస్త మెల్లగా నడపరా! ముసలాడిని.. జోరుగా పోనిచ్చావంటే నా గుండె కాస్తా ఆగిపోతుంది" అన్నాడు తాతయ్య.

"అలాగేలే" అంటూ నవ్వాను.

చింతలపూడికి మా వూరు ఎనిమిది మైళ్ళు.

రోజూ కాలేజీకి అంత దూరం సైకిల్ మీదే రావటం మూలాన అలవాటై పోయింది ఆ దారి. మలుపులు కూడా చాలా తక్కువ. సైకిల్ సాఫీగా పోతోంది తారు రోడ్డు మీద.

"చలివేస్తోందిరా" అన్నాడు తాతయ్య.

"ఎందుకొచ్చావు చెప్పు? అసలే చలికాలం.నీకేమో చలిగాలి పడదు. ఇంట్లో నీకు రోజూ వినిపిస్తూనే ఉంటాగా నా పాటలు?"

"అది కాదురా! వాళ్ళందరి ముందరా నువ్వు పాడడం, అందరూ నిన్ను పొగడుతూ చప్పట్లు కొట్టటం, నీకు ప్రైజి వ్వటం..ఇదంతా ఇంట్లో ఎలా చూడగలను చెప్పు?"

"ఏం వస్తుంది తాతయ్యా అదంతా చూస్తే? ఇప్పుడు మళ్ళా నీకే జ్వరమన్నా వస్తే?"

"ఏం రాదులే"

"నువ్వెప్పుడూ అలానే అంటావు. మొన్న ఆ మధ్యన సెకండ్‌షో సినిమా అంటూ ఇంత దూరం వచ్చామా! మర్నాడే నీకు ఒళ్ళు తెలియని జ్వరం వచ్చేసింది. ఏమయినా సరే ఇకనుంచీ నువ్వు రాత్రిపూట బయటకు రావటానికి వీల్లేదు."

"పిచ్చి సన్నాసివిరా నువ్వు.. ఊరికే కంగారు పడిపోతావు."

"కంగారు కాదు తాతయ్యా! మొన్న డాక్టరు ఏం చెప్పాడో తెలుసుగా? వీలయినంత రెస్టు కావాలి నీకు. నీకేమయినా అయితే ఎలా చెప్పు?"

"జాగ్రత్తగా ఉంటాలే" అన్నాడు తాతయ్య సన్నగా నవ్వుతూ. గుడిమలుపు తిరుగుతుంటే పలకరించాడు మున్సబు-

"ఏం పంతులూ! మీ తాతయ్యగారిని షికారుకి తీసికెళ్ళినట్లున్నావు?"

"అవునండీ! ఇవాళ మా కాలేజీలో ప్రోగ్రాం ఉందని తీసుకెళ్ళాను" అంటూ సైకిల్ ఆపాను.

"ఇవాళ ఇంకా ఇంటికి చేరలేదే మున్సబూ?" అడిగాడు తాతయ్య సైకిల్ దిగుతూ.

"రేపెళ్ళి ఎరువు తీసుకు రావాలి కదండీ ఏలూరు నుంచి! కరణానికి కూడా చెప్పొద్దామని వెళ్ళాను!"

"ఎన్ని గంటల కెళ్తున్నారు రేపు?"

"ఏడు గంటల బస్సుకండీ"

"నేనూ వస్తాను మున్సబూ! పొద్దునే కరణాన్ని తీసుకుని మా యింటికి రా ముగ్గురం కలిసిపోదాం"

"అలాగేనండీ" అంటూ వెళ్ళి పోయాడు మున్సబు.

ఇంటికెళ్ళగానే బావి దగ్గరకెళ్ళి నాలుగు చేదలు నీళ్ళు గుమ్మరించుకున్నాను నెత్తిమీద.చలికాలంలో కూడా చన్నీళ్ళతో రోజుకి రెండుసార్లు స్నానం చేయకపోతే నాకు నిద్దర పట్టదు.

ఒళ్ళు తుడుచుకుని వంటింట్లోకి వెళ్ళి అన్నం వడ్డించాను యిద్దరికీ. తాతయ్యని పిలిచాను అన్నానికి రమ్మని.

"నాకివాళ ఆకలిగా లేదురా" అన్నాడు తాతయ్య పడక గదిలోంచే. ఆయన్ని తీసుకు రావటానికి గదిలోకి వెళ్ళాను.

నేననుకున్నట్లే జరిగింది.

ముసుగు పెట్టుకుని పడుకున్నాడు తాతయ్య. తలనించి కాళ్ళదాకా రెండు దుప్పట్లు కప్పినా ఆయన వణుకు తగ్గ లేదు.

ఇంట్లో ఉన్న మాత్రలు రెండిచ్చాను. నాకూ ఎందుకో ఆకలి చచ్చిపోయింది. ఆయన పక్కనే పడుకున్నా తనెంత వద్దన్నా వినకుండా. తెల్లారేటప్పటికి కాస్త జారింది జ్వరం.

పొద్దునే మున్సబూ, కరణం వచ్చారు.

"ముసలాయనకి మళ్ళీ నలతగా ఉన్నట్లుందే ?" అన్నాడు కరణం వస్తూనే.

నాకు కోపం వచ్చింది.

"కరణంగారూ ! మీ కెన్ని సార్లు చెప్పాను మా తాతయ్యని అలా పిలవటానికి వీల్లేదని !"

"బలేవాడివయ్యా! ఏళ్ళొచ్చిన మనిషిని 'ముసలాయన' అనక, 'నవ మన్మధా !' అనమంటావా ?"

"పేరుపెట్టి పిలవండి చాలు"

కళ్ళు తెరిచాడు తాతయ్య.

"చూడవయ్యా రాఘవులూ నీ మనవడు ఏమంటున్నాడో"

"ఏమిటి ?" అన్నాడు తాతయ్య లేచి కూచుంటూ.

"నిన్ను 'ముసలాయన' అని అనకూడదట"

నవ్వాడు తాతయ్య.

ఆయన ఓపికకి నాకు చిరాకేసింది. కరణం, మునసబూ వచ్చారంటే చాలు, ఎక్కడలేని హుషారూ ఒస్తుంది. వంటింట్లోకి వెళ్ళి తాతయ్యకి కాసిని పాలు కాచి తెచ్చిచ్చాను.

"చూశావయ్యా నీ మనవడికి ఎంతసేపూ నీ గొడవే తప్ప, యింటికొచ్చిన వాళ్ళం మాక్కాస్త కాఫీనీళ్ళన్నా ఇవ్వాలనే ధ్యాస ఉందేమో ?" అన్నాడు కరణం మళ్ళీ.

కరణంలో ఎప్పుడూ కృత్రిమత్వం కనిపిస్తుంది నాకు.

"కాస్త వాళ్ళక్కూడా కాఫీనో పాలో ఇవ్వరా"

"అలాగే తాతయ్యా!" అంటూ లోపలికి వెళ్ళబోతున్న నన్ను మున్సబు చేయి పుచ్చుకుని ఆపాడు.

"ఊరికే అన్నాం పంతులూ! మేం కాఫీ, టిఫినూ అంతా అయిన తర్వాతే వచ్చాంలే అన్నాడు మునసబు.

"రాఘవులూ! అప్పుడే ఏడవ్వొస్తూంది. తొందరగా బయలుదేరు. అవతల బోలెడంత పనుంది" అన్నాడు కరణం.

"ఎక్కడికి?" అడిగాను.

"ఏలూరికోయ్"

"ఇవాళ తాతయ్య రాడు. మీరిద్దరూ వెళ్ళండి"

"పని పాడవుతుందిరా" అన్నాడు తాతయ్య.

"రాత్రంతా ఒళ్ళు తెలియకుండా పడుండి ఇప్పుడు ఏలూరెళ్తావా?"

"పిచ్చి సన్నాసీ జ్వరం జారిందిగా"

"మళ్ళీ వస్తుంది ఇప్పుడు నువ్వెళ్తే. వెళ్ళటానికి వీల్లేదు తాతయ్యా"

"నా మాట విను నాన్నా! ఓపిక లేకపోతే నేను మాత్రం వెళ్తానంటానా?" అన్నాడు తాతయ్య.

"మళ్ళీ జ్వరం రావటానికేగా?"

"ఏం రాదులే. ఏలూరెళ్ళగానే పెద్ద డాక్టరు చేత సూది మందు పుచ్చుకుంటా అంత అవసరమయితే."

"వద్దు తాతయ్యా"

"పంతులూ! ఊరికే గొడవ చేయబోకు. మేం లేమా ఆయన పక్కన?"

అన్నాడు కరణం విసుగ్గా.

నేనెంత చెప్పినా తాతయ్య వినలేదు. స్నానం అదీ కానిచ్చి వాళ్ళతో కలిసి ఏలూరెళ్ళిపోయాడు.

చాలాసేపు అలాగే కూచుండి పోయాను.

నేను లేచి స్నానం కానిచ్చేటప్పటికి ఎనిమిదయింది. పక్కింటి రత్తమ్మ పంపించిన పెరుగేసుకుని కాస్త అవ కాయ నంచుకుని అన్నం తిన్నాను.

కాలేజీకి బయలుదేరాను.

మనసు స్థిమితంగా లేదు తాతయ్య వెళ్ళటం మూలాన. ఎప్పుడూ అంతే ఆయన. ఎవరెంత చెప్పినా వినడు. తన పట్టు విడిచిపెట్టడు.

ఆలోచిస్తూ పరధ్యానంగా సైకిలు తొక్కుతున్న నాకు లారీ ఎదురయింది. పక్కనించి దూసుకుపోయింది మృత్యువులా. అరక్షణం గుండె జలదరించింది.

నేను చచ్చిపోతే తాతయ్యని చూసే వారెవరు?

విచక్షణ పలకరించింది మనసుని.

రోడ్డు పక్కనుంచి తొక్కటం మొదలెట్టాను సైకిలు.

రోజూ సరిగ్గా ఇరవై నిమిషాలు పట్టేది ఆ దూరాన్ని దగ్గర చేయటానికి కాని ఆ రోజు క్లాసు రూంలోకి అడుగు పెట్టేసరికి ఆలస్యమయింది.

క్లాసుకి నేను లేటుగా వెళ్ళటం సామాన్యంగా జరగదు. అందుకే నేనెప్పుడన్నా ఓ రోజు లేటుగా వెళ్ళానంటే క్లాసంతా నా వేపే చూస్తారు లెక్చరర్‌తో సహా.

తలొంచుకుని నడిచాను నా సీటు దగ్గరికి.

రోజూ ముందర బెంచీలో కూచుంటాను నేను. ఒకవేళ నే రావటం లేటయినా నా సీటు ఖాళీగానే ఉంటుంది తప్ప అక్కడ ఎవరూ కూచోరు.

యధాలాపంగా క్లాసంతా కలయ చూశాను లక్ష్మి కోసం.

ఎక్కడా కనపడలేదు.

ఇంటర్వెల్‌లో లక్ష్మిని కలిసి కాసేపు గడుపుదామనిపించింది. తను కనపడక పోవటంతో ఒక్క నిమిషం కూడా ఉండ బుద్ధికాలేదు.

పన్నెండింటికే ఇంటికి బయలుదేరాను.

ఎందుకో తెగ విసుగు పుట్టింది. లక్ష్మి కూడా కాలేజీకి రాలేదు. తనని రోజూ చూడకపోతే ఎలాగో ఉంటుంది.

ఎందుకు రాలేదో? సాయంత్రం ఎలాగూ గుడికి వస్తుందికదా అని సర్ది చెప్పుకున్నాను.

ఇంటికి చేరి ఒక్కడినీ ఆలోచిస్తూ పడుకున్నాను. ఒంటరితనం అణువణువునా కమ్ముకుపోయింది.

ఎందుకీ ఒంటరితనం నన్ను క్షయ వ్యాధిలా పీడిస్తోంది? ఎన్నోసార్లు తర్కించుకున్నా నాలో నేనే. తర్కంలో సమాధానం దొరికే ప్రశ్న కాదేమో ఇది.

"నీకు పెళ్ళి చేసేస్తారా" అంటూంటాడు తాతయ్య.

పెళ్ళయితే ఒంటరితనం పోతుందా?

లక్ష్మి నాదయితే ఒంటరితనం దూరం కావచ్చు. అయినా-

చుట్టూ మనుషులున్నంత మాత్రాన ప్రతి మనిషికీ ఒంటరితనం నుంచి విముక్తి దొరకదేమో!

అది నా అనుభవం!

పదిమంది పరిచయాలలో ఉండీ ఏ మనిషికీ కాకుండాపోవచ్చు కూడా! అర్థం చేసుకునే ఒక్క తోడు చాలదూ జీవిత కాలానికి?

కాలం వెంట పరిగెడుతున్నాను బేష రతుగా!

ఎక్కడికి చేరుస్తుందో?

ఏ నీడలో పడేస్తుందో?

నా మనసు ఎలా ఏ వైపు సాగి పోతూందో చూసుకుంటే నాకే ఎంతో ఆశ్చర్యమనిపిస్తుంది.

"నా కంటే నువ్వెంతో ఎదిగిపోయా వనిపిస్తుంది అప్పుడప్పుడు" తాతయ్య మాటలు గుర్తొచ్చాయి.

నిజం!

నా వయసులో ఉన్నవాళ్ళలా నేనుం డకపోవటం మూలానేమో నా ఈడు వాళ్ళందరూ నా కంటే చిన్నవాళ్ళని పిస్తుంది.

మనసు తొందరపడి ఎదిగిపోయిందా?

రత్తమ్మ పాలు పంపించేదాకా అలా ఆలోచిస్తూనే ఉన్నాను. అయిదవుతూ వుండటంతో కాస్త కాఫీ పెట్టుకు తాగి గుడికి బయలు దేరాను. లక్ష్మిని కలవ టానికి.

రోజూ అయిదూ అయిదున్నర మధ్యన ఇద్దరం అక్కడికి రావాలి. ఇంటర్ నుంచీ ఇద్దరిలో ఎవ్వరూ మాట తప్ప లేదు. ఎంత పనివున్నా వచ్చి కనపడి వెళ్ళిపోవాలి. అదీ ఒప్పందం.

కాలేజీలో పోట్లాటతో మొదలయి, నోట్సులు ఒకళ్ళ నొకళ్ళు అడిగి తీసు కోవటం దాకా వచ్చింది లక్ష్మితో పరి చయం.

మొదటి సారి లక్ష్మి గుడికొచ్చినరోజు గుర్తుకొచ్చింది.

తల్లో కనకాంబరం పూలు పెట్టుకుని అదే రంగు ఓణి వేసుకుని, తిలకం బొట్టుతో మెరిసిపోతూ వచ్చింది.

కొత్తగా కనిపించింది.

పసితనం ఇంకా పూర్తిగా మాయం కాలేదు!

యవ్వనం అప్పుడే నేస్తం కడు తున్నట్లుంది!

రాగానే దగ్గరికి లాక్కుని ముద్దు పెట్టుకున్నాను. కమ్మటి ముద్దూ, అంత కంటే కమ్మటి పెదాలూ.

"ఇందుకా నన్ను రమ్మంది?" అంది కోపంగా.

"ఇంకా చాలా ఉందిలే...అప్పుడే ఎక్కడ" అన్నా నవ్వుతూ.

"మా మామ్మ అందుకే చెప్పేది ఎప్పుడూ"

"ఏం చెప్పేది?"

"మగపిల్లలతో స్నేహం చెయ్యొ ద్దని."

"అలాగా!"

"చేసినా దగ్గరికి రానియ్యకూ అని"

"ఇంకా ఏం చెప్పింది?"

"నే పోతున్నా" అంటూ విసురుగా వెళ్ళబోతున్న లక్ష్మిని ఆపాను చెయి పట్టుకుని.

"ఇంకెప్పుడూ చెయ్యనులే అలా" అన్నాను.

"నిజంగా?"

"నాతోడు" అన్నా నెత్తిమీద చెయ్యి పెట్టుకుని.

నవ్వేసింది లక్ష్మి.

నాకూ నవ్వొచ్చింది – ఆ మొదటి కలయిక మనసులో మెదలగానే. ఆనాటి నుంచీ, రెండేళ్ళలో ఎన్నో సాయం కాలాలు గడిచిపోయాయి లక్ష్మి సాంగ త్యంలో.

ఎంత మారిపోయిందీ మధ్యకాలంలో!

మూగలాంటి ముగ్ధ...నాకు బాధగా ఉంది నేను ఏడుస్తున్నప్పుడు, తన

గుండెల్లో దాచుకుని నన్ను ఓదార్చే అంత పెద్దరికం తెచ్చుకుంది!

నేను ముద్దు పెట్టుకుంటే సిగ్గుపడి కోపం తెచ్చుకున్న మనిషి నాకు తెలిపి రావనంతగా దగ్గరయింది.

ఆ కావలింత కోసం మనసు మళ్ళీ వలవరించింది.

చీకటి పడింది.

మనసు పాడయింది.

నాకు తెలుసు చీకటిపడితే లక్ష్మి రాదని. అయిదుగంటలకే వచ్చినా, ఆల స్యంగా ఆరుగంటలకే వచ్చినా చీకటి పడగానే మాత్రం ఠంచనుగా ఇంటికెళ్ళి పోతుంది. అటువంటి లక్ష్మి చీకటిపడ్డాక ఎలా వస్తుంది?

నిరాశతో నిట్టూర్పులు విడుస్తూ ఇంటికి చేరాను. టైం చూసుకున్నాను. ఏడున్నరయింది.

తాతయ్య రాలేదింకా.

పొద్దునపగా వెళ్ళిన మనిషి అంత వరకూ రాకపోవటంతో నాకు కంగారు పుట్టింది. మున్సబుగారింటికి వెళ్ళాను కనుక్కుందామని. ఇంకా రాలేదని చెప్పారు ఇంట్లో ఆడవాళ్ళు.

కరణం యింట్లో బాతాఖానీ వేసుక కూచున్నారేమో అని వెళ్తే అక్కడా కన పడలేదు. చేసేదిలేక ఇంటికొచ్చేశాను.

అన్నం తినబుద్ధికాలా ఎనిమిదవు తున్నా. తాతయ్య ఏడయ్యేసరికి ఇంటికి చేరకపోతే నాకు చాలా గాభరాగా ఉంటుంది.

అమ్మ ఒడి ఎరక్కపోయినా, ఆయన ఒళ్ళోనే ఎన్నిసార్లో వాళ్ళని లేప తెచ్చుకున్నాను.

నా గురించి ఎప్పుడూ ఆలోచించే మనిషి ఆయనొక్కరే!

నేను కడుపునిండా అన్నం తిన్నానో లేదో, హాయిగా నిద్రపోయానో లేదో చూసుకునే మనిషీ ఆయనొక్కరే. ఆయనే కనక లేకపోతే ఏ అనాథాశ్రమం పాలయ్యే వాడినో!

పదయింది.

మరో రెండుసార్లు వెళ్ళాను మునసబూ, కరణాల ఇళ్ళకి. ఎక్కడా ఆయన జాడాలేదు. అంతవరకూ వీళ్ళు ఎందుకు రాలేదు? అంత అర్జంటు పనేముంది ఏలూరులో?

మళ్ళీ ఇంటికొచ్చాను.

మరో రెండు గంటలు గడిచాయి అతి మెల్లగా.

నిద్రపట్టలేదు అర్ధరాత్రయినా. ఎలా పడుతుంది? మళ్ళీ బయటకు బయలు దేరాను.

కరణం ఇంటి గుమ్మం చేరినా.వెంటనే తలుపు తట్టలేకపోయాను. అర్ధ రాత్రి నిద్రలేపితే ఏమనుకుంటారో అని తటపటా యించాను. ఏమయితే అది అయిందిలే అనుకుని తలుపు తట్టాను.

కరణంగారి భార్య తలుపు తీసింది. వెనకనే లక్ష్మి నిలబడి వుంది.

"వీళ్ళింకా రాలేదాండీ ?"

"ఇందుకా నాయనా అర్ధరాత్రి నిద్ర లేపింది ?"

"కాదండీ ..."

"ఎందుకయ్యా అంత కంగారు ?"

"పన్నెండయిందండీ! ఇంకా..."

"అయితే ? పనికాలేదేమో ఇవాళ ఏలూరులోనే ఏదో లాడ్జింగులో ఉండి పోయుంటారు" అందావిడ

ఆవిడ చెప్పిందీ నిజమేననిపించింది. ఇంటికి బయలుదేరాను వెనక్కి.



అంతకు ముందోసారి కూడా తాతయ్య అలానే చేశాడు. కాస్త నెమ్మది పడింది మనసు.

కానీ—

ఇంటికి చేరి, మంచం మీద వాలినా కళ్ళు మూతపడలేదు. అప్రయత్నంగా పొట్ట తడుముకున్నాను. లోతుగా అనిపించింది అన్నం తినకపోవటం మూలాన.

కానీ ఆకలివేయటంలేదు.

ఆప్యాయంగా నా కడుపు నిమిరే ముడతలు పడిన తాతయ్య మెత్తటి, చల్లటి చెయ్యి మనసులో మెదిలింది.

"నేను చచ్చిపోయాక నిన్నెవరు చూస్తార్రా నాన్నా?"

"నువ్వటువంటి మాటలు మాట్లాడా



వంటే నాక్కోపం వస్తుంది."

"కాదురా! నీకు పెళ్ళిచేస్తే, నీకన్నం పెట్టేందుకూ, నిన్ను చూసుకునేందుకూ ఓ మనిషంటూ ఉంటుంది."

"నీ కెప్పుడూ పెళ్ళి మాటే"

"ఒరేయ్ నేనొకటడుగుతాను చెప్పు?"

"ఏమిటి?"

"నీకు పెళ్ళిచేసేశాననుకో?"

"అనుకుంటాను."

"సినిమాలో హీరోయిన్ లాంటి మంచిపెళ్ళాం... అందమైన పెళ్ళాం వచ్చిందనుకో?"

"అదీ అనుకుంటాలే."

"నాకూ, నీ పెళ్ళానికీ పడదనుకో"

"ఎందుకు పడదు?"

"నన్ను ఇంట్లోంచి గెంటేయమంద నుకో నీ పెళ్ళాం? అప్పుడు నువ్వేం చేస్తావు?"

"........."

"చెప్పవేం ?"

నాకు ఏడుపొచ్చింది. ఏడ్చేశాను తాతయ్యని కావలించుకుని గట్టిగా.

"నేనసలు పెళ్ళే చేసుకోను.



ఎప్పుడూ నీతోనే ఉంటా"

"పిచ్చి సన్నాసి"

ఎన్నిసార్లు ఏడిపించేవాడో తననలా!

అరుగు మెట్లమీద చప్పుడు విన పడింది. ఒక్కసారిగా గుండె కొట్టుకుంది. మంచంమీద లేచి కూచున్నాను.

"పంతులూ!" మునసబు వచ్చాడు నా గదిలోకి.

"ఇంతసేపయిందేంటండీ?"

"అది కాదు పంతులూ..."

"ఏంటండీ?"

"మరే..."

ఒక్క ఉదుటున లేచి నిలబడ్డాను.

"చెప్పండీ ఏమయింది?"

"మీ తాతయ్య హాస్పిటల్లో ఉన్నాడు"

"ఏమిటీ?"

"లారీ గుద్దుకుంది"

"........."

"మిషనాస్పిటల్లో చేర్పించాం. బయట చిన్న కారుంది. పద"

పిచ్చాసుపత్రిలో డాక్టరు పేషంటుని నడిపించినట్లు నడిపించాడు మునసబు నన్ను కారు దగ్గరికి.

* * *

నేను ఏలూరు చేరుకునేలోగా తాతయ్య చచ్చిపోతే...?

అద్దాలన్నీ మూసిన కార్లో కూర్చున్నా చలిగాలి సోకినట్లు వెన్నెముకలోంచి వణుకు పుట్టింది. ఇంకెప్పుడూ తాతయ్యని ఇంట్లో కూచోపెట్టాలని నిశ్చయించుకున్నాను. బయటికి వెళ్ళనివ్వకూడదు ఏది ఏమయినా.

హాస్పిటలు చేరగానే అడిగాను మునసబుని. తాతయ్యని ఉంచిన రూం నెంబరు చెప్పాడు.

పరిగెత్తానేమో!

ఏ కట్టూ లేకుండా మామూలుగా పడుకున్న తాతయ్యని చూడగానే మనసు కుదుట పడింది. ఆయన పక్కనే కూచున్నాను కళ్ళు తెరుస్తాడేమో అని.

డాక్టరుని అడిగి తెలుసుకుందామనిపించింది పరిస్థితి ఎలా ఉందో. రౌండ్స్‌లో ఉన్నాడని చెప్పింది నర్సు.

అరగంట పోయాక వచ్చాడు డాక్టర్.

"పెద్ద ప్రమాదం లేదుగా?" అడిగాను.

అతను మాట్లాడలేదు. బెడ్ దగ్గరున్న చార్టు చూస్తూ నిలబడ్డాడు. నాకు కంగారు ఎక్కువయింది.

మళ్ళీ అడిగాను డాక్టర్ని.

"పైన దెబ్బలేం తగల్లేదు కానీ..."

"ఏమిటి?"

"ఆయన పరిస్థితి అంతగా బాగోలేదు"

"ప్రమాదం లేదుగా?"

"అంత సీరియస్ కాదులెండి"

మనసెందుకో కీడు శంకించింది.

నోరు తెరుచుకుని పడుకున్న తాతయ్యను చూస్తుంటే గుండె నీరయిపోయింది. ఆయనకి స్పృహ వస్తుందేమోనని అక్కడే కూచున్నాను.

తాతయ్యని ఆ స్థితిలో చూస్తుంటే చిత్రమనిపించింది. పసిపాపల ముఖాల్లో కనపడే అమాయకత్వం కనిపించింది ఆయన ముఖంలోనూ.

శైశవంలోని సొగసు మళ్ళీ ముసలితనంలో వస్తుందా మనిషికి?

"ఒరే! నువ్వు చదువయిపోయిన తర్వాత ఏం చెయ్యాలో తెలుసా?"

"ఏం చెయ్యాలి?"

"కలెక్టరువి అవ్వాలి"

"ఓస్ ఇంతేగా! అవుతాలే"

"అప్పుడు నీకో పెద్ద బంగళా ఇస్తాను. కారు కూడా ఉంటుంది. ఆ బంగళాలో నా కోసం ఓ మంచి గది ఏర్పాటు చెయ్యాలి"

"అలాగే చేస్తాలే"

"నేను పిలవగానే అన్ని పనులు చేసి పెట్టేందుకు ఇద్దరు నౌకర్లని పెట్టాలి"

"నౌకర్లొద్దు తాతయ్యా"

"మరి...?"

"నేనే చేసి పెడతాను నీకన్నీ"

"నేనంటే నీకెంత ఇష్టంరా"

చిన్నప్పటి రోజులన్నీ తలుచు కుంటుంటే ఎంత గమ్మత్తుగా ఉంటుంది! జీవితమంతా అటువంటి క్షణాలతో, ఘడియలతో నిండిపోతే ఎంతో బావుండు ననిపిస్తుంది.

'తాతయ్య కలలన్నీ నిజం చెయ్యాలి' అనుకున్నాను.

అలా అనుకున్న పాపానికేమో, ఆ రాత్రి తెల్లవారకుండానే తాతయ్యని నా నుండి ఎంతో దూరంగా తీసుకుపోయాడు దేవుడు.

ఊహ తెలిశాక తెలిసిన ఒక్క బంధం కూడా తెగిపోయింది. . ఎవరో కవి చెప్పినట్లు దారం తెగిన గాలిపటంలా కనబడ్డాను నాకు నేను.

మనసూ, శరీరం రెండూ స్థంభించి పోయాయి.

మునసబు పక్కనే ఉండి అన్నీ జరి పించాడు.

అమ్మా, నాన్నా లేని అనాథననే భావన నాలో ఏనాడూ కలగలేదు తాతయ్యా పెంపకంలో. ఆయన లేని లోటు కొట్టొచ్చి నట్లు కనబడింది. భూమ్మీదే ఉన్నామను షలు లేని మరో గ్రహం మీదికి నన్నె వరో విసిరేసినట్టనిపించింది.

పిశాచిలాంటి ఒంటరితనం. అంతకు ముందు లేని పది వేల చేతులూ నా కోసం తెచ్చుకుని, నన్ను చుట్టుముట్టి బంధించి నట్లయింది.

కాలేజీకి వెళ్ళటం మానేశాను.

వెర్రివాడిలా గడిపాను ఎన్నో క్షణాలు ఒక్కడినీ.

పదిహేను రోజులు గడిచిపోయాయి నాకు తెలియకుండానే.

శూన్యం నిండిన సున్నాలా కన బడింది నా రూపం, నా జీవితం.

లక్ష్మి గుర్తొచ్చింది.

శూన్యం మాయమవుతుందనే ఆశ కళ్ళముందు మెదిలింది.

కాలేజీకి బయలుదేరాను. ఒంటిగంట యింది. ఇంటర్వెల్ అయిపోయి మళ్ళీ క్లాసు మొదలయినట్లుంది.

క్లాసులో అడుగు పెట్టిన నన్ను అందరూ కాసేపు ఎగాదిగా చూశారు. ఓ అరనిమిషం తరువాత మళ్ళీ మొదలు పెట్టాడు లెక్చరర్ పాఠం చెప్పటం.

నా కోసం ప్రపంచం ఎందుకు ఆగు తుంది ?

వెనక బెంచీ వేపు చూశాను.

లక్ష్మి కనబడలేదు. సరిగ్గా ఎప్పుడు కలవాలనుకుంటానో అప్పుడే కనపడదు. ఎన్ని రోజులయిందో తనని కలిసి. విసుగొచ్చింది.

క్లాసయి లెక్చరర్ వెళ్ళిపోగానే సుందరాన్ని బయటికి లాక్కెళ్ళాను.

"ఏరా లక్ష్మి రాలేదా ఇవాళ ?" అడి గాను.

"చాలా రోజులయింది కాలేజీకొచ్చి" అన్నాడు వాడు.

"ఎన్నిరోజులయింది?''

"నువ్వా రోజు వచ్చావు చూడు .. పన్నెండింటికే వెళ్ళిపోయావు పనుందని. ఆ రోజు నుంచీ తనూ రాలేదు"

పదిహేను రోజుల్నించీ లక్ష్మి కూడా కాలేజీకి రాలేదు.

ఎందుకనో ?

సచ్చుని అడిగితే తెలుస్తుంది అసలు విషయం.

సుందరం చేత కబురు పెట్టాను. వెంటనే క్లాసు బయటకొచ్చింది సచ్చు. వస్తూ వింతగా చూసింది నన్ను.

"తొందరగా రా'' అంటూ చెయ్యి ఊపాను.

"నేనే నీతో మాట్లాడాలనుకున్నా రాజూ!" అంది సచ్చు.

"ఏమిటి ?''

"అలా వెళ్దాం పద" అంటూ కాలేజి బిల్డింగ్ వెనక వైపుకి తీసుకెళ్ళింది నన్ను.

నాకు ఆరాటం ఎక్కువయింది.

"లక్ష్మి ఎందుకు రా లే దు ఇన్ని రోజాలూ ?" అడిగాను సచ్చుని.

"హైదరాబాద్ వెళ్లిపోయింది"

"ఎప్పుడు?"

"పది రోజులయింది"

"నాతో చెప్పకుండా నే వెళ్ళి పోయిందేం?"

"నువ్వు కాలేజీకి రాలేదుగా ?''

"ఇంటికి రావచ్చుగా తను ?"

"ఇంటికెలా వస్తుంది ?"

హైదరాబాదు అంత దూరం వెళ్తున్నప్పుడు ఇంటికొచ్చి ఎందుకు చెప్పలేక పోయిందో అర్థం కాలేదు. అయినా ఉన్నట్టుండి ఈ ప్రయాణం ఏమిటి ?

"మళ్ళీ ఎప్పుడొస్తుంది ?" అడిగాను.

"ఏమో!"

''అదేం ! నీతో కూడా చెప్పలేదా ?"

"హైదరాబాదులో వాళ్ళ మావయ్యా వాళ్ళు ఉన్నారు''

"ఉంటే ...?"

"వాళ్ళ మావయ్యకి ఓ కొడుకున్నాడు"

"అయితే ...?"

"లక్ష్మిని అతనికిచ్చి పెళ్ళి చేస్తున్నారు"

"నాన్సెన్స్ !"

"అబద్ధం చెప్పటంలా నేను. ఇదంతా నాకు లక్ష్మి చెప్పింది"

నమ్మలేకపోయాను !

కాలేజీ బయటకొచ్చి సైకిలెక్కాను. ఆ రోజు పన్నెండు నిమిషాలే పట్టింది కాలేజీ నుంచి ఊరు చేరటానికి.

కరణం ఇంటి తలుపులు బాదాను.

తలుపులు తెరచుకున్నాయి.

కరణం కనబడ్డాడు ఎదురుగా. అరుగు మెట్లమీద నిలబడ్డ నన్ను లోపలికి రమ్మని కూడా అనలేదు.

"ఏం కావాలి ?"

"మీతో మాట్లాడాలి" అన్నాను.

"ఏం మాట్లాడతావు ?"

"లక్ష్మి గురించి"

నవ్వుతున్నట్లు చూశాడు కరణం నన్ను. ఆ చూపుతోనే నన్ను వేళాకోళం చేస్తున్నట్లనిపించింది.

"పంతులూ! ఏ ధైర్యంతో లక్ష్మి విషయం మాట్లాడదామనుకుంటున్నావు?"

"లక్ష్మిని నేను పెళ్ళి చేసుకుంటాను"

కరణాన్ని మాట్లాడ నివ్వలేదు నేను. "నేను చదువుకుంటున్నాను. కాలేజీలో ఎప్పుడూ నేనే ఫస్టొస్తాను. నా చదువయి

పోగానే మంచి ఉద్యోగం వస్తుంది నాకు..."

"నా బావ కొడుకు ఉద్యోగం చేస్తున్నాడిప్పుడు. హైదరాబాదులో ఇంజనీరు. అతని జీతం నెలకి రెండువేలు పంతులూ!"

"లక్ష్మి ఇష్టపడిందా?"

"చిన్నపిల్ల ... కొంతవరకూ పాడు చేశావు దాన్ని. ముందరే తెలుసుకున్నాను. అందుకే పంపించేశాను"

"కరణంగారూ..."

"ఈ ఊర్నించి వెళ్ళిపో పంతులూ!"

"నాకు ద్రోహం చేశారు మీరు"

తలుపులు వేసుకున్నాడు కరణం భళ్ళున!

ఊరికి నిప్పంటించాలనిపించింది. ఆ మంటల్లో నేనూ కాలి బూడిదైపోవాలనిపించింది.

ఏం చేయలేకపోయాను.

ఒంటరిని కదా !

అక్కడి నుంచి ఇంటికొచ్చేశాను.

ఎందుకలా జరిగిందో అంతుబట్టలేదు. ఒక్క మాట లక్ష్మి నాతో చెప్పివుంటే అలా జరగనిచ్చేవాడినా ? అందరినుంచీ దూరంగా నాతో తీసుకుపోయి నా మనిషిని చేసుకునే వాడిని.

ఎందుకు కలవలేదు నన్ను ?

నిజంగా నేనంటే ఇష్టం అనేది ఉంటే ఆ మాత్రం చేయలేదూ నా కోసం? నాతో మాట మాత్రం చెప్పలేకపోయిందా ?

ఆలోచించిన కొద్దీ నాకూ, లక్ష్మికీఉన్న బంధం అంతగట్టిది కాదనిపించింది. నేను కోరుకున్నంతగా తను నా తోడు ఆశించలేదేమో !

ఏ ప్రభావానికీ చెదరని ఆత్మలాంటి బంధం అనే అనుకున్నాను, భ్రమ పడ్డాను. ఆ భ్రమని మనస్ఫూర్తిగా నమ్మాను.

ఎంతటి పొరపాటు !?

అందరికీ అందరూ ఉన్నారు.

కానీ...

నాకెవరూ లేరు.

ఒంటరినై జీవితాస నడవగలనా ?

మనసుకి బానిసతనం చేస్తున్న శరీరం నా మాట వింటుందా ?

నమ్మకం నిలబడలేదు నాకు బ్రతుకు సాగించగలనని.

పది రోజులు గడిచిపోయాయి అలాగే ఆ నిరాశలోనే. రెండుసార్లు చూశానంతే కాలేజీ ముఖం.

వెళ్ళి ఏం సాధించాలో అర్థంకాలేదు.

ఇంట్లో కూచుని ఏం చెయ్యాలో అంతకంటే అర్థంకాలేదు.

అసలు బ్రతికి ఏం చెయ్యాలి ?

ఎవరికోసం ?

భ్రమ కూడా లేదుగా బ్రతకటానికి ?

రత్తమ్మ వచ్చేది అప్పుడప్పుడు నాకు ధైర్యం చెప్పటానికి. నా ధోరణి చూసి తనూ రావటం మానేసింది విసుగుపుట్టి. రోడ్డు మీద వచ్చే పోయే జనాన్ని చూస్తూ అరుగు మీద తాతయ్య పడక కుర్చీలో కూచునేవాడిని పిచ్చివాడిలా రోజూ.

"ఏంటి పంతులూ ! కాలేజీకి వెళ్ళటం లేదుట?" అంటూ మునసబు వచ్చాడు ఓ రోజు.

మునసబుతో పాటు వెంట ఎవరో ఉన్నారు.

మాట్లాడలేదు నేను.

"ఈయనెవరో తెలుసా ?" అడిగాడు మునసబు.

"ఎవరు ?"

"మీ మావయ్య"

"... ..."

"మీ అమ్మకి స్వయానా తమ్ముడయ్యా"

"... ..."

"చిన్నప్పుడెప్పుడో చూశావేమోలే. మర్చిపోయుంటావు"

"కూచోండి" అన్నాను.

"అండీ ఏమిటయ్యా !? 'మావయ్యా' అని పిలవాలి. నువ్వొక్కడివే ఉన్నావని నేను ఉత్తరం రాయగానే, పాపం మద్రాసు నుంచి వచ్చాడు నీ కోసం"

ఆ వచ్చినాయన సన్నగా నవ్వాడు.

ఒక్కసారిగా కళ్ళపడిన పరిచయం లేని మనిషిని మావయ్యా అని ఎల పిలవాలి?

"నిన్ను తనతో మద్రాసు తీసుకు వెళ్తాట్ట"

"ఎందుకు ?"

"అక్కడ కాలేజీలో చేరుదువు గాని ఏం?" అన్నాడాయన.

ఏం చెప్పాలో తోచలేదు.

"పంతులూ !"

"ఏమిటి ?"

"వెళ్ళు పంతులూ మద్రాసు. నా మాట విను."

"కాదండీ..."

"నువ్వేం మాట్లాడబోకు. నీకు గాలి మార్పు చాలా అవసరం. అంత దూరం నుంచి ఆయనొచ్చి తీసుకెళ్తానంటుంటే ఇంకేం కావాలి చెప్పు?"

జీవితం అయిపోయిందనుకున్నాను. చరమ దశకి చేరుకున్నాననీ అనుకున్నాను. ఆఖరి మజిలీలో ఏమిటి మలుపు ?

గమ్యంలేని పయనం ఎవరికోసం?

ఎందుకు ?

మళ్ళీ ఆశ పెరిగి, భారమై, నిరాశగా మారాటానికా? తలవంచుకుని కూచున్నా ఆలోచిస్తూ.

"ఒక్కడివీ ఇక్కడ ఎలా ఉందామనుకుంటున్నావు ?" అడిగాడు అనునయంగా ఆయన.

తలెత్తి ఆయన కళ్ళలోకి చూశాను.

అమ్మ కనపడింది లీలగా లిప్తపాటు.

వెచ్చటి సూర్యకిరణాలు పడగానే మబ్బులు చెల్లా చెదరై కరిగిపోయినట్లు, ఒంటరితనం భయపడిపోయి తన ఉడుంపట్టు విడిచిపెడుతున్నట్లు అనిపించింది.

"అలాగే వస్తాను" అన్నాను.




మద్రాసు సెంట్రల్లో రైలాగింది.

నిద్రపోతున్న నన్ను తట్టి లేపాడు మావయ్య. ప్లాట్‌ఫారం మీది కలకలం, రద్దీ చూస్తుంటే ఏదో వింత అనుభూతి కలిగింది. కొత్తదనం వింతగానే ఉంటుందిగా !

మావయ్య చాలా మంచివాడనిపించింది. లేకపోతే మద్రాసునుంచి ఏ దిక్కూ లేకుండా మారుమూల పల్లెలో పడున్న నా దగ్గరకి రావలసిన అవసరం ఆయనకి ఏముందని ? నన్ను తనతో తీసుకొచ్చి నా నుంచి ఆయన ఆశించేదీ ఏం లేదుగా?

స్టేషన్ నుంచి అన్నానగర్‌లో ఉన్న వాళ్ళింటికి చేరటానికి ఆటోలోనే గంట పట్టింది.

ఇంట్లో అడుగు పెట్టగానే అర్థమయింది మావయ్య కూడా మధ్యతరగతి మనిషేనని. ఇల్లు కూడా మధ్యతరగతిగానే ఉంది.

"నెలల పిల్లాడిగా ఉన్నప్పుడు చూశారా నిన్ను" అంది అత్తయ్య నన్ను తేరిపార చూస్తూ.

నవ్వాను సన్నగా.

"రాజూ! కాస్త మొహమాటం తగ్గించాలి నువ్వు. మేం పరాయివాళ్ళం కాదు" అన్నాడు మావయ్య.

"అవున్రా మా దగ్గర నీకు మొహమాటం ఎందుకు చెప్పు?" అంది అత్తయ్య.

"అదేం కాదులే" అన్నాను.

ఇద్దరికీ కాఫీ పెట్టిచ్చింది అత్తయ్య.

"వంటయిందటే?" అడిగాడు మావయ్య.

"మీరివాళ ఆఫీసుకి వెళ్తారా?"

"వెళ్ళాలి తొమ్మిదిన్నరయింది. నీళ్ళు తోడు నాకు"

స్నానం, భోజనం కానిచ్చి ఆఫీసుకెళ్ళిపోయాడు మావయ్య.

రాత్రి రైల్లో సరిగ్గా నిద్ర లేకపోవటం మూలాన ఓ కునుకు తీశానేమో అత్తయ్యొచ్చి లేపేదాకా మెలకువ రాలేదు.

స్నానం చేశాక నేనూ, అత్తయ్యా భోజనానికి కూచున్నాం.

"ఇంట్లో మీరిద్దరేనా అత్తయ్యా!?"

"ఇంకో మూడు శాల్తీలున్నాయి నాయనా! పెద్దది శాంతి ఎం. ఎ. చేస్తోంది. రెండోవాడు మురళీ ఇంటర్‌లో ఉన్నాడు. ఆఖరిది కృష్ణ మూడో క్లాసు చదువుతోంది. మీ రొచ్చే ముందరే వెళ్ళారు వాళ్ళందరూ"

"సాయంత్రం దాకా రారా?"

"దిగుతారు ఒకరొకరే ఇంకాసేపట్లో అదేం అప్పుడే చెయ్యి కడిగేశావు?"

"అయిపోయిందిగా"

"మజ్జిగ అన్నం తినవూ?"

"తినలేదా?"

"నీకూ ఉందన్నమాట ఈ పరధ్యానం? ఆయన ఒక్కరితోనే వేగలేక చస్తున్నా. సుష్టుగా భోంచేసి 'ఒసేవ్ నేనివాళ్ళ అన్నం తిన్నానుటే?' అనడుగుతారు. ఆ కంచంలో నీళ్ళు పారబోయి మళ్ళీ పెడతాను అన్నం"

"వద్దత్తయ్యా! కడుపు నిండిందిలే" అంటూ లేచాను.

కాసేపు ఇల్లంతా చూశాను.

ఎంత చూసినా మూడు గదులూ వంటిల్లూ తప్ప ఇంకేం కనిపించలేదు. ఇంట్లో చెప్పుకోదగ్గ ఫర్నిచరూ లేదు.

"మీ మావయ్య పన్నెండొందల జీతగాడురా" తాతయ్య ఎందుకనేవాడో అర్థం కాలేదు.

అంత జీతగాడయితే అలా ఎందుకున్నారు?

"అత్తయ్యా ఇరుగ్గా లేదూ ఈ ఇల్లు?" అడిగాను అత్తయ్యని.

"సర్లే! ఈ మాత్రం దొరికినందుకే సంతోషించాలి ఇక్కడ. దీనికి అద్దెంతో తెలుసా?"

"ఎంత?"

"మూడొందలు!"

నాకూ, తాతయ్యకీ నెల రోజుల ఖర్చు అంతకంటే తక్కువే అయ్యేది. ఆశ్చర్యం వేసింది ఒక్క ఇంటికే వాళ్ళంత డబ్బు పెడుతున్నందుకు.

"చాలా కష్టంగా ఉందిరా గడవటం. ఆయనకి చేతికొచ్చేది తొమ్మిదొందల చిల్లర. మిగతాది లోన్ కటింగ్‌కి

పోతుంది. ఏదో అవస్థపడుతున్నాం"

గదిలోకెళ్ళి పడుకున్నా ఆలోచిస్తూ.

నాకోసం ఆ మాత్రం చేయటానికి ముందుకొచ్చిన మావయ్యకి నేనూ ఏదో చేయ్యాలనిపించింది.

నెల నెలా నాకొచ్చే డబ్బులో కొంత మావయ్యకి ఇవ్వాలని నిశ్చయించుకున్నా. ఆలోచిస్తూనే నిద్రలోకి జారిన నాకు నాలుగు గంటలకి మెలకువ వచ్చింది.

కాఫీ పుచ్చుకుని నా గదిలోకి అడుగు పెట్టిందో అమ్మాయి. శాంతి కావచ్చు ననుకున్నాను. కాఫీ నా చేతికందిస్తూ అంది—

"నా కంటే చిన్న వాడివయి పోయావు. లేకపోతే 'బావా' అని పిలిచే దాన్ని"

చురుకైన మనిషనిపించింది.

"ఇప్పుడు మాత్రం ఏం? పిలవ కూడదా?" అన్నా లేచి కూచుంటూ.

"కాఫీ తాగు" అంది నవ్వుతూ.

"హాయ్ బావా!"

ఆ 'హాయ్' ఎవరో చూశాను. మురళి కాబోలు దూసుకుంటూ వచ్చాడు గది లోకి.

"ఈ గది మా ముగ్గురికీ బావా! కొత్త మెంబరెవరా అని అడిగితే మీ బావని చెప్పింది అమ్మ"

"రాజూ! వీడికి కాస్త వాగుడెక్కువ. సర్దుకుపోవాలి నువ్వు" అంది శాంతి.

"నన్నందరూ అపార్థం చేసుకుంటారు బావా! అది సరే కానీ ఇవాళ్టి నుంచీ నలుగురం అయిపోయాం కదా! ఇంకో మంచం ఏర్పాటు చేయిస్తున్నా"

"మేనేజ్ మెంటంతా నీదన్నమాట?" అన్నాను.

"అఫ్‌కోర్స్ మగాడిని కదా! నేనే చూసుకోవాలి. అన్నట్టు చెప్పటం మర్చి



పోయాను. నువ్వు కాస్త మొహమాటస్తుడివని చెప్పింది అమ్మ. ఊరికే తెగ మొహమాట పడకు. నేనున్నాను నీకేం కావల్సినా. అర్థమయిందా?"

"అలాగే సార్ !" అన్నాను.

నవ్వింది శాంతి మళ్ళీ.

"బావా! ఇవాళ నువు మద్రాసు వచ్చిన శుభ సందర్భంలో మనం అందరం సినిమాకి వెళ్దాం" అన్నాడు మురళి.

"మొన్నే కదరా అందరూ వెళ్ళింది సినిమాకి ?" అంది అత్తయ్య గదిలోకి వస్తూ.

"ఇవాళ చాలా మంచిరోజు మమ్మీ ! నువ్వు అడ్డు చెప్పకు. ఏమయినా సరే మేం ముగ్గురం ఇవాళ సినిమాకి వెళ్ళి తీరాల్సిందే. ఏం బావా?''

"పోన్లే అత్తయ్యా వెళ్దాం ఇవాళ ఒక్క రోజూ" అన్నా.

"మరి నేనో ?"

గుమ్మం దగ్గర నిలబడి వుంది అది. దాని మొహం చూడగానే నాకు ముద్దొచ్చింది.

"తమరి పరిచయం నాకింకా కాలేదే?" అన్నాను.

''మా అనుంగు సోదరి కృష్ణకుమారి." అన్నాడు మురళి చెయిచాపి దాని వేపు చూపిస్తూ.

"ఇలా రా" పిలిచాను దాన్ని.

సిగ్గుపడిపోయింది అది. మురళి దాని చెయి పుచ్చుకుని నా దగ్గరికి తీసుకొచ్చాడు.

''నన్ను పెళ్ళి చేసుకుంటావా ?" అడిగాను. మాట్లాడలేదది.

"చెప్పు" అంటూ గట్టిగా ముద్దు పెట్టుకున్నాను దాన్ని.

"నేనేం చేసుకోను" అంది కోపంగా.

''ఎందుకు చేసుకోవు?"

"మీరు నన్ను ఊరికే నలిపేస్తున్నారు" అంది.

నవ్వారు అందరూ.

"నేను నీ బావనే" అంటూ మళ్ళీ ముద్దుపెట్టుకున్నా.

"ఛీ సిగరెట్టు వాసన'' అంది.

"అలా అన్నావంటే సినిమాకి తీసుకెళ్ళం నిన్ను'' అన్నా నవ్వుతూ. వాళ్ళ అమ్మ దగ్గరికి వెళ్ళిపోయింది.

సినిమాకి అత్తయ్యని కూడా రమ్మంటే రానంది. మావయ్య ఇంకా యింటికి రాలేదు. మేం నలుగురం బయలుదేరాం. దారి పొడుగునా మురళి వాగుతూనే ఉన్నాడు. శాంతి ఎన్నిసార్లు విసుక్కున్నా వాడు మానలేదు తన ధోరణి.

మేం వెళ్ళింది ఇంగ్లీషు సినిమా.

ముద్దులు చూస్తూంటే లక్ష్మి గుర్తొచ్చింది.

తియ్యటి తీపికంటే బావుండే లక్ష్మి కమ్మటి పెదాలూ, కోపం వచ్చినప్పుడు తను పెట్టే బుంగమూతీ గుర్తొచ్చాయి.

ఏదో నిశీధి నిండిన అగాధంలో పడిపోయినట్లు అనిపించింది.

మోసం చేసింది లక్ష్మి. నేను ఊహించుకున్న అందాల ప్రపంచాన్ని కాలరాసి నాకు కాకుండా చేసింది. ఆమె రూపం నా కళ్ళముందు మెదలగానే నాకు నేనే ఓ పగిలిపోయిన రబ్బరు బుడగలా కనిపిస్తాను.

ఎందుకు?

కళ్ళమ్మటి నీళ్ళు కారాయి.

"రాజూ!" అంది శాంతి నెమ్మదిగా.

"ఏమిటి?"

"సినిమా చూసి ఏడ్చేది ఆడవాళ్ళు''

తనకేం తెలుసు నేను ఎందుకు

కన్నీళ్ళని పారబోసున్నానో!

"ఏడుపు కాదు" అన్నాను.

"మరి?"

"కంట్లో నలకపడింది శాంతీ!"

"నిబ్బరం కావాలి మనిషికి" అంది శాంతి నా చెయ్యి వత్తుతూ.

ఆశ్రయం కావాలనిపించింది నాకా క్షణంలో.

నా గుండెలో బాధంతా కన్నీళ్ళుగా ప్రవహించినా ఇగిరిపోయే చల్లటి ఒడి కావాలనిపించింది.

ఎందుకు నేనింత బాధపడుతున్నాను?

తినేందుకు తిండి ఉంది. కట్టుకునేందుకు బట్టా, ఉండేందుకు ఇల్లూ ఉన్నాయి. మాట్లాడేందుకు చుట్టూ మనుషులూ ఉన్నారు.

మరెందుకు?

బహుశా అవన్నీ ఉన్నప్పుడే ఆ లేని దాని విలువ తెలుస్తుందేమో!

ఈ ఆవేదన ఎప్పటికి తీరేది?

ఎన్నాళ్ళకి మాసిపోతుంది?

సినిమా అయిపోయింది. కళ్ళు బాగా ఉబ్బిపోవటంతో నా వేపు పరీక్షగా చూశారు మురళీ, కృష్ణా.

"బావా!" పిలిచాడు మురళి.

"ఏమిటి ?"

"దేవదాసు ఆడుతోంది. సెకండ్ షోకి వెళ్దామా?"

"ఇప్పుడా! ?"

"అవును. ఈ ఇంగ్లీషు సినిమా చూసే ఇంత ఏడ్చావే? దేవదాసు చూస్తే ఎలా ఉంటుందా అని?"

"దేవదాసు సినిమా నాలుగేళ్ళ క్రితం చూశాను. నాకేం ఏడుపు రాలేదే?"

మరిప్పుడెందుకేడ్చావు?"

"మురళీ! నువు నోరుమూసుకుంటావా లేదా?" అంది శాంతి కోపంగా.

'ఈ సినిమా చూస్తుంటే నాకు లక్ష్మి గుర్తొచ్చింది. అందుకే ఏడ్చాను' అని చెప్పాలనిపించింది వాళ్ళకి.

చెప్పలేదు.

పదయింది యింటికెళ్ళేటప్పటికి. భోజనాలుచేసి అందరూ పక్కలమీదికిచేరారు. నాకు మటుకు నిద్రపట్టలేదు.

ఇంటిముందు ఖాళీస్థలంలో ఉన్నగట్టు మీద కూచున్నాను. పున్నమిని చూస్తూ. సంపంగి పూల వాసన సోకింది తియ్యగా.

"ఇంకా పడుకో లేదేం?"

మావయ్య గొంతు వినపడటంతో వెనక్కి తిరిగాను. "నిద్రరావటం లేదు మావయ్యా! అన్నాను.

"ఎలా ఉంది మద్రాసు? నీకు నచ్చిందా?" అడిగాడు, మావయ్య నా పక్కనే కూచుంటూ.

"బానే ఉందిలే" అన్నా.

నీకిక్కడ కాలేజీలో, సీటు కోసమని ప్రయత్నించారా ఇవాళా"

"దొరికిందా?"

"దొరకొచ్చు. నాకు తెలిసిన లెక్చరర్ ఒకాయన ఉన్నాడు. ఆయనకి చెప్పాను."

మావయ్యతో డబ్బు విషయం చెప్పాలని పించింది.

"మావయ్యా"

"ఏమిటిరా?"

"నేనొకటి చెప్తాను-ఏం అనుకోవద్దు"

"చెప్పు"

"మా తాతయ్య బ్యాంకులో ఇరవై వేలు వేశాడు. దానికి నాకు ప్రతినెలా మూడొందలొస్తాయి."

"వస్తే...."

"నూటయాభై నీకిస్తాను ప్రతినెలా."

"అంత దరిద్రుడిని కాదులే నేను."

"అది కాదు.."

"నా ఇల్లు పూటకూళ్ళ సత్రం కాదు రాజూ! రక్తం పంచుకు పుట్టిన చెల్లెలి కొడుకువి. మీ తాతయ్య పోయాడు. నీకెవరూ తోడు లేరని నా దగ్గరకి తీసుకొచ్చాను."

"నీకూ కాస్త ఇబ్బందే కదు మావయ్యా!?"

"నేను తినే పచ్చడి మెతుకులే నువ్వూ తిందువుగాని. నువ్వు ఎంతవరకూ చదువుకున్నా చెప్పిస్తాను. కానీ ఇటువంటి పిచ్చి పిచ్చి మాటలు మాత్రం మాట్లాడ బోకు."

ఆయనకి నిక్కచ్చిగా చెప్పాలని పించింది. వాళ్ళకి ఎందుకు భారం కావాలి?

"నువ్వు పరాయివాడివి కాదు కాబట్టే నీ యింటికి వచ్చాను నువు రమ్మనమన గానే. అందుకే ఈ ఒక్క మాటకీ నువ్వు ఒప్పుకోవాలి."

"ఒద్దు రాజూ!"

"లేకపోతే..."

"లేకపోతే...?"

"నేను వెళ్ళిపోతాను."

"నీ అమ్మ పట్టే నీకూ పచ్చింది. దాని కొడుకువనిపించావు మొత్తానికి."

"రోషం తెచ్చుకోకు మావయ్యా!"

"సరే నీ యిష్టం. అలాగే కానీ. నాక్కావలసింది నువ్వు నా కళ్ళ ముందు ఉంటూ ఓ దారిలో పడాలి. అంతే!" అన్నాడు మావయ్యా చివరికి.

మధ్యగదిలో మూడు మంచాలకి మరో మంచం జతయింది. అందరూ ఆదమరిచి నిద్ర పోతున్నారు నేను గదిలోకి అడుగు పెట్టేసరికి. నేనూ మంచం మీద వాలాను.

కానీ కంటికి కునుకుంటేగా?

చిన్నప్పుడు తెలుగు మాష్టారు చెప్పిన కథలో ఉండే రాత్రించరులూ, నిశాచరులూ గుర్తొచ్చారు. జీవితం ఎలా మలుపు తిరిగిందో ఊహించుకుంటే ఆశ్చర్యం వేసింది. కలలో కూడా అనుకో లేదు నేను మద్రాసు వస్తానని.

పెను తుఫానులో చిక్కుకుని 'ప్రమాదావశాత్తూ' బ్రతికి బయటపడి, తీరానికి చేరిన మనిషిలా చేరాను మద్రాసు.

లక్ష్మి గుర్తొచ్చింది మళ్ళీ.

ఆమె నవ్వూ, ఆ కావలింతా, ఆ రోజులు గుర్తొచ్చాయి.

మనసు మూల్గింది తియ్యటి బాధతో.

ఒంటరితనం మళ్ళీ నా కళ్ళ ముందు పిశాచిలా తాండవం చేసింది అతి భయంకరంగా.

జీవితాంతం ఆమెని అలా తలచుకుంటూనే ఉంటానా?

తనతో నేను కట్టుకోవాలనుకున్న భావి ప్రపంచం కూలిపోయినందుకేమో !

అసలు నా గురించి తను క్షణమైనా ఆలోచిస్తుందా?

లేదేమో!

నేనే కనక తన మనసు మీద అంతటి ముద్రవేసి వుంటే అసలలా జరిగేదా? మరో విధంగా ఉండేది జీవితం.

ఏమిటి విముక్తి?

ఈ బాధ ఎన్ని రోజులు భరించగలను?

లక్ష్మిని అలా అనుక్షణం గుర్తుకు తెచ్చుకుంటుంటే నేను బ్రతకగలనా?

లేదు.

మరేం చెయ్యాలి?

లక్ష్మిని మర్చిపోవాలి!

నేను పెరిగిన ఊరూ, చదివిన

కాలేజీ, స్నేహం చేసిన పరిచయాలూ, అన్నీ మర్చిపోవాలి.

అప్పుడేనేమో నాకు శాంతి.

నాలోని మనిషితో యుద్ధం చేసి, బలవంతంగా మనసులోంచి లక్ష్మి జ్ఞాపకాలనూ, తిష్ట వేసిన ఆమె రూపాన్నీ తొలగించాను- నిద్రలోకి జారేముందర.

* * *

చింతలపూడి బ్యాంకుకి లెటర్ రాశాను ఇదివరకులా బ్యాంకుకి వచ్చి తీసుకోవటం కుదరదనీ, ప్రతీనెలా డబ్బు మద్రాసు అడ్రసుకి పంపించమనీ.

శాంతీవాళ్ళు కాలేజీ నుంచి వచ్చేదాకా ఇంట్లోనే కూచునేవాడిని. మద్రాసంతా నాకు కొత్త. ఒక్కడినీ ఎక్కడికని వెళ్ళగలను ?

శాంతి మంచి సరదా మనిషి. రోజూ సాయంత్రం తను రాగానే ఇద్దరం కలిసి బీచికి పోయేవాళ్ళం. ఏడెనిమిది గంటల దాకా అక్కడ గడిపి ఇంటికి చేరుకునే వాళ్ళం.

మార్పు ఎంత మార్పుని తెస్తుంది మనిషిలో !

కాలేజీలో సీటు దొరకటం చాలా కష్టమయింది. అసలు దొరకదేమో అనుకున్నాను. చివరికి ఎలా అయితేనేం ప్రయత్నం చేసి మావయ్య సంపాదించాడు.

మొదటి రోజు కాలేజీకి వెళ్ళేరోజున మనసు కొత్త ఉత్సాహంతో మునిగిపోయింది. మద్రాసులో కాలేజీ లైఫ్ ఎలా ఉంటుందో ?

మావయ్య కూడా నాతో వచ్చాడు ప్రిన్సిపాల్‌ని కలవటానికి. ఆయనతో ఓ గంటసేపు కూచుని వెళ్ళిపోయాడు.

ప్యూన్ నన్ను క్లాస్ రూంలోకి తీసుకెళ్ళాడు.

"మే ఐ కమిన్ సర్ ?"

నా వేపు చూశాడు లెక్చరర్. ఈ కొత్త శాల్తీ ఎవరన్నట్టుగా క్లాసులో తలలన్నీ కూడా నావేపు తిరిగాయి.

"యస్ కమిన్"

ఖాళీ సీటుకోసం చూశాను.

ముందుగా రెండో వరసలో ఒకటి కనపడింది. తలొంచుకుని సీటు దగ్గరికి నడుస్తుంటే ఎవరో కాలు అడ్డం పెట్టారు.

తూలి పడబోయి సర్దుకున్నాను.

నవ్వులు !

కాని, నాకు మాత్రం వాళ్ళ నవ్వులు, నవ్వుల్లా వినిపించలేదు. ఒక్క నిమిషం ఏమనాలో తోచలేదు.

ఏం మాట్లాడకుండా ఖాళీగా ఉన్న సీటు దగ్గరకెళ్ళి కూచున్నాను. లెక్చరర్ నిశ్శబ్దంగా ఉండమని అరిచేదాకా వాళ్ళ కలకలం సద్దుమణగలేదు.

నాకు కాలు అడ్డం పెట్టిన మొహాన్ని చూశాను.

గళ్ళ చొక్కా, వెర్రితలలు వేసినట్టు జులపాలూ, హిందీ సినిమా హీరోనని త్రికరణశుద్ధిగా నమ్మే వెర్రిబాగుల ఖాడిలా కనబడ్డాడు.

నాకంటే రవ్వంత లావుగానే వున్నాడు. వాడికి ఆ నిమిషంలోనే బుద్ధి చెప్పాలనిపించింది. లెక్చరర్ ముందే వాడిని చితకబాది పచ్చడి చెయ్యాలన్నంత ఆవేశం నన్ను ముంచివేసింది.

ఆరోజు కాలేజీలో మొదటి రోజు. చేరిన రోజే ఎందుకు అనవసరంగా లేనిపోని గొడవలు? అణుచుకున్నాను ఆవేశం.

క్లాసయిపోయింది.

"ఏ ఊరి సరుకో ?"

"బెల్లంపల్లి నల్ల బెల్లంలా ఉంది మొహం"

"మాటలు రావేమో? పాపం వదిలేయండి"

"మన సంగతి తెలిసేదాకా అంతే" విరుసుగా అంది గళ్ళచొక్కా.

మాట్లాడలేదు నేను.

మా ఊరి మొత్తం నేను బుద్ధిమంతుడి ననిపించుకున్నాను ఇదివరకు. అద్దంలో మొహం ఇన్నేళ్ళబట్టి చూసుకున్నా. ఎప్పుడూ నల్ల బెల్లం సాక్షాత్కరించిన పాపాన పోలేదు నాకు. నోరు విప్పలేదు కాని, విప్పితే తిట్టిన తిట్టు మళ్ళీ తిట్టకుండా ఎంతసేపైనా వాళ్ళకి వినోదం అందించగలను.

మరి వాళ్ళకి అలా ఎందుకు కనబడ్డాను?

వాళ్ళ దృష్టి లోపం కాబోలు!

ఇంకో లెక్చరర్ వచ్చి పాఠం మొదలు పెట్టేదాకా వాళ్ళ కామెంట్స్ అలా ధారావాహికంగా సాగుతూనే ఉన్నాయి. నేను కూచున్న చోటుకి ఎలా, ఎందుకు అతుక్కుపోగలిగానో నాకే అర్థం కాలేదు.

నా సహనాన్ని అంతం చేస్తారా వాళ్ళు?

వరసగా మరో మూడు క్లాసులు అయిపోయాయి.

ఆఖరి క్లాసు కూడా అవగానే బయటికి వెళ్ళిపోవాలనిపించింది. గుమ్మం దగ్గర చాలామంది నిలబడ్డారు ఒకళ్ళనొకళ్ళు తోసుకుంటూ. అంత తొందరెందుకు వాళ్ళకి? మెల్లగా ఒక్కొక్కరూ వెళ్ళొచ్చుగా!

మళ్ళా గొడవవుతుందేమోనని వాళ్ళందరూ వెళ్ళేదాకా అక్కడే నిలబడ్డాను. క్లాసు రూం ఖాళీ అయ్యాక నేనూ బయలుదేరాను.

ఎందుకో తొందరగా ఇంటి కెళ్ళిపోవాలనిపించింది. కాలేజీ గ్రౌండ్‌లో నడుస్తున్నాను తలొంచుకుని. నన్ను పిలుస్తున్నట్టు ఏవో వింత శబ్దాలు వినిపించాయి.

ఆగి వెనక్కి తిరిగాను.

చెట్టుకింద నలుగురు ఆడపిల్లలు కూచుని వున్నారు. వాళ్ళకి కాస్త దూరంలో గళ్ళచొక్కా నిలబడివున్నాడు. వాళ్ళ మొహాలన్నీ ఏదో తమాషా చూస్తున్నట్టున్నాయి.

పట్టించుకోకుండా ముందుకు పోతుంటే మళ్ళీ వినిపించింది ఆ కన్నెపిల్లల ఆలాపన.

నన్నో కుక్కపిల్లని పిలిచినట్టు పిలుస్తున్నారు వాళ్ళు!

ఆడపిల్లలు.

ఏం చెయ్యాలి?

మళ్ళీ తలొంచుకుని నడక సాగించాను. వాళ్ళు అప్పటికీ మానక పోవటంతో నా అడుగు ముందుకు పడలేదు వెనక్కి పడింది.

దగ్గరి కెళ్ళాను.

నేను దగ్గర కెళ్ళటంతో వాళ్ళు కాస్త ఆశ్చర్యపోయారు.

"మిస్! మీరు నన్ను పిలిచినట్లున్నారు?"

"................"

"నాకు వినపడ లేదు. క్షమించండి"

"................"

"మీలో చాలా హ్యూమరుంది. తెలుసుకున్నాను. కాని ఇక్కడో చిన్న చిక్కుంది"

"???"

"కుక్కలకి నాగరికత తెలియదు.

అవ కుక్క పిలవగానే మగకుక్క దగ్గర కెళుంది. వెళ్ళకుండా ఎలా ఉండగలదు? రోడ్డు మీదే వాలి గుంటలో అవి పొర్లా తాయి. నాకు ఎటువంటి అభ్యంతరం లేదు. మరి మీ మాటేమిటి?"

ఎర్రబడ్డాయి మొహాలు.

నేనలా మాట్లాడతానని వాళ్ళు ఊహించలేదు.

"నేను రేపు కాలేజీకి వస్తా కదా! ఆలోచించుకుని చెప్పండి. నాకేం తొందర లేదు" అంటూ అక్కడి నుంచి వచ్చేశాను.

అన్ని జతల కళ్ళూ కిందకి వాలి పోయాయి.

నేను వచ్చేముందు ఆ నలుగురి మొహాలూ ఎలా ఉన్నాయో కళ్ళముందు మెదలగానే, అంతవరకూ మరిగిపోయిన నా హృదయం కాస్త చల్లారింది.

బస్సెక్కాను ఇంటికి చేరటానికి.

ఇంటికెళ్ళగానే అందరూ చుట్టుముట్టారు మొదటి రోజు కాలేజీ విశేషాలు చెప్పమని ఏం చెప్పను? జరిగింది చెప్పుకోవటం కూడా విసుగనిపించింది. నోటికి తోచిన సమాధానాలిచ్చాను వాళ్ళందరికీ.

సాయంత్రం బీచ్‌కి వెళ్దామంది శాంతి.

మాకు బస్ దొరికి బీచ్ చేరేటప్పటికి చీకటి పడుతోంది అప్పుడే. చల్లగాలి పలకరించింది ఇసుకలో అడుగు పెట్టగానే.

"ఏం అలా ఉన్నావు?" అడిగింది శాంతి.

కాలేజీలో జరిగినదంతా చెప్పాను.

"ఆ కాలేజీలో వాళ్ళంతా అంతే రాజూ! ఉత్త అల్లరి మూక. కానీ చదువులో మాత్రం ఫస్ట్ అందరూ. తెలుసా?"

"నేను వాళ్ళనేం అనలేదే?"

"కొత్తకదా అలాగే ఏడిపిస్తారు కొన్ని రోజులు"

"ఏమో మా చింతలపూడి చాలా నయమనిపిస్తోంది నాకు మటుకు" అన్నాను.

"అంత బావుంటుందా అక్కడ?"

లక్ష్మి గుర్తొచ్చింది మళ్ళీ.

మనసా వాచా కోరుకున్న మనిషి మాపొన్ని మనసులోంచి మాపివేయటం ఎంత కష్టం!

ఆ క్షణంలో తెలిసొచ్చింది నాకు.

"ఎమ్. ఎ. అయ్యాక ఏం చేద్దామనుకుంటున్నావు?" మాట మార్చాను.

"ఏమో రాజూ! మానాన్న పెళ్ళి చేసేద్దామనుకుంటున్నాడు నాకు. ఏం చెయ్యాలో నేనేం నిశ్చయించుకోలేదు.

"ఉద్యోగం చేయరాదూ?"

"చెయ్యాలనే ఉంది కానీ దొరకాలిగా?"

"మావయ్యని ప్రయత్నం చెయ్యమను"

"నువ్వేం చేస్తావు బి. ఎ. అయ్యాక?" అడిగింది శాంతి తాతయ్య మాటలు గుర్తొచ్చాయి.

"నువ్వు కలెక్టరువి కావాలిరా అనేవాడు మా తాతయ్య ఎప్పుడూ" అన్నాను.

"ఐ. ఏ. ఎస్. ఆఫీసరవుతారన్న మాట తమరు?"

నవ్వాను నేను ఎందుకో.

"ఎన్నో అనుకుంటాం శాంతీ! కానీ అనుకున్నవన్నీ జరిగితే మనిషి మనిషెందుకవుతాడు?"

"చింతలపూడిలో వేదాంతం చెప్తారా?"

"నిజం శాంతీ! మద్రాసు వస్తానని

చతుర ... తెలి



ఎప్పుడూ అనుకోలేదు తాతయ్యా. ఇప్పు డప్పుడే చచ్చిపోతాడనీ అనుకోలేదు. నేను లక్ష్మి కూడా నన్నిలా......''

ఆగిపోయానెందుకో.

''ఎవరా హీరోయిన్ ?" అడిగింది శాంతి.

''హీరోయినూ కాదు, పిండాకూడూ కాదు''

"ఎందుకంత సీరియస్ అయి పోతావు ?"

"మాయరోగం ! ఇంతవరకూ ఎవరూ దానికి ముందు కనిపెట్టలేదు"

"భగ్న ప్రేమికుడి వన్నమాట ?"

''రబ్బిష్ ! ప్రేమ కాదు''

"మరి... ?"

''పెళ్ళి చేసుకుందాం అనుకున్నాను. వెళ్ళిపోయింది నన్ను మోసం చేసి"

"ఎందుకు?"

"నాతో ఏం చెప్పలేదు. కారణం నాకెలా తెలుస్తుంది ?"

"అటువంటి మనిషిని పెళ్ళెలా చేసుకోవాలనుకున్నావు ?"

"ఆ మనిషి నాకు తెలుసనుకున్నాను"

మాట్లాడలేదు శాంతి.

"నాకప్పు డప్పుడు ఏమనిపిస్తుందో తెలుసా శాంతీ ?"

"ఏమిటి?"

"ఏ మనిషీ ఏ మనిషినీ పూర్తిగా అర్థం చేసుకోవటం అనేది జరగని పని అనిపిస్తుంది"

"అదేంకాదు"

''నిజం శాంతీ! ఎంతో దూరం, ఎన్నో రోజులు కలిసి నడిచినా ఏదో ఒకరోజు అర్థాంతరంగా నీ తోడులో నీకే తెలియని ఓ కొత్త రూపం కనబడుతుంది"

చీకటి పడింది.

ఆ చీకటిలో కళ్ళముందటి సముద్రం వింతగా, పెద్దగా కనపడింది.

చాలా సేపు ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూ కూచున్నాం.

"వెళ్దాం పద" లేచింది శాంతి.

''ఇంకా సేపు కూచుందాం''

''లేటయితే మళ్ళీ బస్ దొరకదు''

ఇంటికి చేరగానే భోంచేసి పక్కమీద వాలాను.

ఏదయినా ఓ తోడు నాకూ దొరికితే ఎంత బావుంటుంది. నాలో కలిసిపోయి నా ఆవేదనంతా పంచుకునే తోడు కావాలి. నా అణువణువూ అర్పించటానికి ఓ మనిషి కావాలనిపించింది.

ఎవరితో రాసిపెట్టి వుందో నాకు!

''రాజూ!'' శాంతి పిలిచింది నెమ్మదిగా.

''ఇంకా పడుకోలేదా?'' అడిగాను.

''నిద్ర పట్టటంలేదు'' అంటూ నా మంచం మీద వచ్చి కూచుంది శాంతి.

''నీకూ ఉందన్నమాట నిద్రపట్టక పోవటం?''

''అబ్బే లేదు. ఈ రోజే ఎందుకో ఎంత ప్రయత్నించినా నిద్ర రావటం లేదు.'' ఏమన్నా కబుర్లు చెప్పు?"

''ఏం చెప్పమంటావు?''

''మీ ఊరి కబుర్లు చెప్పు'' అంది కాస్త సర్దుకు కూచుంటూ.

ఆ కదలికకి తన ఒళ్ళు మెత్తగా తగిలింది నాకు. శాంతి వేపు చూశాను. నేనేదో చెప్తానని నా వేపలాగే చూస్తోంది.

''నీకు నిద్ర ఎందుకు రావటంలేదో తెలుసా?''

ఎందుకన్నట్టు చూసింది.

''ఏవేవో ఆలోచిస్తున్నావు అనవసరంగా. ఆలోచిస్తూ ఉంటే నిద్రెలా వస్తుంది?''

''ఏం చేయమంటావు?''

''ఆలోచన మానేయాలి''

''ఎలా మానేయటం? మన చేతిలో ఉందా అది?''

నిజమే!

ఎలా మానేయటం?

''కళ్ళు మూసుకుని ప్రయత్నం చెయ్యి'' అన్నాను ఇంకే చెప్పాలో తోచక.

వెళ్ళి తన మంచం మీద పడుకుంది శాంతి.

తనకి చెప్పటం చెప్పాను. కానీ నేనాచరణలో పెట్టలేకపోయాను. ఆలోచన నన్నొదిలి పెట్టలేదు నిశిరాత్రి అయినా.

చివరికి అనిపించింది. ఈ ప్రపంచంలో ఎవరికీ సమాధానం దొరకని చిక్కుప్రశ్న

ఒక టేనని.

భవిష్యత్తు!

ఎంతోమందికి ఊపిరి పోస్తుంది ఆశలతో.

చచ్చిపోదామనుకునే వాళ్ళని కూడా బ్రతికిస్తుంది అర్థంలేని తియ్యటి ఊహలతో.

*　　*　　*

ఉదయం తొమ్మిదయింది.

వీలైనంత తొందరగా స్నానం, భోజనం కానిచ్చి ఇంట్లోంచి బయట పడ్డాను. తీరా బస్టాండుకి వెళ్ళాక, కాలేజీకి వెళ్ళటానికి ఏ నెంబరు బస్సెక్కాలో గుర్తు రాలేదు.

పక్కనే నిలబడ్డవాళ్ళని అడిగాను. ఇరవై ఒకట్లో నెంబరు వెళ్తుందని చెప్పారు. నా ముందే వెళ్ళిపోయింది అది.

ఉసూరుమంటూ మరో బస్సుకోసం ఎదురుచూస్తూ కూచున్నాను. బస్సు దొరికి క్లాసుకి వెళ్ళేసరికి కాస్త ఆలస్యమయింది.

లెక్చరర్ అప్పటికే పాఠం మొదలెట్టేశాడు.

కామ్‌గా పాఠం వింటూ కూచున్న నాకు చెంపమీద ఫట్‌మని టమోటా తగిలింది. ఆతగిలిన విసురుకి పగిలిపోయి రసం అంతా మొహం మీద, బట్టల మీద చిందింది.

ఎవరు విసిరారో నేను చూడలేదు.

క్లాసంతా నవ్వారు.

నా అవతారం చూశాడు లెక్చరర్. పాపం తన ఉనికిని సార్థకం చేసుకోవాలనిపించిందేమో ఆయనకి.

''ఎవరు చేశారీ పని?'' అడిగాడు.

"ఎవరూ పెదవి కదపలేదు.



ఎవరు చేశారో చెప్పకపోతే క్లాసంతటినీ బయటకి పంపిస్తాను.

ఒక్కళ్ళు చేసిన తప్పుకి మీరందరూ అనుభవించాల్సి వుంటుంది" అన్నాడు మళ్ళీ.

"బయట నుంచి ఎవరో విసిరారు సార్!" క్రితం రోజు నేను క్లాసులోకి వస్తుంటే కాలడ్డం పెట్టిన జులపాలరాయుడి గొంతది.

"ఇట్లులా, ఫట్టుమని కొట్టాడు సార్-విసిరిన చతురుడు ఎవరోకానీ" వెనక బెంచిలోంచి ఎవరిదో యువకవి గొంతులా వినపడింది.

"అయిపోయింది కద సార్! టైం ఎందుకు వేస్ట్ చేయటం? పాఠం మొదలెట్టండి." అన్నాడు జులపాలరాయుడు అదేదో రోజూ జరిగే మామూలు విషయం అయినట్టు.

అర్థమయింది నాకు ఆ పని ఎవరు చేశారో.

క్రమశిక్షణ గురించీ, సత్ప్రవర్తన గురించీ కాసేపు లెక్చర్ ఇచ్చాడు లెక్చరర్. కానీ ఎవరూ ఆయన మాటలు విన్న పాపాన పోలేదు. చేసేదిలేక మళ్ళీ పాఠం మొదలెట్టాడాయన.

మరో రెండు గంటల తర్వాత ఇంటర్వెల్ అయింది.

మొహం అంతా జిగురు జిగురుగా ఉంది టమోటారసం పడటం మూలాన. కాలేజీగ్రౌండ్‌లో పంపు దగ్గర మొహం కడుక్కుని వస్తున్న నాకు నవ్వులు వినపడ్డాయి వెనకనించి.

నా విలన్ కనపడ్డాడు నలుగురి మధ్య పోజు పెట్టి.

"ఆడపిల్లల దగ్గరా వీడి ప్రతాపం?"

"హీరోననుకున్నాడు."

"సాయంత్రం చెబుతా వాడి పని"



అన్నాడు విలన్.

విసుగు పుట్టింది నాకు.

వాళ్ళ దగ్గర కెళ్ళాను.

ఏదో చెప్తానసుకున్నారు వాళ్ళు.

అమాంతం జులపాలరాయుడిని భుజం మీద వేసుకుని పరిగెత్తాను కాలేజీ బయటకి. అంత బలం నాలో ఎక్కడినుంచి వచ్చిందో నాకే అర్థం కాలేదు. ఎందుకో మిగతా వాళ్ళెవరూ నన్నాపలేదు. బొమ్మల్లా నిలబడిపోయారు చూస్తూ.

భుజం మీద గింజుకులాడుతున్న వాడిని కిందకి విదిలించాను కాలేజీ గేటు బయటకి రాగానే. విసురుగా కింద పడ్డవాడు మూల్గాడు.

నాకేం జాలి వేయలా.

నా చెంప మీద పగిలిపోయిన ఃమోటా, అది చూచి క్లాస్‌రూం గోడలు పగిలిపోయేటట్టు నవ్విన క్లాస్‌మేట్సూ

గుర్తొచ్చారు.

నేను కొట్టే దెబ్బలకి అరిచేందుకు కూడా వీల్లేకుండా కొట్టాను.

చుట్టూ జనం మూగారు.

స్టూడెంట్స్ కూడా చాలామంది వచ్చారక్కడికి. కోపంతో పిచ్చివాడినయి పోయిన నన్ను బలవంతంగా ఆపారు. వాళ్ళు ఆపకపోతే ఏం జరిగుండేదో.

కేంటీనుకెళ్ళి మొహం కడుక్కుని కూచున్నాను.

ప్రిన్స్‌పాల్ గారు రమ్మంటున్నారంటూ కబురొచ్చింది నాకు టీ తాగుతుంటే.

వాడిని కొట్టిన విషయం అప్పుడే ఆయనదాకా వెళ్ళిపోయిందని అర్థమయింది. అనవసరంగా ఎందుకు గొడవ పెట్టుకున్నానా అని బాధ పడ్డాను ఆ కబురు విని.

ఏమంటారో ఆయన ?

వెళ్ళిపొమ్మంటారా కాలేజీలోంచి?

"నువ్వింతటి హీరోవని నాకు తెలియదు" అన్నారాయన నేను గదిలో అడుగు పెట్టగానే.

"క్షమించండి. నేను కాలేజీ లోపల ఏం చెయలేదు."

"కాలేజీ లోపల చేసినా, బయట చేసినా నువ్వు కొట్టింది నీ కాలేజ్ మేట్‌ని. తెలుసా ?"

"... ..."

"నీ లాంటి హీరోలు నా కాలేజీకి అక్కర్లేదు. మేనర్స్ తెలిసి బుద్ధిగా చదువుకునే కుర్రాళ్ళు కావాలి."

కోపం వచ్చింది నాక్కూడా. నేను చేసిన తప్పేమిటో అర్థం కాలేదు. కాలేజీ లోంచి వెళ్ళకొట్టినా ఫరవాలేదనిపించింది.

"మీరంత వ్యంగ్యంగా మాట్లాడాల్సిన అవసరం లేదు. ముందు జరిగిన కథ మీకు తెలుసా ?"

"ఏం జరిగింది ?"

ఆయనకంతా చెప్పాను.

"వాళ్ళు చేసింది తప్పే కాదనను. కానీ నువ్విలా రౌడీలా ప్రవర్తించటం ఏం మంచి పద్ధతి కాదు"

"వాళ్ళు చేసింది బావుందంటారా?"

"మళ్ళీ అదే మాట ? నువ్వు చేసింది?"

"నాకు చెపుతున్న మేనర్స్ వాళ్ళకీ మీరు నేర్పించి వుంటే బావుండేది"

"నువ్వు నాకు మేనర్స్ చెబుతున్నట్టుంది ఇప్పుడు"

మాట్లాడలేదు నేను.

"మంచి కుర్రాడివనీ, బాగా చదువుకుంటావనీ నీకి కాలేజీలో సీటిచ్చాను. ఇలా గొడవలు చేయటానికి కాదు."

"... ..."

"ఇంకోసారి ఇటువంటివి నా చెవిన పడకూడదు."

తలూపాను మౌనంగా.

"ఇక నువ్వెళ్ళొచ్చు."

నా జీవితంలో మొదటిసారి అలా చెప్పించుకోవటం చిన్నప్పటి నుంచీ, స్కూల్లోనూ, కాలేజీలోనూ, ఎవరిచేతా మాట పడలేదు. కానీ మద్రాసులో మటుకు ఆ పరువు కాస్తా గంగలో కలిసి పోయింది.

క్లాసులో అడుగు పెట్టిన నన్ను అందరూ కాస్త వింతగా చూశారు. పండో పాయం చక్కగా పని చేసిందన్న మాట.

'నువ్వు మాలో మనిషివి కాదు. పో' అన్నట్లున్నాయి వాళ్ళ చూపులు. నేను లెక్క చేయలేదు వాళ్ళ చూపుల్ని. తలెత్తి నేరుగా వాళ్ళందరి ముఖాలూ చూస్తూ నడిచాను నా సీటు దగ్గరకి.

వాళ్ళే తలలు దించుకున్నారు.

సాయంత్రం కాలేజీ అయిపోయినా ఇంటికెళ్ళబుద్ధికాలేదు ఎందుకో.

బీచికెళ్ళి కూచున్నాను ఒక్కడినీ

ఏదో పోగొట్టుకున్నట్లు అనిపించింది.

చింతలపూడి కాలేజీలో ఎంత బావుండేది!

కాలేజి ప్యూన్ దగ్గర్నుంచీ ప్రిన్సిపాల్ దాకా అందరికీ నేనంటే ఇష్టమే. స్టూడెంట్స్ కూడా నేనేది చెప్పినా కాదనే వారు కాదు.

ఎప్పుడూ ఎవరితోనూ పోట్లాడటం అనేది ఎరగను. ఒకవేళ ఎవరి మీదన్నా కోపం వస్తే ఒకటే నా ఆయుధం.

మాటలు మానేసేవాడిని.

నా దారిన నడిచే వారందరూ!

నాతో కలిసి కూచోటానికీ, మాట్లాడటానికి అంతగా తహతహలాడే వారంపరూ.

మద్రాసు రావటం పొరపాటు చేశానా?

లేదే !

ఆ పాత జ్ఞాపకాలను వదిలి దూరంగా వచ్చేయటం మంచికే జరిగింది. మద్రాసు రావటం మంచిపనే చేశాను. కాకపోతే కాస్త తొందర పడ్డానేమో!

ఆలోచించగా అనిపించింది తప్పు నాదేనేమో అని. కొన్ని రోజులు తలొంచుకుపోతే వాళ్ళే ఊరుకునేవారేమో.

నా గురించి కాలేజీలో ఉన్న చెడు అభిప్రాయాన్ని తుడిచివేయాలి. అందరూ స్నేహం చేయటానికి నా చుట్టూ మూగాలి.

ఏం చేయాలి?

కాలేజీ ఫస్ట్ కావాలి అన్నిటిలోనూ!

నేనెటువంటివాడినో రుజువు చేయాలి.

అంతకంటే వాళ్ళందర్నీ నా దగ్గరికి తిప్పుకోవటానికి తెలివైన మార్గం ఇంకేదీ కనిపించ లేదు. ఏదో చెయ్యాలన్న ఉత్సాహం నన్ను ముంచేసింది ఉప్పెనలా.

రోజూ ఓ పద్ధతి ప్రకారం చదువుకోవటం ఎప్పుడూ ఉండేది కాదు చింతలపూడిలో ఉండగా. పరీక్షల ముందర ఓ రెండు నెలలు చదివే వాడినంతే శ్రద్ధగా. అయినా ఎప్పుడూ కాలేజీలో ఫస్టొచ్చే వాడిని.

నామీద నాకు ఆ నమ్మకం ఇంకా ఉన్నా, ఆ రోజు నుంచే చదువు మొదలు పెట్టాను.

రాత్రి పన్నెండు గంటల వరకూ చదువుతూ కూచున్న నన్ను చూసి కాస్త ఆశ్చర్యపోయారు మావయ్యావాళ్ళు.

మర్నాటి నుంచీ నా పద్ధతి పూర్తిగా మార్చేశాను. కాలేజీలో అందరితోనూ వీలయినంత విడిగా ఉండటానికి ప్రయత్నించాను. తలొంచుకుని నడవటం అలవాటు చేసుకున్నాను మళ్ళీ.

ఇంటర్నల్ ఎసెస్‌మెంట్ దగ్గర పడింది.

చింతలపూడిలో అలా ఇంటర్నల్ ఎసెస్‌మెంట్ నుంచి మార్కులు కలపటం లేకపోయినా, ఎప్పుడూ ఫస్ట్ మార్కులొచ్చేవి. ఆ పరీక్షల్లో నా సత్తా చూపించాలనిపించింది.

కానీ మద్రాసు యూనివర్సిటీ సిలబస్ అంతా నాకు కొత్త. నేను రాకముందటి లెసన్స్ నాకు తెలియవు. ఎలా కవర్ చేయగలను? ఎవరి దగ్గరయినా నోట్స్ తీసుకుంటే...?

ఎవర్నడగాలో అర్థం కాలేదు.

అడిగినా ఇస్తారని నమ్మకం లేదు. క్లాసంతా నన్ను ఒక అంటరాని వాడికింప చూస్తున్నప్పుడు నాకు నోట్సు ఎవరి

స్తారు? అడిగి లేదనిపించుకోవటం ఎందుకు?

ఎలా అయినా కష్టపడి నేనే సాధించా లనిపించింది. ముందు సిలబస్ అంతా తెలుసుకుంటే నోట్స్ నేనే తయారు చేసుకోవచ్చు. లైబ్రరీకి వెళ్ళాను సిల బస్ తీసుకోవటానికి. ఎంత సేపు వెతికినా కనిపించలేదు సిలబస్ కాపీ.

"ఏం కావాలి మీకు?"

వెనక్కి తిరిగాను.

లైబ్రేరియన్ కనపడింది.

ఆమెను చూడటం అదే మొదటిసారి.



కానీ...

ఆ మనిషిని నేను అంతకు ముందే ఎక్కడో చూసినట్టు అనిపించింది. ఆ ముఖంతో నాకు పరిచయం ఉన్నట్టూ, ఏదో సంబంధం ఉన్నట్టూ అనిపించింది.

ఆ నా స్పందనకి ప్రతీకగా, దూరంగా ఎక్కడో చర్చి గంటలు వినిపించాయి.

నేనే కనక కవినై ఉంటే ఆ తియ్యటి

స్పందనకి మరింత తియ్యటి కావ్యం ఒలికేదేమో నా గుండెల్లోంచి!

పచ్చటి ఛాయా, తీర్చిదిద్దినట్లు ముఖం, ముక్కు మీద పదునుగా మెరుస్తూ ఆ మనిషికే పదునుతనాన్ని తెచ్చిపెడు తున్న ముక్కు పుడకా–చాలా అందంగా కనిపించింది ఆమె నా కళ్ళకి.

కాసేపు అలాగే చూస్తూ నిలబడి పోయాను.

"ఏం కావాలండీ?" మళ్ళీ అడిగింది.

"సిలబస్ కాపీ"

రెండు నిమిషాల్లో తీసిచ్చింది.

"ఇదిగో! నోట్ చేసుకుని మళ్ళీ అక్కడే పెట్టేయండి"

"ఇంటికి తీసికెళ్తానండీ"

"కుదరదండీ"

"ఇక్కడ నోట్ చేసుకోవటానికి టైం లేదు. ప్లీజ్! ఇవ్వండి''

"ఉన్న కాపీలన్నీ అందరూ పట్టుకు పోయారు. ఒక్కటి వెనక్కి రాలేదు. మిగిలింది ఇదొక్కటే. ప్రిన్స్‌పాల్ గారో, లెక్చరర్లో అవసరం వచ్చి అడిగితే ఏం చెప్పమంటారు?"

"రేపొద్దున్నే తెచ్చిస్తాను, కంగారు పడకండి" అన్నాను.

ఒప్పుకుంది చివరికి.

తను రిజిష్టరులో ఎంటర్ చేసుకుం టుంటే మళ్ళీ పరీక్షగా చూశాను.

మాలిన్యం లేని సొగసు!

చాలా అందమైన మనిషి!

ముఖంమీద కాఫీ రంగులో కుంకుమ బొట్టు మెరుస్తోంది. ఏ మాత్రం లోపం లేకుండా పైవాడు ఎంతో కష్టపడి ఆ మనిషిని తయారు చేశాడనిపించింది.

మరికాసేపు అక్కడే కూచున్నాను తలొంచుకుని పని చేసుకొంటున్న ఆమెను చూస్తూ.

మద్రాసులో అడుగు పెట్టిన క్షణం నుంచీ ఆడదాన్ని మర్చిపోవాలను కున్నాను. నా జీవితంలోకి ఏ స్త్రీని రానివ్వకూడదని అనుకున్నాను.

దానికి కారణం ఆడది కాకపోవచ్చు. నా అనుభవం చిక్కటి చేదుతో నిండి పోవటం మూలాన ఆ నిర్ణయానికి వచ్చా నేమో.

కాని ఈమె?

'మనిషి ఎంత ప్రయత్నం చేసినా, స్త్రీ పురుషుల మధ్య ఆ భగవంతుడు సృష్టించిన 'ఆకర్షణ' నుంచి తప్పించు కోవడం సాధ్యం కాని పని' అని చెబు తున్నట్లుంది నాకు.

అక్కడే తిష్టవేస్తే బావుంటుందా?

వెళ్ళిపోయాను క్లాసుకి.

క్లాసులో లెక్చరర్ పాఠం చెబుతున్నా ఎందుకో మనసుని లగ్నం చేయలేక పోయాను. మైకం కమ్మినట్లయింది నన్నూ, నా మనసునీ.

ఆమె రూపం మంత్రం వేసినట్లయింది!

మొదటిసారి లక్ష్మిని చూసినప్పుడూ, మాట్లాడినప్పుడూ కూడా అంతగా చలించలేదు నా మనసు.

ఎందుకు పుట్టింది నాలో ఆ స్పందన?

కారణం?

ఏం కనిపించలేదు దానికి కారణం అంటూ. అయినా ఎలా కనిపిస్తుంది?

ఆ భావన, ఆ స్పందన కావాలను కుంటే వచ్చేది కాదు. వద్దనుకుంటే పోయేదీ కాదు.

సృష్టిలయబద్ధంగా జనించేది అది!

అదే లేకపోతే ఈ బంధాలూ, అను బంధాలూ ఏవీ నిలిచేవి కావేమో! దూది



పింజల్లా, చిరుగాలి తాకిడికే ఎగిరిపోయేవి అ పునాది లేకపోతే.

అన్ని క్లాసులూ అయ్యేదాకా మరో లోకంలో ఉండిపోయాను. ఏ లెక్చరర్ వచ్చిందీ, ఏ పాఠం చెబుతున్నదీ చూడనే లేదు.

కాలేజీ అయిపోయింది.

ఇంటికి బయలుదేరాను.

ఏం చెయ్యాలో తోచలేదు తీరా యింటికి చేరాక. ఇష్టం వచ్చినట్లు ఎగిరి పడుతూ పరుగులు తీస్తున్న నా మనసుని అదుపులో పెట్టటానికి పుస్తకాలు తెరిచాను.

సిలబస్ అంతా నీట్‌గా రాసుకున్నాను. ఒంటిగంట దాకా చదువుతూనే కూచున్నాను.

నిద్రపోదామన్నా రాలేదు ఎందుకో.

లైబ్రేరియన్ రూపం కళ్ళముందు మెదిలింది!

తన పేరు తెలియదు నాకు.

పరిచయం అంతకంటే లేదు.

పరిచయం పెంచుకోవాలనిపించింది.

ఎలా, ఎప్పుడు అనే ఆలోచన మర్నాటికి వాయిదావేసి కళ్ళు బలవంతంగా మూసుకున్నాను ఆ రాత్రి.




మర్నాడు కాలేజీకి ఒక అరగంట ముందుగానే చేరుకున్నాను. వెంటనే లైబ్రరీకి వెళ్ళాను సిలబస్ పుస్తకం ఇవ్వడానికి.

తలుపులు ఇంకా మూసే ఉన్నాయి.

అప్పుడే రాదేమో తను.

కాంటీన్‌కి వెళ్ళి కూచున్నాను కాఫీ తాగుతూ. విసుగు పుట్టింది ఒక్కడినీ ఉన్నందుకు.

ఇదే చింతలపూడిలో అయితే నేను కాలేజి గ్రౌండ్‌లో అడుగు పెట్టగానే ఫ్రెండ్స్ బృందం అంతా చుట్టూ మూగేవారు. వాళ్ళతో బెల్ కొట్టేదాకా కబుర్లతో గడిచిపోయేది.

కాని ఇక్కడో?

చేరిన మూడోరోజుకే దారితప్పి ఏదో చేరకూడని చోటుకి చేరుకున్నట్లు అని పిస్తోంది.

ఎన్నాళ్ళిలా?

ఏదో ప్రవాహంలో తీరమనేది కని పించకుండా కొట్టుకుపోతున్నట్లుంది.

పాత జ్ఞాపకాలని మరిచిపోయి కొత్త పరిచయాలను పెంచుకుని, బ్రతుకు సాగిద్దామనుకున్నాను, ఏనాటికైనా ఏదో ఒక ఆలంబన దొరక్క పోతుందా అని.

కాని నా ఆశ తీరేటట్టులేదు. నేను ఆశించేది అతి స్వల్పమైనా, అది నాకెప్పుడూ అందకుండా పోతోంది.

లైబ్రరీకి వెళ్దామని లేచాను.

లైబ్రరీ, లైబ్రేరియన్ గుర్తు రాగానే అంతవరకూ కమ్ముకుపోయిన స్తబ్దత మాయమయింది. కాస్త హుషారు కూడా వచ్చింది.

"మనసు కోతి లాంటిది" అన్నారు పెద్దలెవరో.

నిజమేననిపించింది. లేకపోతే నాలో ఈ చైతన్యం ఎందుకు? ఆమెని చూసిన

తరువాత అర్థంలేని ఈ ఊహలెందుకు ?

ఈసారి తలుపులు తెరిచే ఉన్నాయి.

తలొంచుకుని ఏవో కాయితాలు సర్దుకుంటోంది ఆమె. ఇంకెవరూ లేరు లైబ్రరీలో. సిలబస్ కాపీ ఇచ్చేసి పోదామని ఆమె టేబిల్ దగ్గరికి వెళ్ళబోయిన నేను ఆగిపోయాను.

ఆమెని కాసేపు అలాగే చూస్తూ ఉండాలనిపించింది. ఎంతసేపు చూసినా తనివి తీరదేమో ఆ రూపం.

ముదురు కాఫీరంగు చీరలో పచ్చటి ఆమె శరీరం మరింత పచ్చగా మెరుస్తోంది. క ద లి క లేకుండా నిలబడిపోయాను దూరంగా.

యధాలాపంగా తలెత్తిన ఆమె నేను తననే పరీక్షగా చూస్తూండటం గమనించింది. ఆమె పెదిమలు రవ్వంత విచ్చుకున్నాయి.

ఆమె దగ్గరకెళ్ళాను.

"సిలబస్ కాపీ ఇచ్చేద్దామని..."

"థాంక్స్!" అంది.

"నేను చెప్పాలి థాంక్స్ మీకు" అన్నాను.

"మీరు తప్పకుండా తెచ్చిచ్చారుగా అందుకని నేనే చెప్పాను" అంది.

నవ్వాను ఏమనాలో తోచక.

ప్యూన్ వచ్చాడు అంతలో చీటీ పుచ్చుకుని. వాడిమీద కోపం వచ్చింది నాకు ఎందుకో.

అతనికి నేను తెచ్చిన సిలబస్ కాపీ ఇచ్చి పంపించేసింది ఆమె.

"చూశారా? ఇప్పుడు మీరు తెచ్చి ఉండకపోతే ఏం జరిగేదో?"

"నా మాట మీద నమ్మకం ఉంచుకుని మీరు ఇచ్చినప్పుడు తేకుండా ఎలా ఉంటాను?" అన్నాను.

"మీరనుకున్నట్లు కాలేజీలో అందరూ అనుకుంటే నాకు సగం చీవాట్లు తప్పుతాయి."

"ఎకనమిక్స్ టెక్ట్స్‌బుక్ కావాలి" అన్నాను.

"ఆ మూల బీరువాలో ఉంటాయి ఎకనమిక్స్‌కి సంబంధించిన పుస్తకాలన్నీ. చూసుకోండి."

అరగంట వెతికాను.

చివరికి లేటెస్ట్ ఎడిషన్ ఒకటి తీసుకుని తన దగ్గరికి వచ్చాను. ఎంటర్ చేసుకుని ఇచ్చేసింది పుస్తకం. థాంక్స్ చెప్పి బయటకి నడిచాను.

ఎంతసేపని ఉండగలను అక్కడ?

వచ్చేస్తుంటే అనిపించింది, లైబ్రరీలో ఆమె పక్కనే కూచునే ఉద్యోగం ఏదయినా నాకు దొరికితే బావుండునని.

రోజూ చూస్తూ ఉండొచ్చు తనని హాయిగా.

ఆమె ముఖం చూస్తూ ఉంటే ఏదో రిలీఫ్‌గా ఉంటుంది.

ఎందుకు?

బహుశా గతం గుర్తుకు రాకపోవటం మూలానేమో. ఆమె తప్ప చుట్టూ ఉన్న ప్రపంచాన్నంతటినీ మరిచి పోగలిగినందుకా?

క్లాస్‌రూంలో అడుగు పెట్టేసరికి అప్పుడే లెక్చరర్ పాఠం ముగించి బయటకు వస్తున్నాడు.

లోపలికి నడుస్తూ ఎదురుపడ్డ నన్ను ఓ వింత జంతువుని చూసినట్లు చూశాడాయన. లేటుగా క్లాసుకి ఎందుకు వెళ్ళానా అనిపించింది.

టైమంతా యాంత్రికంగా గడిచి పోయింది. ఇంటర్వెల్ అయ్యేదాకా బలవంతంగా పాఠం మీద నిలిపాను మనసుని

కూచున్నంత వరకూ. ఆకలి లేకపోవ టంతో కాంటీన్‌కి కూడా వెళ్ళబుద్ధికాలేదు

లైబ్రరీకి వెళ్ళాను మళ్ళీ.

ఆమె టిఫిన్ చేస్తోంది మూలగా కూచుని. మాగజైన్స్ తిరగేస్తూ కూచు న్నాను వెళ్ళగానే.

మాట్లాడాలనిపించింది.

ఏం మాట్లాడను?

అసలెలా మాట్లాడను?

తింటూ తింటూ మధ్యలో రెండు సార్లు చూసింది ఆమె నా వైపు. తను చూడగానే నాచూపు కిందకి వాలిపోయింది.

పట్టుబడిపోయినట్లనిపించింది.

తనవేపే చూస్తూ అక్కడ కూచున్నం దుకు ఏమనుకుంటుందో! నేను చేస్తున్న పని మంచిది కాదనిపించింది.

వెంటనే లేచి బయటకొచ్చేశాను.

ఏం తోచలేదు.

ఆమెతో పరిచయం పెంచుకుని స్నేహం చెయ్యాలని ఉంది. సరదాగా నవ్వుతూ రోజులన్నీ గడిపేయాలని ఉంది. కాని దానికి ఏం చెయ్యాలి?

నా అంతట నేను వెళ్ళి ఎన్నిసార్లు పలకరించగలను?

అటువంటి పరిస్థితి నా కెప్పుడూ ఎదురు కాలేదే?

చింతలపూడిలో నాకు తెలిసిన కొద్ది మంది ఆడ పిల్లలూ వాళ్ళంతట వాళ్ళు నా దగ్గరికి వచ్చిన వాళ్ళే కాని, నేనెప్పుడూ వాళ్ళ పరిచయం కోసం తాప త్రయ పడలేదు.

లక్ష్మి కూడా అంతే!

మొదటిసారి తనొచ్చి నోట్సు అడి గిన తరువాతే నేను మాట్లాడాను. ఆ తరువాత ఎప్పుడూ ఏదో పని కల్పించు కుని నా దగ్గరకి వచ్చేది.

మెల మెల్లగా అర్థమయింది నాకు.

నాకూ తనని కలవాలని పించింది అప్పుడు.

ఎవరైనా ఒక మనిషికి దగ్గరవాలను కుంటే అంత శ్రమపడాలా?

కొత్తలో లక్ష్మి చూపులూ, ముఖంలో కనబడే బెదురూ, మాటలు తడబడటం, పరధ్యానం–వాటన్నిటికీ కారణం ఏమిటో ఆ క్షణంలో అర్థమయింది నాకు.

ఈరోజు నేనూ అదే స్థితిలో ఉన్నం దుకా?

నా పరిస్థితి ఏమిటో కళ్ళ ముందు మెదిలేసరికి భయంతో మనసు వణికి పోయింది.

తనంతట తనుగా నాకు దగ్గరయిన మనిషి లక్ష్మి. తనే గడ్డి పరక కింద నన్ను తీసిపారేసి వెళ్ళిపోయింది. ఆ బాధనే భరించటం నావల్ల కావటం లేదు.

ఈనాడు, నాఅంతట నేను కావాలను కున్న మనిషి నాకు బదులివ్వకపోతే?

ఆ ఓటమి సహించగలనా?

స్వాభిమానానికి సమాధి కట్టినట్లు కాదూ!

పోనీ...

స్వాభిమానం అనేది చంపుకున్నా, బదులు రాకపోయినందుకు నా మనసు అనుభవించే ఆవేదన ఎలా భరించగలను?

తూట్లు పడిన నా గుండె మీద సమ్మెట కొట్టినట్లు కాదూ!

వద్దు!

ఎందుకు ఆ నరకాన్ని కొనితెచ్చు కోవటం?

ఏ గొడవా లేకుండా రోజులు గడి పేస్తే చాలు. ఆడదాని గురించి ఆలోచిం చనే కూడదు.



ఆశని పెంచకుండానే తుంచి వేసినందుకు నా అంతరాత్మకి కృతజ్ఞతలు చెప్పుకున్నాను.

అందుకే మధ్యాన్నం లెక్చరర్ రానందుకు ఓ గంట సేపు తీరిక దొరికినా క్లాసులోనే కూచున్నాను పుస్తకం చదువుకుంటూ.

చదువు తప్ప కొన్ని రోజులపాటు వేరే ఏ ధ్యాసా పెట్టుకోకూడదని నిశ్చయించుకున్నాను.

సాయంత్రం కాలేజీ కాగానే యింటికి బయలుదేరిన నాకు శాంతి కనిపించింది గేటు దగ్గర. తను అక్కడ ప్రత్యక్షమవటం కాస్త వింతగానే అనిపించింది.

"ఎంత సేపట్నించీ చూస్తున్నానో తెలుసా?" అంది నన్ను చూడగానే.

"క్లాసులోకొచ్చి పిలవకపోయావా?"

"ఎలా పిలవను? మీ వాళ్ళంతా

కోతిమూక. ఎందుకులే అని ఇక్కడే నిలబడ్డాను."

"ఏమిటి సంగతి? ఇలా వచ్చావు"

"రాకూడదా?"

"ఛ. ఛ. రాకూడదని కాదు. ఊరికే అడిగాను."

"నాన్న చీర కొనుక్కోమని డబ్బిచ్చాడు. ఎగ్జిబిషన్‌లో కొందామని ఉంది. నిన్ను కూడా తీసుకెళ్దామని వచ్చాను."

"బావుంది. చీర కొంటానికి నేనెందుకు?"

"నీకోసమేగా నేను కొంటోంది?" అని నవ్వేసింది శాంతి.

"అయితే నే రానుపో" అన్నాను.

"పద పద. మళ్ళీ లేటవుతుంది" అంది

మాట్లాడకుండా నడిచాను తన వెనకనే. ఇంటికి వెంటనే వెళ్ళి చేసేదీ ఏం లేదుగా!

ఎగ్జిబిషన్ చేరుకోవటానికి గంట పట్టింది. ముందు ఓ స్టాల్ కెళ్ళి టిఫినూ కాఫీ తీసుకుని అప్పుడు అంతా చూడటానికి బయలుదేరాం.

ఎన్ని షాపులు తిరిగినా శాంతికి నచ్చిన చీర కనపడలేదు. అలా అయితే అక్కడే తెల్లారుతుందని భయం వేసింది. మరో షాపులో తను చీరలు తిరగేస్తుంటే అన్నాను.

"ఆ పువ్వుల చీర చాలా బావుంది కదూ?"

నా వేపు చూసింది శాంతి.

"అది తీసుకో" అన్నాను.

"నీకు నచ్చిందా?" అడిగింది శాంతి

"నీ ఒంటి మీద చాలా బావుంటుంది. తీసుకో" 'ఇంకా ఆలస్యమవుతుందని అన్నాను మళ్ళీ.

మారు మాట్లాడకుండా డబ్బిచ్చేసి ఆ చీర తీసుకుంది శాంతి. నాక్కాస్త ఆశ్చర్యమేసింది. అన్ని షాపులు తిరిగినా ఏచీరా నచ్చని మనిషి నే చెప్పిన చీర తీసుకున్నందుకు.

మరికాసేపు అన్నీ చూసి వెనక్కి బయలుదేరాం.

"సినిమాకెళ్దాం బావా!" అంది శాంతి.

బావ!

కొత్త పిలుపు.

కాని బావుంది.

"మాట్లాడవేం?" అంది

"'బావా' అని పిలవనన్నావుగా" అడిగాను.

"అదా! ఏదో..."

"అలానే పిలు ఇకనించీ" అన్నాను.

నవ్వింది తను.

"ఇంతకీ ఏమంటావు?"

"ఏమిటి?"

"సినిమా విషయం."

"సెకండ్ షోకి వెళ్తే మావయ్యా వాళ్ళు తిట్టరూ?"

"ఎందుకు తిడతారు? నువ్వున్నావుగా వెంట?"

"వద్దులే శాంతీ! ఇంకో రోజు ఎప్పుడన్నా వెళ్దాం."

"ఇంకో రోజు ఎందుకు? ఇవాళ వెళ్ళాలనుంది నాకు" అంటూ నాకిష్టం లేకపోయినా ఒప్పించింది శాంతి.

ఆ రోజు బయటే భోజనం. సినిమా హాలుకి వెళ్ళేటప్పటికి సెకండ్‌షో మొదలవటానికి ఇంకా గంట టైం మిగిలింది.

"బావా! కాస్త పూలు తెచ్చి పెట్టవూ?"

"పూలేకటేనా మేడమ్! ఇంకా ఏమయినా కావాలా?"

"ఏంబాబూ అరిగిపోతావా ఆమాత్రం

సాయంచేస్తే?" బుంగమూతి పెట్టుకొని అడిగింది శాంతి.

"తెచ్చి పెడతాలే" అంటూ నవ్వుతూ బయటకు నడిచాను. కనకాంబరాలూ, మల్లెలూ, మరువం అన్నీ కలిపించి ఓ దండ కట్టించి తెచ్చిపెట్టాను శాంతికి.

తన మాటలూ, ప్రవర్తనా ఆ రోజు కొత్తగా తోచాయి.

అంతకు ముందు నాతో ఉన్నప్పుడు ఎప్పుడూ తన చుట్టూ ఓ పరిధి గీసుకుని దూరంగా ఉన్నట్లు అనిపించేది.

ఇప్పుడా చుట్టుగీత చెరిగిపోయిందా?

ఫస్ట్‌షో వదిలిపెట్టారు.

సెకండ్‌షోకి జనం అంతగాలేరు. బెల్ మోగగానే లోపలికెళ్ళి కూచున్నాం.

సినిమా కథ చాలా బావుంది అదేమిటో.

సగం జీవితం గడిచి పోయాక, ఒంటరితనం భరించలేక కలిసి మిగిలిన జీవితం పంచుకోవాలనే కోరికతో ఒకటైన ఇద్దరు ఒంటరి మనుషుల కథ అది.

వాళ్ళు ఒకటైంది శరీర వాంఛ కోసం కాదు.

కరిగిపోగా మిగిలిన కాస్త యవ్వనాన్ని అనుభవించటానికీ కాదు.

కేవలం తోడుకోసం!

శరీరంతో సంబంధంలేని ప్రేమ కాబోలు వాళ్ళది. అటువంటి బంధం ఎంతో గట్టిగా ఉంటుందనిపించింది.

ఏ భ్రమలూలేని బంధం!

శాంతి ఒళ్ళు తగిలింది మెత్తగా.

లక్ష్మి అల్లంత దూరంలో ఉండగానే రక్తం పొంగుతున్నట్లనిపించేది ఎందుకో.

కాని—

శాంతి స్పర్శకు ఇంతవరకూ ఏనాడూ నాలో చలనం కలగలేదు. రక్తంలో ఏ కదలికా లేదు.

నాలో మగతనం చచ్చిపోయిందా?

కాదు.

నా శరీరాన్ని మనసు శాసిస్తోంది. అందుకేనేమో నేను ఉద్రేకానికి లోను కావటం లేదు.

సినిమా అయ్యేసరికి నిద్ర ముంచుకొచ్చింది. చాలా రోజుల తరువాత మళ్ళీ అలా అడగకుండానే నిద్రాదేవి వరిస్తోంది.

బస్సుకోసం నిలబడే వోపిక లేకపోయింది. రిక్షా మాట్లాడాను యింటికి. శాంతి జడలో పూలు ఇంకా సువాసన వెదజల్లుతూనే ఉన్నాయి. ఆ తియ్యటి పరిమళానికి నిద్ర మరికాస్త ఎక్కువ అయింది.

ఇంటికి చేరగానే నన్ను తట్టి లేపింది శాంతి.

తలుపు తీసిన అత్తయ్య అరక్షణం అలాగే చూసింది మా ఇద్దరినీ.

"అమ్మా! మరే..." శాంతి ఏదో చెప్పబోయింది.

"అన్నీ టేబిల్ మీద ఉన్నాయి. నువ్వు తినేసి రాజుకి కూడా పెట్టు" అనేసి లోపలికి వెళ్ళిపోయింది అత్తయ్య.

నా నిద్ర మత్తు కాస్తా దిగిపోయింది.

శాంతి మాట విని సినిమాకెళ్ళటం పొరపాటనిపించింది. అత్తయ్య ఏమనుకుందో అలా చెప్పకుండా వెళ్ళినందుకు. నా గదిలోకి వెళ్ళి బట్టలు మార్చుకున్నాను.

అన్నానికి పిలిచింది శాంతి.

"చూశావా నే చెబుతే విన్నావు కాదు. మీ అమ్మకి కోపం వచ్చినట్టుంది" అన్నాను అన్నానికి కూచుంటూ.



"నువ్వు ఊరికే కంగారు పడతావు. ఆవిడకి కోపం వచ్చిందని నీకెలా తెలుసు? ఆవిడ తీరే అంత. అర్ధరాత్రి వచ్చినిద్ర చెడగొట్టామని ఆవిడ బాధ'' అంది శాంతి.

నేను మాట్లాడకుండా భోజనం కానిచ్చాను.

''ఇవాళ సాయంత్రం మటుకు చాలా సరదాగా గడిచిపోయింది" అంది శాంతి నేను లేస్తుంటే.

సన్నగా నవ్వుతూ అక్కడి నుంచి గదిలోకి వెళ్ళిపోయాను. మంచం మీద వాలగానే నా కళ్ళ ముందు మళ్ళీ మెరిసింది.

లైబ్రేరియన్ రూపం!

ఆమె గురించి ఆలోచించకూడదనుకున్నానే. మనసు నా మాట వినసని ఎందుకిలా మొరాయిస్తోంది ?

నా చేతిలో లేదా అది?

అంత అశకుడినా ?

మద్రాసు వచ్చింది చదువుకోవటానికి.

ఆడపిల్లలతో స్నేహం చేయటానికి కాదుగా!

నేను చేయదలుచుకుంది చేయటానికి ఏ బలహీనతా నాకు అడ్డుగా నిలవ కూడదు. ఎలా అయినా నేననుకున్నట్లు కాలేజి ఫస్టు కావాలి అన్నిటిలోనూ.

నిశ్చయం బలపడింది.

అలిసిపోయి ఉండటం మూలాన నాకు తెలియకుండానే కళ్ళు మూతలు పడ్డాయి.

* * *

నేను తీసుకున్న నిర్ణయం మర్నాటి నుంచీ చాలా వరకూ అమలులో పెట్టగలిగాను.

పుస్తకాలు కొనటం నా వల్ల కాదని పించింది ధరలు చూశాక. దాంతో లైబ్రరీకి వెళ్ళి కూచోవటం తప్పనిసరి అయిపోయింది.

లైబ్రరీలో ఆమె ఎదురుగానే కూచుని మనసుని చదువులో లగ్నం చేయటం కాస్త కష్టమనిపించింది. మొదటిరోజు. మనసు పట్టు విడిచి పెట్టటం కూడా జరిగింది.

నన్నెంతగానో ఆకట్టుకున్న రూపం! ఆ మనిషి కళ్ళముందరే ఉండి, అయస్కాంతంలా నన్ను తన వేపు లాక్కుపోతూ ఉంటే, పుస్తకం మీద ధ్యాస ఎలా నిలుస్తుంది?

'నీ పట్టుదల ఇంతేనా ? నీకు ఇంత చంచల స్వభావం ఉందా?' అని నన్ను నేనే గేలిచేసుకునేవాడిని.

నిద్రపోతున్న అభిమానం మేలు కునేది.

మనసుని మరల్చుకునేవాడిని ఆలా చదువు వేపు.

రాను రానూ నేనాశించిన మార్పు నాలో చోటు చేసుకుంది. ఓ వారం రోజులు గడవగానే నిగ్రహించుకోవటం అలవాటయింది.

ఆ వారం రోజులూ కాలేజీలోనే కాదు, ఇంట్లోనూ పుస్తకం విడిచి పెట్టలేదు.

రోజూ కాకపోయినా రోజు విడిచి రోజైనా శాంతీ, నేనూ షికారుకి వెళ్ళే వాళ్ళం ఇదివరకు.

అది కూడా మానేశాను.

శాంతిఎన్నోసార్లు అనను కూడా అంది తనతో నేను ఎక్కడికీ రావటం లేదని. సర్దేసి సర్ది చెప్పాను.

నేను మద్రాసు రాకముందు అయిపో యిన లెసన్స్ అన్నీ కవర్‌చేశాను ఆ వారం రోజుల్లోనూ. చాలా కష్టపడ్డాను. ఇక మిగిలింది నేను వచ్చాక చెప్పిన లెసన్స్ మాత్రం. కాస్త తృప్తిపడ్డాను.

ఆదివారం వచ్చింది.

మర్నాడు సోమవారం కూడా సెలవే. ఆ రెండు రోజులు కూడా వృధా చేయకూడదనిపించింది.

ఆదివారం అయినా, సెలవు రోజు అయినా అత్తయ్య వంట పదిగంటలకే చేసేస్తుంది. స్నానం భోజనం కానిచ్చి పుస్తకాలు ముందేసుకుని కూచున్నాను.

"బావా! ఆదివారం కూడా చదువేనా?" అంది శాంతి నా దగ్గరకొచ్చి.

"తప్పదు శాంతీ కొన్ని రోజులు."

"వీల్లేదు. ఇవాళ చదువూ గిదువూ జాంతానై"

"ఏం చేయమంటావు?'' అడిగాను

"తమరు మాతో వేంచేయాలి.''

''ఎచటికి భామామణీ?''

''మహాబలిపురం''

''భలేదానివే. నే రాను''

"అదేం కుదరదు. మీకు రేపు కూడా సెలవేగా! మళ్ళీ ఇలా వరసగా రెండు రోజులు సెలవులు రావటం కష్టం."

"కాదు శాంతీ..."

"నీ బట్టలు కూడా సర్దటం అయిపోయింది. ఇప్పుడింకేం లాభంలేదు. పద"

ఎంత ప్రయత్నం చేసినా లాభం లేక పోయింది. శాంతి తన పట్టు విడిచి పెట్టలేదు. ఇక చేసేదేం లేక బయలు దేరాను తనతో.

పది నిమిషాల్లో పెట్టె పుచ్చుకుని సిద్ధం అయింది శాంతి.

"నీ వాలకం చూస్తుంటే ముందే ప్లాను చేసినట్టుందే" అన్నాను.

"మరేంటనుకున్నావు మనమంటే? పద ఆలస్యమవుతుంది"

అత్తయ్యతో చెబుదామనుకుంటే, కనపడలేదు ఎక్కడా. మావయ్యే ఇంట్లోనే ఉన్నాడు.

"మావయ్యతో చెప్పావా?" అడిగాను శాంతిని.

"ఆ. నువ్వు పద..."

"నేనూ చెప్పొస్తా. ఒక్క క్షణం ఆగు."

"అఖ్ఖర్లేదు. పదమంటుంటే" అంటూ బయటకి నడిపించింది శాంతి.

మద్రాసు నుంచి మహాబలిపురానికి ప్రతి అరగంటకీబస్సులున్నాయి. అయినా భాగా రద్దీగా ఉంటుంది యాత్రికులతో. బస్సు దొరికి మహాబలిపురం చేసేసరికి పన్నెండున్నరయింది.

కాటేజ్ తీసుకుందామంటే దొరక లేదు. హోటల్లో డబల్ రూం తీసుకున్నాం. ఎందుకో కాస ఇబ్బందిగా అనిపించింది నాకు హోటల్ రూంలో అడుగు పెట్టగానే. పెళ్ళి కాని ఆడపిల్లను తీసుకుని అలా హోటల్స్‌లో ఉండటం ఏం బావుంటుంది. మామయ్యకి తెలిసినవాళ్ళు చూస్తే ఏమనుకుంటారు?ఇవన్నీ ఆయన ఆలోచించ లేదా? సమాధానం కనిపించలేదు నాకు. ఆ విషయం అక్కడితో మర్చిపోయాను.

వెంటనే చూడటానికి బయలు దేరదామంది శాంతి. కాసేపు రెస్టు తీసుకున్నాక వెళ్దామని ఆపు చేశాను.

సాయంత్రం నాలుగు గంటలకి బయలుదేరాం. అంతవరకూ ఎన్నోసార్లు విన్నాను మహాబలిపురం గురించి.

పుట్టి బుద్ధెరిగిన తరువాత ఏలూరు దాటి ఎరగను.

ఎప్పుడైనా కాలేజీవాళ్ళతో ఎక్స్‌కర్షన్‌కి వెళ్తానన్నా తాతయ్య ఒప్పుకునేవాడు కాదు. "నేనొక్కడినీ ఎలా ఉండనురా?" అనేవాడు. ఆయనని నొప్పించటం ఇష్టం లేక మానేసేవాడిని ఫ్రెండ్స్ ఎంతగా బలవంత చేసినా.

సముద్రం కూడా చూసి ఎరగను మద్రాసు రాకముందు.

మరీ పుస్తకాలకి అంకితమైపోకుండా అలా అప్పుడప్పుడు బయట తిరుగుతూ ఉండటం మంచిదే అనిపించింది ఆ పరిస రాలను చూడగానే.

ఏకశిల లోంచి మలచిన అక్కడి శిల్ప సంపద చూస్తుంటే, శిల్పకళ మీద ఏ మాత్రం ఆసక్తి లేనివాడు కూడా ఆ కాలం శిల్పుల నైపుణ్యాన్ని మెచ్చుకో కుండా ఉండలేడు.

ఎన్ని రోజులు శ్రమపడి ఉంటారో ఆ కళా ఖండాలకు సృష్టిపోయటానికి?

ఎంత డబ్బు ఖర్చయి ఉంటుందో!

శిల్పాలకి కూడా భాష తెలుసేమో

అనిపించింది చూస్తుంటే. మనిషనేవాడు అందుకోవాలే కాని ఎన్నో భావాలు అందిసాయవి.

"ఏం. బావా! అంతగా లీనమయి పోయావు?"

"చాలా బావుంది"

"బావుంటుంది కాబట్టేగా నిన్నింత దూరం తీసుకొచ్చింది! చూశావా నా మాట వినటం వల్ల నీకెంత లాభం జరిగిందో?" అంది శాంతి.

"అవునవును" అన్నాను నవ్వుతూ.

"అటు సముద్రం ఒడ్డుకి పోదాం పద"

జనం ఎక్కువగా లేని చోటికి తీసుకెళ్ళింది శాంతి.

ఈత కొట్టాలనిపించింది కాసేపు నీటిని చూడగానే

పొడి బట్టలు తెచ్చుకోలేదు. చేసేది లేక ఇసుకలో కూలబడ్డాను.

శాంతి నీళ్ళలోకి పరిగెత్తింది వద్దని చెప్పినా వినకుండా. తనని చూస్తూ కూచున్నాను. నన్ను కూడా రమ్మని చేయి ఊపింది. అయినా నేను కదల్లేదు.

బాగా నీళ్ల లోపలికి వెళ్లిపోయింది శాంతి. చిన్న పిల్లలా నీళ్లతో ఆడుకుంటున్న తనని చూస్తే గమ్మత్తు అనిపించింది. శాంతి మాటలు చురుకుగా ఉన్నా చేతలు కాస్త నింపాదిగా కనిపించేవి.

కాని ఇప్పుడో?

మనిషిలో కాస్త మార్పు కనిపించింది.

మళ్ళీ పిలిచింది శాంతి.

నేను లేచి వెళ్లి ఒడ్డునే నిలబడ్డాను—అలలకు అందీ అందనట్టు

ఓ పావుగంట పోయాక వచ్చింది శాంతి. చీరంతా తడిసిపోయింది. తలవారా స్నానం చేసినట్టు నీళ్ళు కాగతున్నాయి.

"ఇప్పుడేం చేస్తావు?" అడిగాను తనని.

"ఏమిటి?"

"వేరే బట్టల్లేవుగా?"

"అయితే ఏం?"

"ఈ అవతారంతో హోటలుకి వెళ్తే బావుంటుందా?"

"అదా! ఇప్పుడే వెళ్ళొద్దు. కాసేపు ఇక్కడే తిరిగి అప్పుడు పోదాం"

ఒడ్డమ్మటే నడుచుకుంటూ పోయాం

శాంతి కబుర్లు చెబుతుంటే వింటూ నడుస్తున్నాను. ఆవేళ చాలా హుషారుగా వుంది తనెందుకో.

చీకటి పడింది.

హోటలు చేరుకున్నాం.

టైం ఎనిమిదయింది. ఇద్దరం స్నానాలు చేశాం. భోజనం కూడా కాగానే శాంతి మళ్ళీ బయటకి వెళదామంది. నాకు ఓపిక లేదని చెప్పి నడుం వాల్చాను మంచం మీద.

ఏకాంతం రాగానే మళ్ళీ ఆలోచనల వరదలో కొట్టుకుపోయాను నిస్సహాయుడినై.

మనసు అలసిపోతోంది.

దానికి విశ్రాంతి కావాలిగా!

ఏదీ?

ప్రతి మనిషిలో ఊపిరనేది ఉన్నంత వరకూ అంతేనా?

లేక నా ఒక్కడిదేనా ఆ దురదృష్టం?

"బావా!" పిలిచింది శాంతి.

"ఏమిటి శాంతీ!?"

నా వేపు తిరిగి పడుకుంది తను

"నిన్నొకటడుగుతాను"

''అడుగు'' అన్నాను.

''నేనంటే నీ కిష్టమేనా?''

విత్తరపోయాను.

ఆ ప్రశ్న ఎందుకడిగిందో అర్థం కాలేదు.

తనవేపు చూశాను. నన్నే పరీక్షగా చూస్తోంది.

ఏదో కొత్త మెరుపు కనిపించింది తన కళ్ళలో.

ఏం మాట్లాడలేక పోయాను.

''నువ్వంటే నాకిష్టం బావా!''

నాకు దగ్గరయింది శాంతి.

ఏం తోచని స్థితిలో ఉండిపోయాను.

నన్ను గట్టిగా కావలించుకుంది.

పూల చెండు గుండెలను పరామర్శించినట్లయింది!

తన ఊపిరి వెచ్చగా సోకింది నాకు. నా రక్తప్రసారం హెచ్చింది. అప్రయత్నంగా నా చేతులు తనని పెనవేశాయి.

మైకం కమ్ముకుంది.

నాకు మరింత దగ్గరయింది.

తన మెడలోని లాకెట్ బిళ్ళ గుచ్చుకుంది నా గుండెలకి. ఎవరో ఒక్కసారిగా నా చెంపమీద కొట్టినట్టు అనిపించింది ఎందుకో. నా చేతులు పట్టు విడిచిపెట్టాయి.

దూరం జరిగాను.

"నేనంటే నీ కిష్టం లేదు కదూ !" అడిగింది శాంతి.

"నువ్వంటే నాకెప్పుడూ ఇష్టమే. కాకపోతే..."

"........."

"మనం చేస్తోంది తప్పు తెలుసా ?"

''అయితే?''

"అది పాపం కూడా! హరాయించుకోలేం మనం. పడుకో శాంతీ"

దిండు తీసుకుని సోఫా దగ్గరకెళ్ళి పడుకున్నాను.

ఆ క్షణంలో నన్ను నేనే నమ్మలేకపోయాను. నా రూపం నాకే వింతగా కనపడింది.

ఎలా ఒప్పుకుంది నా మనసు?

ఎలా తలవంచింది ఆ కోరికకి??

శాంతిని ఆ దృష్టితో నేనెప్పుడూ చూడలేదే! ఒక మంచి స్నేహితురాలనే అనుకున్నాను.

ఇన్ని రోజుల బట్టీ, ఎన్నిసార్లు తను నాకెంత దగ్గరయినా ఎప్పుడూ నాకా ఉద్దేశం రాలేదే!

మరెందుకు నిగ్రహం తప్పింది ?

తోడ బుట్టిన చెల్లెలు లాంటిదని అనుకున్న శాంతితో ఇలా ఎందుకు జరిగింది.

పరాయి మనిషి పరాయి మనిషేనా ?

రక్తసంబంధంలేకపోవటం వలనా ?

చాలా బాధపడ్డాను.ఆ రాత్రి నిమిషం కూడా కంటికి కునుకులేదు. ఎప్పుడు తెల్లవారుతుందా అనిపించింది.

మర్నాడు పొద్దున్నే వెళ్ళిపోదామంది శాంతి. చాలా ముక్తసరిగా మాట్లాడింది నాలుగు ముక్కలు. నేనూ అభ్యంతరం చెప్పలేదు.

తరువాత కూడా ఇంటికి చేరేదాకా ఏం మాట్లాడకుండా కూచుంది శాంతి.

ఒక్కసారిగా మళ్ళీ తను నాకెంతో దూరంగా వెళ్ళిపోయినట్లనిపించింది.

మద్రాసు చేరి యింట్లో కాలుపెట్టగానే, హడావిడిగా, నాతో మాటమాత్రం చెప్పకుండా ముఖం కడుక్కుని మళ్ళీ బయటకు వెళ్ళిపోయింది.

నా మీద కోపం వచ్చిందని అర్థమయింది. ఏం చెయగలను నేనుమాత్రం? ఇక తన గురించి ఆలోచించకూడదని నిశ్చయించుకున్నాను.

ఆ రోజునుంచీ చదువులో మరింతగా మునిగిపోయాను.

రోజూ లంచ్ టైంలో లైబ్రరీకి వెళ్ళి కూచోటం అలవాటైపోయింది. లెక్చరర్ రానందుకు ఎప్పుడన్నా ఖాళీ దొరికినా లైబ్రరీకే వెళ్ళి కూచునేవాడిని.

శాంతి నాతో మాటలు బాగా తగ్గించేసింది.

ఇదివరకులా తనతో ఎక్కడికీ బయటకి వెళ్ళాల్సిన అవసరం లేకపోవటం వలన కాలేజీ, ఇల్లూ తప్ప నేనూ ఎక్కడికీ వెళ్ళేవాడిని కాదు....

అలవాటయితే ప్రతీదీ బాగానే ఉంటుందేమో! అంతగా పుస్తకాలతో



గడపటం మామూలుగా ఎవరికైనా విసుగు పుట్టిస్తుంది.

కానీ—

నాకు మాత్రం చదువే ఒక ఆశ్రమం అయిపోయింది.

ఎంతో కష్టపడ్డాను వెనక పడ్డ పోర్షను కవర్ చేయడానికి. అలా నెల రోజులు గడిచిపోయాయి.



ఇంటర్నల్ ఎసెస్‌మెంట్‌లో మంచి మార్కులు వచ్చాయి. ప్రతి సబ్జక్టులోను. ఇరవైకి పదిహేడూ పద్దెనిమిదీ పడ్డాయి. ఒక్కొక్క లెక్చరర్ మార్కులు చదువు తుంటే ఎంతో సంతోషం వేసింది.

దాంతో కాలేజీలో పరిస్థితి కాస్త మారింది.

క్లాసులో జనానికీ, లెక్చరర్లకి నేనంటే ఉన్న తేలికభావం పోయి రవ్వంత గౌరవం చోటు చేసుకున్నట్లు అనిపించింది.

రోజు క్లాసులో చెప్పబోయే చాప్టర్ అంతకుముందే ప్రిపేర్ అయి వుండటం వలన, లెక్చరర్ ఎవర్ని ఏ ప్రశ్న అడిగినా నేనేచివరికి చెప్పేవాడిని తడుము కోకుండా.

అదోరకం తృప్తి.

పక్కవాళ్ళు సాధించలేనిది నేను సాధించానని.



అయినా నాతో ఎవరూ మాట్లాడే వాళ్ళుకాదు ఎందుకో.

ఎవరన్నా వాళ్ళంతట వాళ్ళొచ్చి పలకరించి చేయి చాపేదాకా నేనూ మాట్లాడకూడదని నిశ్చయించుకున్నాను.

నేను తలుచుకొన్నది కొంతవరకూ సాధించాను.

'చదువులో ఈ కుర్రాడు ఫరవాలేదు' అనిపించుకున్నాను.

కాని...

ఆ కాస్త గెలుపుతో చదువు మీద ఉత్సాహం రవ్వంత తగ్గింది. రోజు విధి తప్పకుండా, ఏదో ఒక టైంలో రెండు మూడు గంటలు చదివినా ముందటి ఏకాగ్రత పోయింది ఎందుకనో.

మొక్కుబడికన్నట్టు పుస్తకాల ముందు కూచునేవాడిని ఆ కాసేపైనా. మిగతా సమయం అంతా ఒంరిగా ఆలోచనలో గడిచిపోయేది.

శాంతితో బయటకు షికారు వెళ్ళటం ఒకటే కాదు, మాటలు కూడా తగ్గిపోయాయి. ఇంట్లో ఉన్నప్పుడు ఏదన్నా అవసరంమీద మాట్లాడటం తప్పనిసరి అయితే ముభావంగా, 'అవును, కాదు' అనేసి తప్పుకుపోయేది నా నుంచి.

ఇంట్లో మావయ్యా, అత్తయ్యా వాళ్లందరి మధ్య ఉన్నా ఒక్కడినీ ఉన్నట్టే అనిపించసాగింది.

తపన!

మనసు పంచుకునే తోడు కోసం తీరని తపన మొదలయింది. అలా రోజులు గడపటం సాధ్యం కాదనిపించింది.

జీవితం ఆ దశలో ఉండగా, నేను కలలో కూడా ఆశించని, ఎదురు చూడని అదృష్టం నన్ను కావలించుకుంది.

ఓ రోజు ఖాళీగా ఉంటే లైబ్రరీలో కూచున్నాను.

"రోజూ మీరొక్కరే వస్తారేం?"

వెనక్కి తిరిగి చూస్తే లైబ్రేరియన్ కనపడింది.

వెంటనే జవాబు చెప్పలేకపోయాను ఆమెను చూడగానే.

ఇన్నిరోజుల బట్టి, ఎన్నోసార్లు లైబ్రరీలో కూచున్నా ఎప్పుడూ ఆమె విషయం పట్టించుకోలేదు నేను. ఆమె కూడా నా ఉనికిని గమనించనట్టే ప్రవరించేది.

మొదటిసారి ఆమె నన్నిలా పలకరించటం!

"కాలేజీలో చేరి ఇన్ని రోజులయినా ఫ్రెండ్సెవరూ లేరా మీకు?" అడిగింది పల్చగా నవ్వుతూ.

"నేనంటే ఎవరికీ ఇష్టంలేదు" అన్నా నవ్వుతూ.

"ఎవరితోనూ మాట్లాడకుండా దూరంగా ఉండిపోతే ప్రతి మనిషికీ అలాగే అనిపిస్తుంది"

"మీకర్థం కాదు"

"ఏమిటి?"

"ఈ ఒంటరితనం అనేది నా జబ్బు"

"నాకూ తెలుసు ఒంటరితనం"

తలెత్తి ఆమెని చూశాను.

నా వేపే చూస్తోంది.

నా మనసే వినిపించింది ఆమె మాటల్లో!

స్పష్టంగా కనిపించింది ఆ కళ్ళలో!

పేరు తెలుసుకోవాలనిపించింది.

"మీ పేరు చెప్పారు కాదు!" అడిగాను.

"దేనికి?"

"లవ్ లెటర్స్ రాయనులెండి. ఊరికే అడిగాను"

"ఆశాదేవి" అంది గలగలా నవ్వుతూ.

ఆశాదేవి!

ఎంత అందమైన పేరు.

బెంగాలీ పేరులా ఉంది.

"మీరు చాలా అందంగా ఉంటారు"

"ఈజిట్!?" అంది చిలిపిగా.

"మీ పేరు మీ కంటే అందంగా ఉంది. మై కాంప్లిమెంట్స్ టు యు" అన్నాను.

"థాంక్యు" అంది.

"కాఫీ తాగుదాం రండి"

"ఎందుకూ? తెప్పిస్తాను ప్యూన్ చేత. ఇక్కడే తాగుదాం"

"మీరెంత వరకూ చదివారు?" అడిగాను.

"ఎమ్.ఎ. వరకు. లెక్చరర్ని అవ్వాలనుకున్నాను. కానీ లైబ్రేరియన్గా చేరాను"

పెళ్ళయిందో లేదో తెలుసుకోవాలనిపించింది.

"మీవారు ఎక్కడ పనిచేస్తుంటారు?" అడిగాను.

"లేరు"

"అంటే..."

"బొట్టు చూసి పొరబడ్డారనుకుంటా. పెళ్ళయిన రెండో రోజునే ఆయన కారు ప్రమాదంలో పోయారు"

"సారీ"

"ఫరవాలేదులెండి. అంతగా బాధపెట్టదు నన్నా విషయం"

అర్థం కానట్టు చూశాను.

"పెళ్ళికి ముందర పెళ్ళి చూపులు కూడా జరగలేదు మాకు. పెళ్ళిలో చూశానంతే ఆయన్ని. మెడలో మూడుముళ్ళూ పడ్డాయి. కానీ అంత గట్టిగా పడలేదు. బంధం పెరగలేదు ఆయనతో. అందుకే

నా మనసంతగా బాధ పడదు"

"........."

"కానీ ఒంటరితనం అన్నారు చూశారూ! అది తలుపు తట్టినప్పుడు మాత్రం కాస్త బాధపడుతూ ఉంటాను"

"ఒకే జాతి మనుషులం" అన్నాను.

నవ్వింది సన్నగా.

"మీ అమ్మా నాన్నా...?"

"నేను ఆశ్రమంలో కళ్ళు తెరిచాను. ఆశ్రమం వాళ్ళే నా పెళ్లి కుదిర్చారు ఆయనతో. నాకు జన్మనిచ్చిన మనుషుల ఫొటోలు కూడా చూడలేదు"

"నేనూ మా అమ్మా నాన్నని చూడ లేదు ఎప్పుడూ" అన్నాను.

"చిత్రంగా ఉంది"

"మా తాతయ్యా పెంచాడు నన్ను చిన్నప్పటినుంచీ. మొన్నీ మధ్యనే పోయారాయన. మా మావయ్య మద్రాసు తీసుకొచ్చాడు"



"తల్లీ తండ్రీ ఉన్నవాళ్ళ జీవితం చాలా హాయిగా ఉంటుందనుకుంటాను"

"ఏమో! ఆ అనుభవం దేవుడివ్వ లేదుగా మనకి? ఊహ తప్ప ఇంకేం చెప్పలేం" అంటూ లేచాను క్లాసుకి టైమవ్వటంతో.

"కాఫీ తాగి వెళ్దురుగాని" అంది తను.

"క్లాసు టైమవుతోంది. వాడొచ్చేటప్ప టికి తెల్లారేటట్లుంది"

"ఫ్లాస్కులో అలాగే ఉంచుతాను. లంచ్ అవర్‌లో రండి"

"అలాగే!" అంటూ క్లాసుకి వెళ్ళి పోయాను.

క్లాసుకి చేరినా మనసు లైబ్రరీలోనే ఉండిపోయింది. గుండెలో ఆ శా దే వి రూపం నిలిచిపోయింది. ఆమె మాటలే మళ్ళీ మళ్ళీ వినిపించాయి.

అంతగా ఎప్పుడూ మాట్లాడలేదు తనతో.

కానీ...

ఎంత చనువు కనపడింది ఆ మాటల్లో!

ఎన్నో రోజుల పరిచయం ఉన్న స్నేహితుడితో ఎలా మాట్లాడతారో అలాగే మాట్లాడింది.

నాకూ కొత్త మనిషితో మాట్లాడు తున్నట్లు అనిపించలేదు.

కారణం ?

ఇంగ్లీషు సామెత గుర్తొచ్చింది. ఇద్దరివీ ఒకేరకం పరిస్థితులు కావటం మూలానా ?

'ఆశాదేవి' అని రాశాను రఫ్ బుక్‌లో

లెక్చరర్ పాఠం చెబుతున్నంతసేపూ సంతకం ప్రాక్టీస్ చేస్తున్నట్లు అలాగే ఆ పేరు రాస్తూ కూచున్నాను.

క్లాసయిపోయాక చూసుకుంటే నాకే నవ్వొచ్చింది. పేజీ అంతా నిండిపోయింది ఆశాదేవి పేరుతో.

ఇంకో క్లాసు మొదలయింది.

లంచ్ అవర్ ఎప్పుడొస్తుందా అని తప్ప వేరే ధ్యాసే లేదు మనసులో. బెల్ కొట్టగానే, ఆలస్యమయితే కొంప మునిగిపోతుందన్నట్లు, హడావిడిగా బయలుదేరాను లైబ్రరీకి.

"మీరు వెజిటేరియనా ?" అడిగింది ఆశాదేవి నన్ను లైబ్రరీలో అడుగు పెట్ట గానే.

"దేనికి ?"

"చెప్పండి"

"కాదు"

"టిఫిన్ తెచ్చుకున్నాను తింటారే మోనని" అంది తను.

"ఏం తెచ్చుకున్నారు ?"

"పలావు"

"చంపారు"

"ఏం ?"

"మీకు మిగలదేమో నేను మొదలు పెడితే."

"అంత ఇష్టమా మీకు ?"

"అయితే కూచోండి"

ఇద్దరం కూచున్నాం తింటూ.

"మీరే చేశారా పలావు ?"

"అవును"

"మిమ్మల్ని ఊరికే పొగుడుతుంటే ఏం అనుకోరుగా ?"

"ఏం అనుకోను. చెప్పండి."

"ఎప్పుడూ తినలేదు ఇంత రుచిగా"

"రోజూ చేసి పెడతాను మాయింటికి రండి."

"మీరలాంటి ఆహ్వానాలు ఇస్తే ప్రమాదం. నేనంత మంచి వాడినికాదు" అన్నాను నవ్వుతూ

"నేనూ మంచిదాన్ని కాదులెండి" అంది తనూ నవ్వుతూ.

వెటకారంగా అడిగింది ఆశాదేవి.

"ఇంతకీ మీరుండటం ఎక్కడ ?"

"అన్నానగర్"

"రేపు ఆదివారం కదా! మా యింటికి వస్తారా ?"

"పలావు చేసి పెడతారా ?"

"దానిదేం భాగ్యం ? రేపు నా పుట్టిన రోజు!"

"రియల్లీ ?"

"యస్!"

"ఎన్నో సంవత్సరంలోకి అడుగు పెడుతున్నారు ఆశాదేవిగారూ ?" అడిగాను.

"........."

"సారీ! అడగకూడదు కదూ ఆడవాళ్ళని ?"

"ఫరవాలేదు. నేనేం సినిమాస్టారుని కాదు. ఇట్ ఈజ్ మై ట్వంటీ సెవెన్త్"

"మీకు ఇరవై ఏడేళ్ళా ?"

"ఏం అలా అడుగుతున్నారు ?"

"నాకలా కనిపించటంలేదు."

"ఎలా కనిపిస్తున్నాను ?"

"మీవయసింకా తక్కువనుకున్నాను"

"పలావుకోసం భజన చేస్తున్నారన్న మాట ?"

"నిజం! యు లుక్ వెరీ యంగ్"

"మీ క్లాసుకి టైమవుతోంది. వెళ్ళిరండి" అంది నవ్వుతూ.

సాయంత్రం ఆఖరి క్లాసవుతుండగానే గుర్తొచ్చింది ఆశాదేవి అడ్రసు తీసుకోలేదని. వెంటనే క్లాసవుతుండగానే లేచి లైబ్రరీకి వెళ్ళాను.

"ఇందాక మీరెక్కడికెళ్ళారు ?" అడిగింది ఆశాదేవి.

"క్లాసుకి. ఇంకెక్కడికెళ్తాను ?"

"పుస్తకాలు లేకుండానే వెళ్ళారా ?"

అప్పుడు గుర్తొచ్చింది నాకు పుస్తకాలు అక్కడే మరిచిపోయానని. ఏ విషయం గుర్తుంది కనక ?

"మతిమరుపు బాగానే వుందే మీకు?"

నవ్వేశాను నేను.

"సరే కానీ, ఇదంతా ఏమిటి ?"

ఊసుపోక క్లాసులో అంతకు ముందు నేను తన పేరుతో నింపేసిన పేజీ చూపించింది ఆశాదేవి.

ఏం చెప్పాలో తోచలేదు.

నా అవస్థ చూసి విరగబడి నవ్వింది తను.

"రామకోటి రాస్తున్నా" అన్నాను.

"రాయండి. రోజూ రాయండి."

"ఇంతకీ రేపు పలావు పెడతారా లేదా ?"

"తప్పుతుందా ?" అంది ముఖం ఇబ్బందిగా పెట్టి.

"అలా అయితే రానులెండి."

"ఊరికే అన్నాను. తప్పకుండా రావాలి మీరు"

"మీ అడ్రసు చెప్పారు కాదు?"

"పరశువాకం పోస్టాఫీస్ దగ్గర"

"మద్రాసంతా నాకు కొత్త"

"మీ అన్నానగర్ నుంచి డైరెక్ట్ బస్ ఉందండీ. ఆఖరి స్టాప్ దాకా వచ్చేయాలి. బస్సు దిగగానే పోస్టాఫీసు కనబడుతుంది మీకు. పోస్టాఫీసు ఎదుటిల్లే. చాలా తేలిక కనుక్కోవటం" అంది.

"సర్లెండి"

"పదకొండు గంటలకల్లా వచ్చేయాలి. లేకపోతే మీ పలావు చల్లారిపోతుంది"

"చిత్తం"

ఇద్దరం కాలేజీ బయటకొచ్చాం. లెక్చరర్స్ ఇద్దరు ముగ్గురు మా వేపే చూశారు కలిసి వస్తుంటే.

ప్యారిస్ కార్నర్ దాకా వచ్చి బస్సెక్కి వెళ్ళిపోయింది ఆశాదేవి.

ఆమె వెళ్ళిపోయిన తరువాత దిగాలు పడిపోయానెందుకో. పొద్దుట్నించీ గంటలన్నీ నిమిషాల్లా గడిచి పోయినట్లనిపించింది.

కొందరి సాంగత్యం అంతే.

* * *

మర్నాడు పొద్దున్న నాలుగున్నరకే లేచికూచున్నాను.

ఎప్పుడూ అంత తొందరగా మెలుకువ రాదు నాకు. కానీ ఆ రోజు ఎవరో తట్టి లేపినట్లు లేచిపోయాను నిద్రలోంచి.

ఆశాదేవి పుట్టిన రోజని కాబోలు!

ఇంకా సూర్యుడు పూర్తిగా భూమ్మీద అడుగు పెట్టక పోయినా, చాలా పొద్దెక్కినట్లు అనిపించింది నాకు మటుకు. ఎవరో వెనకాల తరుముతున్నట్లు అన్నీ పనులూ కానిచ్చాను.

ఆరున్నరకే స్నానం చేసి తయారయ్యాను.

తొందరనిపించింది ఎందుకో.

"ఏం బావా! ఇవాళ పొద్దునే లేచావు?" శాంతి అడిగింది నా హడావిడి చూసి.

చాలా రోజుల తరవాత మాట్లాడింది తను నాతో. కాస్త ఆశ్చర్యమేసింది నాకు.

"ఇవాళ నా ఫ్రెండ్ పుట్టిన రోజు. భోజనానికి వెళ్ళాలి" అన్నాను.

"ఎన్ని గంటలకి?"

"పదకొండింటికి."

"మరయితే ఇప్పటినుంచీ ఎందుకు హడావిడి?"

అవును.

ఎందుకు?

నాకే దొరకలా సమాధానం.

తనకేం చెప్పేది?

"ఇంతకీ ఎవరబ్బా ఆ 'ఫ్రెండ్'?"

"మా కాలేజీ లైబ్రేరియన్"

"ఆడా? మగా?"

"ఆశాదేవి, ఆ అమ్మాయి పేరు."

"ఆవిడా! ?" అంది శాంతి.

"నీకు తెలుసా?" అడిగాను.

"అమ్మాయంటావేం?"

"అనకూడదా?"

"విన్నాలే ఆవిడ ఘనత"

ఎందుకో శాంతి మాటలు నాకు నచ్చలేదు.

"ఏదన్నా కొనివ్వాలనుంది శాంతీ! ఏం పట్టుకెళ్ళమంటావు?"

"ఏమో బాబూ! నీకే తెలియాలి" అంటూ వెళ్ళిపోయింది శాంతి.

అత్తయ్య పెట్టిన టిఫిన్ తిని బయట పడ్డాను. ప్యారిస్ కార్నర్‌కి వెళ్ళాను తిన్నగా ఏదన్నా కొందామని. ఉట్టి చేతులతో వెళ్తే ఏం బావుంటుంది?"

డబ్బులు ఎక్కువ లేవు నా దగ్గర. ఏం కొనగలనో తోచలేదు. చివరికి ఏదన్నా మంచి పుస్తకం ఇవ్వాలని నిశ్చయించుకున్నాను.

పావు తక్కువ తొమ్మిదయింది.

ఇంకా ఏ షాపూ తెరవలేదు. షాపు వాళ్ళందరి మీదా నాకు కోపం వచ్చింది.

ఎందుకు తొందర చేసోంది మనసు?

నా ఆత్రానికి నాకే నవ్వొచ్చింది. ఎందుకు నా మనసలా అస్తవ్యస్తంగా పరిగెడుతోంది?

నాకంటే అయిదేళ్ళు ముందుగా ఈ ప్రపంచంలో అడుగు పెట్టిన మనిషి ఆశా

దేవి. తియ్యటి స్నేహం తప్ప తన నుంచి ఇంకేం ఆశించకూడదేమో.

ఆలోచనకి అంతు తెలియనప్పుడు ఆ ఆలోచన అనేది మానివేయాలి కదా! అందుకే పదకొండు గంటలకోసం ఎదురు చూడటం తప్ప నా మనసు ఇంకేం ఆలోచించలేదు.

తొమ్మిదిన్నరకి ఏదో ఒక పుస్తకాల షాపు తెరిచారు.

పదింబావయింది పుస్తకం కొనేసరికి.

పరశువాకం చేరేటప్పటికి గంట పైచిలుకు పట్టింది. విసుగు పుట్టింది బస్సులో కూచోవటం. ఇల్లు మాత్రం ఆశాదేవి చెప్పినట్టు చాలా తేలికగానే దొరికింది.

రెండంతస్థుల మేడ అది.

మూడు నాలుగు పోర్షన్లు ఉన్నట్లున్నాయి మేడలో మొత్తం. ఏ పోర్షన్లో ఉంటోందో! మేడ మీద ఎడమవేపు భాగం అని చెప్పారు కిందవాళ్ళని అడిగితే.

వెళ్ళి తలుపు తట్టాను.

తలుపు తీసి నా ఎదుట నిలబడిన ఆశాదేవిని చూడగానే ఆనందంతో మనసు పరవశించింది.

జీవితంలోకి మళ్ళీ వసంతం ప్రవేశించినట్లయింది.

ఎర్రటి పువ్వులున్న వాయిల్ చీర కట్టుకుని చాలా సింపుల్‌గా ఉంది ఆశాదేవి. తలంటు పోసుకున్నట్టుంది కాబోలు మనిషి కడిగిన ముత్యంలా కనిపించింది. పుట్టిన రోజునాటి కొత్త బట్టల సంరంభం ఏం కనబడలేదు.

"ఏమిటలా బొమ్మలా నిలబడిపోయారు! లోపలికి రారా?" అంది నవ్వుతూ.

"పుట్టిన రోజు కదా! కొత్త చీర కట్టుకుంటారనుకున్నాను" అన్నాను లోపలికి అడుగుపెడుతూ.

"ఎవరున్నారు చెప్పండి నాకు కొనిపెట్టేందుకు?"

"............"

"పోనీ నేనే కొనుక్కున్నా ఎవరికోసం కట్టుకోను?" అంది.

ఆమె మాటల్లో, నేనెన్నోసార్లు అనుభవించిన ఆవేదనే కనపడింది.

కళ్ళప్పగించి ఆమెనలాగే పరీక్షగా చూశాను.

"నాకు పుట్టినరోజు అంత గొప్పగా జరుపుకోవటం అలవాటు లేదులెండి. అంతే మరేం లేదు." అంది నవ్వుతూ.

"బెస్ట్ విషెస్ ఆఫ్ ది డే."

"థాంక్ యు. మరి నాకోసం ఏం తెచ్చారు?"

"ఏం తేలేదే."

"పలావు ఊరికే తినిపోదామని వచ్చారన్నమాట?"

"మీ జీతం ఎంత?"

"అదేమిటి ఒక్కసారిగా మాట మార్చారు?"

"ఎంతో చెప్పండి?"

"పదకొండొందల చిల్లర."

"నాకు నెలకి మూడొందలొస్తుంది. సగం మా మావయ్యకి ఇస్తాను. సగం నాకు మిగులుతుంది. మీకు నేను కొనివ్వగలిగింది ఏముంటుంది చెప్పండి?"

"ఊరికే అడిగానంతే. సీరియస్‌గా తీసుకుంటారెందుకు?"

"కానీ మేడమ్! ఒకటి తెచ్చాను."

"ఏమిటో అది?"

నేను తెచ్చిన పుస్తకం ఆమె చేతిలో పెట్టాను.

పైన కట్టిన కాగితం చించి పుస్తకం ఏమిటో చూసింది. ఆమె పెదిమలు కాస్త విచ్చుకున్నాయి.

"నాకు మామ్ పుస్తకాలు ఇష్టమని మీకెలా తెలుసు?" అడిగింది తను.

"నాకు తెలియదు. మీకో పుస్తకం తేవాలనిపించింది. ఆలోచించి చివరికి ఇది కొన్నాను ఎందుకో. చాలా బావుంటుంది కథ. చదవండి"

"రండి మీ పలావు రెడీగా ఉంది"

కాస్త తినటంతోనే కడుపు నిండి పోయింది నాకు. సంతోషం ఎక్కువయితే ఉన్న ఆకలి కూడా చచ్చిపోతుందేమో! ఎంత ఇష్టమయినా ఎక్కువ తినలేక పోయాను.




మరికాస్త వడ్డించబోయింది ఆశాదేవి.

"చాలింక"

"అదేమిటి? అప్పుడే అయిపోయిందా?"

"ఆ..."

"నిన్న మీ ధోరణి చూసి ఇద్దరికి సరిపడేది చేశాను. మొత్తం మీ కోసమే. వద్దంటే వీల్లేదు"

"సారీ ఇక తినలేను"

బలవంతం చేసి మరికాస్త తినిపించింది ఆశాదేవి.

"ఆయురారోగ్యాలతో వర్ధిల్లండి" అన్నాను లేస్తూ.

"సినిమాకెళ్దామా?" అడిగింది.

"సినిమాకా?"

"పోనీ సర్కస్‌కి వెళ్దామా?"

"సరే"

చకచకా పది నిమిషాల్లో తయారయింది తను. మామూలుగా ఆడవాళ్లు బయటకి బయలుదేరటానికి అరగంట ముస్తాబవుతారు. కొంతమంది మరీ ఘోరం. తను మటుకు చాలా తొందరగా కానిచ్చింది. నేనూ కాస్త ముఖం కడుక్కున్నాను. ఇద్దరం బయలుదేరాం.

బయటకొచ్చి నడుస్తుంటే అనిపించింది నాకు.

ఎంతవయసొచ్చినా పసితనం ఏ మనిషిలోనూ పూర్తిగా మాసిపోదని. ఆ ఛాయలు ఎప్పుడు తారాడుతూనే వుంటాయి.

ఊరి చివరగా ఉంది సర్కస్. గంట పట్టింది ఆటోలో అక్కడికి చేరటానికి. టిక్కెట్లు తీసుకున్నాను ఇద్దరికి. ఇంకా టైముంది షో మొదలవటానికి. ఇద్దరం దూరంగా ఖాళీ స్థలంలో కూచున్నాం.

"ఓ విషయం చెప్పాలనుంది" అంది ఆశాదేవి కూచోగానే.

"ఏమిటి?"

"ఎందుకో మిమ్మల్ని చూసిన తర్వాత మాట్లాడాలనిపించింది"

"...........,"

"కాసేపు మాట్లాడిన తర్వాత మరి కాసేపు గడపాలనిపించింది. అందుకే మిమ్మల్ని ఇంటికి పిలిచాను ఇవాళ. ఇప్పుడనిపిస్తోంది"

"ఏమని?"

"వీలయినన్ని రోజులు ఇలాగే గడపాలని"

"ఆశాదేవిగారూ!"

ఏమిటన్నట్టు చూసింది నా వేపు.

"నా మనసులో మాట...నేను చెప్పాలనుకున్నది.మీరే చెప్పేశారు" అన్నాను.

"థాంక్యు. మరలా జరగాలంటే దానికి కొన్ని షరతులున్నాయి. ఏం అనుకోకూడదు" అంది.

"చెప్పండి"

"మనం ఎప్పుడు బయటకొచ్చినా ఖర్చంతాఇకనుంచీ నేనే చూసుకుంటాను."

"కాని..."

"ఇందాక ఆటోకిచ్చింది మీరు. టిక్కెట్లూ మీరే తీసుకున్నారు. ఇక ముందు మీరు పైసా కూడా ఖర్చు పెట్టటానికి వీల్లేదు"

మాట్లాడలేదు నేను చాలా సేపు.

"మిమ్మల్ని నేనేం చులకన చేయటం లేదు" అంది.

"............"

"నిజంగా నేనంటే మీకు కాస్తన్నా ఇష్టమనేది ఉంటే, అభిమానం అనేది రానే రాదు. తెలుసా?"

ఆమె మాటలు నిజమేననిపించాయి. తను చెప్పిన దాంట్లో తప్పేం కనిపించలేదు.

"అలాగే లెండి" అన్నాను.

"ఇంకోటి"

"చెప్పండి మేడమ్!"

"మనం స్నేహితులం కదా!"

"అవునూ"

"'అండీలు' వద్దు"

నేను ఎంతగానో ఆశించిన తోడు అనుకోని క్షణంలో అకస్మాత్తుగా నాద యింది. ఎంతో దగ్గరయింది కోరు కున్నట్టు. ఆనందంతో మనసు పొంగి పోయింది.

అడగకుండానే దరాలు ప్రసాదించే దేవతలా కనిపించింది ఆశాదేవి నా కళ్ళకి.

సర్కస్ చూడటం నేనివాళ రెండో సారి. చాలా బావున్నాయి ఫీట్సన్నీ. ఎంతో సరదాగా గడిచిపోయింది రెండు న్నర గంటలూ. హోటలుకెళ్ళి టిఫిన్ చేసి బీచ్‌కి వెళ్ళాం.

చీకటి పడుతోంది అప్పుడే.

"పరీక్షలింకా ఎన్ని రోజులున్నాయి?" అడిగింది ఆశాదేవి.

"మూడు నెలలు"

"మొన్న ఇంటర్నల్ ఎసెస్ మెంట్‌లో ఎన్ని మార్కులు వచ్చాయ్?"

"మా క్లాసులో ఫస్ట్ నేనే," అన్నాను.

"కాలేజీ ఫస్ట్ రావాలి ఇయర్లీ ఎగ్జా మ్స్‌లో." అంది.

"నాకూ కావాలనే ఉంది. ప్రయత్నం చేస్తున్నాను అందుకే. కానీ కాస్త కష్టంగా ఉంది."

"దేనికి?"

"సిలబస్ చాలామటుకు నాకు కొత్త. అక్కడక్కడ అర్థం కావటం లేదు ఎంత చదివినా."

"ఓ పని చేయకూడదూ !"

"ఏమిటి?"

"రోజూ కాలేజీ అయిపోయాక మా ఇంటికి వస్తే నేను చెప్తాను అర్థం కాని లెసన్స్ అన్నీ."

"! ! !"

"ఎమ్. ఎ. లో ఫస్ట్ క్లాసొచ్చింది నాకు." అంది తను.

"అలా అని కాదు.... "

"మగతనం తలెత్తిందా? "

"కాదు మేడమ్!"

"మరేంటి మేడమ్? "

"అనవసరంగా తమరి టైం వేస్టయి పోతుంది కదా అని."

"ఏం కాదు. రేపటినుంచీ తమరు నా గృహాన్ని పావనం చెయ్యండి. "

"చిత్తం"

"చీకటి పడింది. వెళ్దామా ఇక!" నవ్వుతూ లేచింది ఆశాదేవి.

నేనూ లేచాను.

ఇద్దరం పారిస్‌కార్నర్ దాకా నడిచాం.

దాదాపు ఓ మైలు దూరం నడిచినా, అంత దూరం అనిపించ లేదు. కబుర్లలో మునిగి పోయినందుకేమో. చిన్న పిల్లల్లా కబుర్లు చెప్పుకున్నాం.

పరశువాకం బస్సు ముందొచ్చింది.

"గుడ్‌నైట్" అంది ఆశాదేవి.

"వెరీ గుడ్‌నైట్ మేడమ్!" అన్నాను.

బస్సెక్కి వెళ్ళిపోయింది తను.

నేనూ బస్‌కోసం నిలబడ్డాను. ఆ రోజు ఉన్నంత హుషారుగా జీవితంలో అంతదాకా, ఏనాడూ లేనేమో.

నోట్లోంచి ఈల వచ్చింది అప్రయ త్నంగా.

బస్టాండులో ఉన్నవాళ్ళు నవ్వారు. నేను మటుకు ఈల వేయటం మాన

లేదు బస్సెక్కే దాకా.




మనిషితో చెప్పకుండానే కాలం పరిగెడుతుంది అప్పుడప్పుడు.

నాకూ అలాగే జరిగింది.

రోజూ ఆశాదేవి ఇంటికి వెళ్ళటం, ఓ రెండు గంటల సేపు కూచోవటం, కాసేపు చదువుకోవటం, మరి కాసేపు కబుర్లు చెప్పుకోవటం - అలా ఓ కొత్త జీవితం, దైనందిన కార్యక్రమం అలవాటయి పోయింది.

చదువు కంటే కూడా, ఆశాదేవిని రోజూ చూస్తూ ఉండొచ్చని వెళ్ళేవాడిని. చందమామలో కూడా కనిపించని వింత అందాలెన్నో ఆమె ముఖంలో దోబూచులాడుతూ ఉంటాయి.

తననే చూస్తూ పాఠం వినకుండా కూచునే నన్ను మెత్తగా మందలించేది ఆశాదేవి. తన మందలింపు కూడా తియ్యగా ఉండి మరీ మరీ కావాలనిపించేది.

ఓ గంటన్నా చదువు చెప్పించుకుంటేనే కాని వేరే ఏ విషయమూ మాట్లాడనిచ్చేది కాదు. తన శ్రద్ధ చూస్తే నాకే ఆశ్చర్యం వేసేది. గతి తప్పకుండా అన్నీ జరిగేవి. కొత్తలో కాస్త నిర్లక్ష్యంగా ఉన్నా తరువాత నాలోనూ ఏకాగ్రత చోటు చేసుకోవటంతో చదువులో లీనమయిపోయాను పూరిగా.

అందుకే లెక్కపెట్టలేదేమో రోజులు.

అంత బాగా ప్రతీ సబ్జెక్టూ విడమర్చి చెప్పగలదని నేనసలు ఊహించలేదు. ఆడపిల్లకదా ఏం చెప్పగలదులే అనుకున్నాను! కానీ తను చెప్పే తీరు కొన్ని రోజులు చూడేగానే నా అంచనా ఎంత తప్పో అర్థమయింది.

నోట్స్ కూడా డిక్టేట్ చేసేది ఎంతో ఓపికతో. ప్రతీ సబ్జెక్టూ వివరంగా, చక్కటి నోట్స్ రాసుకున్నాను.

రెండు నెలలు గడిచిపోయాయి.

పరీక్షలింకా నెల రోజులున్నాయి. ఆ రెండు నెలల చదువుతో నాకెంతటి నమ్మకం వచ్చిందంటే, అప్పటికప్పుడు నన్ను పరీక్ష రాయమన్నా రాయగలననిపించింది.

ఆ మాటే అన్నాను ఆశాదేవితో ఒక రోజు.

"ఓ మాట చెప్పనా?" అంది తను.

"ఏమిటి?"

"కాలేజీ ఫస్టు రావాలని చదివితే క్లాసులో మాత్రమే ఫస్టొస్తాం."

"అయితే?"

"నిజంగా కాలేజీ ఫస్ట్ రావాలంటే యూనివర్సిటీ ఫస్ట్ కోసం చదివినట్లు చదవాలి."

"అలాగా, మేడమ్!?"

"యస్ మై డియర్ బోయ్" అంది ఆశాదేవి నవ్వుతూ.

"గురువుగారి ఆజ్ఞ శిరోధార్యము" అన్నాను.

"ఈ ఏడు సిలబస్ అంతా కవరయింది కదా నువ్వు తయారు చేసుకున్న నోట్సుల్లో?"

"అయింది."

"కాలేజీ ఇక పది రోజులే ఉంటుంది. ఆ తరువాత ఇరవై రోజులు సెలవ లిస్తారు. సెలవలిచ్చారని తిరగటానికి వీల్లేదు. ఒక్కరోజు కూడా వేస్టు చెయ్యకుండా చదవాలి తమరు."

"చిత్తం"

"సెలవుల్లో కూడా రావాలి ఇక్కడికి."

"చిత్తం"

పరీక్షలు తనకే అన్నంత శ్రద్ధ చూపించేది ఆశాదేవి. నాకూ పరీక్షలు దగ్గర పడ్డాయని ఉత్సాహం వచ్చింది.

కాలేజీకి మర్నాటినుంచీ సెలవలనగా ఓ రోజు లైబ్రరీకి వెళ్ళినప్పుడు అడిగింది ఆశాదేవి-

"నీకు నాటకాలూ, సంగీతం ఏం అలవాటు లేదా?"

"దేనికి?"

"ప్రిన్సిపాల్‌గారు కాలేజీలో కల్చరల్ ఫారమ్ పెడతారట. ఇవాళ కల్చరల్ సెక్రటరీ ఎవరో తేలిపోతుంది."

"ఎలక్షన్లా"

"ఎలక్షన్లు తీసేశారుగా? అందుకే ఇలా ఫోరం అని మొదలుపెడుతున్నారు."

"అయితే సెక్రటరీని ప్రిన్సిపాల్ గారు సెలక్ట్ చేస్తారా?"

"పోటీ పెడుతున్నారు."

"ఏం పోటీ?"

"ఒక్కొక్కళ్ళకి పది నిముషాలు టైం ఇస్తారు. ఆ టైంలో ఏకపాత్రాభినయం చేయటమో, పాటలు పాడటమో, కవితలు చదవటమో..ఏదో ఒకటి చేయాలి. ఎవరి అయిటమ్ అందరి కంటే బావుంటుందో అతన్నే కాలేజీ కల్చరల్ సెక్రటరీగా సెలెక్ట్ చేస్తారు."

"ఎలా తెలుస్తుంది? ఎవరు నిర్ణయిస్తారు?"

"బయటినుంచి అయిదుగురిని పిలిచారు జడ్జీలుగా."

"ఎప్పుడు పోటీ?"

"ఇవాళే! మధ్యాహ్నం."

"ఎవరు చూస్తున్నారు ఇదంతా?"

"శాస్త్రిగారనుకుంటా. ఏం నువ్వు కూడా ఏదన్నా అయిటమ్ చేస్తావా?"

"అవును"

"ఏం చేస్తావు?"

"కల్చరల్ సెక్రటరీని అవుతాను."

శాస్త్రిగారి దగ్గరకెళ్ళి నాపేరు కూడా ఎంటర్ చేసుకోమని అడిగాను. నేనేదో అడగకూడనిది అడిగినట్లు చూశాడాయన నన్ను ముందర. పోటీ చేయటానికి నాకు అర్హతలేదా అని అడిగాను. మారు మాట్లాడకుండా నా పేరు కూడా రాసుకున్నారాయన.

చాలా ఉత్సాహం వేసింది.

నాకు తెలుసు నా పాటలతో అందరినీ మెప్పించగలనని. చదువులో ఫరవాలేదని పించుకున్నాను. ఇక మిగతావాటిల్లో కూడా నా సామర్థ్యం కొద్దో గొప్పో చూపిస్తే పరిస్థితి ఇంకాస్త మెరుగవ్వొచ్చు.

మధ్యాహ్నం రెండు గంటలకి మొదలయింది కార్యక్రమం. మీటింగ్ హాలంతా స్టూడెంట్స్‌తోనూ, స్టాఫ్‌తోనూ నిండి పోయింది. చాలామంది నిలబడ్డారు కూడా. ఒకటే కలకలం.

డయాస్ మీద రెండు పొడుగాటి బల్లలూ, ఆరు కుర్చీలూ వేశారు. ప్రిన్సిపాల్‌గారూ, జడ్జీలుగా వచ్చిన పెద్ద మనుషులూ కూచున్నారు. మైకు తప్ప

ఇంకేం పెట్టలేదు.

నేను కాక మొత్తం పదిహేనుమంది స్టూడెంట్స్ ఉన్నారు పోటీలో. నా పేరు అందరికంటే ఆఖర్న ఉంది కాబట్టి హాలుకి చివరగా కూచున్నాను.

బి.ఎస్.సి. స్టూడెంట్ కవిత్వంతో మొదలయింది పోటీ.

తరువాత మరో స్టూడెంట్ ఏకపాత్రాభినయం చేశాడు. దుర్యోధనుడి మయసభ సీను. మేకప్ లేకుండానే దుర్యోధనుడిలా ఉన్నాడు.

మైకు బాగానే పనిచేస్తున్నా కుర్రాళ్ళ గొడవ మూలాన అక్కడక్కడ సరిగ్గా వినపడటంలేదు. అయినా పోటీలో ప్రతి స్టూడెంటూ తన పని చేసుకుపోయాడు.

నా పేరు పిలిచారు.

వెనకాలనుంచి స్టేజి దగ్గరకి చేరటానికే చాలా సేపు పట్టింది. నేను నడుస్తున్నప్పుడు గోల మరికాస్త ఎక్కువయింది. అదంతా జలపాలరావు చలవేనని నాకు తెలుసు.

వాళ్ళని ఎలా దారిలో తీసుకు రావాలో కూడా తెలుసుగా.

మైకు ముందర నిలబడినా ఓ నిమిషం సేపు నేను నిశ్శబ్దంగా ఉండిపోయాను. తలవంచుకుని నిలబడ్డాను ఎవరి వేపూ చూడకుండా.

నేను అనుకున్నట్లే జరిగింది.

నేను ఎందుకు మొదలు పెట్టలేదో అర్థం కాక అందరూ వింతగా చూస్తున్నారు. కలకలం అంతా సద్దుమణిగింది. తరువాత క్షణం కూడా వృథా చేయలేదు నేను.

'పలుకే బంగారమాయెరా' అందుకున్నాను.

హాలులో నిశ్శబ్దం చెక్కుచెదరకుండా నిలిచిపోయింది.

ఘంటసాల గీతం మరొకటి పాడాను.

హుషారు పుట్టించటానికి మరో ప్రేమ గీతం కూడా పాడాను.

హాలు దద్దరిల్లిపోయింది చప్పట్లతో.

కల్చరల్ సెక్రటరీ ఎవరో అందరి మొహాలమీదా కనిపించింది. నా నమ్మకం నిజమయినందుకు సంతోషించాను.

"నారాయణస్వామి''శాస్త్రిగారు మరో పేరు పిలిచారు.

నాలాంటి 'మరో లేట్‌కమర్' అనుకున్నాను.

మిమిక్రీ మొదలు పెట్టాడు అతను.

నవ్వని మనిషి లేడు అతని మిమిక్రీకి. హాల్లో నవ్వులు రెండింతలు మూడింతలుగా ప్రతిధ్వనించాయి.

నేనూ నవ్వాను.

కానీ...

గెలుపు అతనిదే అవుతుందనిపించింది. ఓటమి భరించలేకేమో, అక్కడ ఉండ బుద్ధి కాలేదు. మెల్లగా నడిచి వెళ్ళి హాలు బయటగా గుమ్మం దగ్గర నిలబడ్డాను.

పది నిమిషాలు పట్టింది మార్కులు లెక్కపెట్టటానికి.

ప్రిన్స్‌పాలుగారు లేచారు.

'నారాయణస్వామి' అంటారనుకున్నాను.

"రాజు!'' అని వినిపించింది.

కాసేపు నమ్మలేకపోయాను.

స్టూడెంట్సందరూ నన్ను పైకెత్తేశారు పొగడ్తలతో. చింతలపూడి కాలేజీలో కూడా అంత అభిమానం చూడలేదు నేను.

ఆఖరికి నా విలన్ అనుకున్నతను కూడా వచ్చాడు నా దగ్గరికి.

''కంగ్రాట్స్" అన్నాడు చేయి చాపి.

నేనూ చేయి కలిపాను ఏమనాలో

తోచక.

"మర్చిపో రాజూ అంతా" అన్నాడు.

"ఏమిటి?"

"వి ఆర్ ఫ్రెండ్స్."

"విత్ ప్లెజర్" అన్నాను.

ఆశాదేవి కూచున్న వేపు చూశాను.

అప్పుడే బయటకి వెళ్తున్నారు స్టాఫ్ అందరూ. నడుస్తూ నడుస్తూ నా వేపు చూసింది ఆశాదేవి.

'దొంగా! నీ పని చెప్తానుండు.' అన్నట్లుంది ఆమె చూపు.

నవ్వాను.

పోటీ జరగటం మూలాన అవాళ మధ్యాహ్నం క్లాసులు కాన్సిల్ చేశారు. లైబ్రరీకి వెళ్ళాను ఆశాదేవిని కలవటానికి. తను కూడా అప్పుడే బయలు దేరుతోంది.

ఇద్దరం నడుస్తూ సాంటెస్‌కార్నర్ దాకా వచ్చాం.

"నాతో చెప్పలేదే ఇన్ని రోజుల నుంచీ?" అంది

"ఏమిటి?"

"ఓ రెండు పాటలు పాడగానే పెద్ద పోజు పెట్టేయాలి కాబోలు!" అంది ఆశాదేవి చిరుకోపంతో.

నవ్వేశాను నేను.

"ఇవాళ నువ్వు పార్టీ ఇవ్వాలి"

"దేనికీ?" అడిగాను.

"కల్చరల్ సెక్రటరీ అయినందుకు."

"అలాగే! పద"

ఇద్దరం మంచి హోటల్‌కి వెళ్ళాం. టిఫిన్ చేశాం కడుపు నిండా. చాలా సేపు అక్కడే కూచుండిపోయాం కబుర్లు చెప్పుకుంటూ. అయిదు దాటింది.

"కాసేపు బీచికెళ్ళి కూచుందాంరాజూ" అంది.

"సరే"

"చాలా బాగా పాడావు" అంది నడుస్తూ.

"నాకు మటుకు, నారాయణస్వామిని సెలెక్ట్ చేస్తారేమో అనిపించింది తెలుసా?"

"ఎందుకు?"

"సంగీతం ఇష్టం లేనివాళ్ళు అక్కడక్కడ ఉండొచ్చు. కాని మిమిక్రీ అంటే ఇష్టం లేనివాళ్ళు ఎవరుంటారు చెప్పు?"

"కావచ్చు. కానీ సంగీతానికున్న విలువ వేరు కదా! నువ్వు పాట పాడుతుంటే ఆ జడ్జీలలో ఒకాయన తాళం వేశాడు తెలుసా మెల్లగా? ఎంతగా ఆయన లీనమయి ఉండకపోతే అలా జరుగుతుంది చెప్పు?"

"ఏదోలే అయిపోయిందిగా."

"నీ గొంతు చాలా బావుంది. మనకున్న టాలెంట్ ఎప్పుడూ వేస్ట్ కానివ్వకూడదు. పరీక్షలయ్యాక ఇంకా ప్రాక్టీసు చెయ్యాలి నువ్వు."

"నాకటువంటి పిచ్చి లేదులే. అనవసరంగా నన్ను ఆకాశానికి ఎత్తేయకు" అన్నాను నవ్వుతూ.

"ముందర నాకు ఇంకాసిని పాటలు వినిపించు. ఇంకా వినాలనుంది" అంది ఆశాదేవి ఇసుకలో కూచుంటూ.

"ఇప్పుడా ?"

"భజన చేయమంటావా ?"

"వద్దులే" అంటూ పాడటం మొదలెట్టాను.

దాదాపు ఓ రెండొందల పాటలదాకా వచ్చు నాకు. పది పాటలు పాడాను ఆశాదేవి బలవంతం మీద. గొంతు కాస్త నెప్పి పుట్టింది కూడా.

ముగ్ధురాలై కూచుంది ఆశాదేవి.

ఇంకా పాడమంది.

"బోరు కొట్టటం లేదూ ?" అడిగాను.

"లేదు. ఇంకొక్క పాట పాడు"

"టైం ఎంతయిందో తెలుసా ?"

వాచి చూచుకుని లేచింది ఆశాదేవి.

బస్సుకోసం నిలబడ్డాం ఇద్దరం పారిస్‌కార్నర్ దగ్గర.

"రేపటినుంచీ సెలవులు" అంది ఆశాదేవి.

"అవును కదూ !"

"తమ దర్శనం ఉంటుందా ?"

"రోజూ తమరి మందిరానికి వచ్చి హాజరువేయించుకుంటా మేడమ్!" అన్నాను చేతులు జోడించి.

నవ్వింది తను.

తను వెళ్ళిన తరువాత బస్సుకోసం చాలాసేపు నిలబడవలసి వచ్చింది మద్రాసులో బస్సులు ఎప్పుడూ కరక్ట్ టైంకి వస్తాయి. ఆ రోజు ఎందుకో బస్సు దొరకలేదు సమయానికి.

ఇంటికి చేరేటప్పటికి పదయింది.

గుమ్మంలో అడుగు పెడుతుంటే కేకలు వినిపించాయి మావయ్య గదిలోంచి. మావయ్యా, అత్తయ్యా పోట్లాడుకుంటున్నట్లుంది.

గదిలోకి వెళ్ళి పడుకున్నాను మాట్లాడకుండా.

శాంతి వచ్చి అన్నానికి పిలిచింది. కాసేపయినతర్వాత శాంతిని అడుదామనుకున్నాను. కాని తను గిన్నెలన్నీ టేబిల్ మీద పెట్టి గదిలోకి వెళ్ళిపోయింది.

అన్నం తినటం అయ్యాక శాంతిని అడిగాను నిద్రపోతుంటే లేపి.

"ఏమిటి శాంతీ గొడవ ?"

"ఏం లేదులే"

"చెప్పకూడదా నాతో ?"

"రేపు చెప్తాలే పడుకో"

అంతవరకూ ఆ యింట్లో ఎవరూ పోట్లాడుకోవడం చూడలేదు. గట్టిగా మాట్లాడుకోవటం కూడా ఎప్పుడూ వినలేదు. మరి ఈ రోజు ఏం జరిగిందని ఒక్కసారిగా వాతావరణం మారిపోయింది ?

కారణం కనపడలేదు ఎంత ఆలోచించినా.

ఆ రాత్రి కళ్ళు మూసుకోగానే నిద్ర పట్టింది.

* * *

పొద్దునే నిద్ర లేవగానే రాత్రి గొడవంతా గుర్తొచ్చింది. శాంతిని అడిగాను.

మళ్ళీ తప్పించుకోవటానికి ప్రయత్నం చేసింది. ఇక అలా లాభం లేదనుకుని బయటకు తీసుకెళ్దామని నిశ్చయించుకున్నాను. శాంతి నాకు కాఫీ ఇవ్వటానికి గదిలో కొచ్చినప్పుడు అన్నాను-

"శాంతీ! బయటకి వెళ్దాం నీతో పనుంది."

"ఎందుకు ?"

"చెప్తాను. నువ్వు ముందర స్నానం కానీ"

"నేనివాళ మా ఫ్రెండ్‌వాళ్ళింటికి వెళ్ళాలి బావా!"

"వెళ్దువుగానిలే. పావుగంట పనంతే! ఇద్దరం కలిసి పోదాం. కాసేపు కూచుని అటునుంచి నువ్వెళ్ళి పోదువుగాని"

సరేనంది శాంతి.

ఇద్దరం తయారయి బయటపడేసరికి పదయింది. హోటలుకి తీసుకెళ్ళాను శాంతిని. ఫేమిలీ రూంలో కూచున్నాం డిస్టర్బెన్స్ లేకుండా. ఇద్దరికీ టిఫిన్ ఆర్డరిచ్చాను.

"ఇప్పుడు చెప్పు శాంతీ'' అన్నాను.

''ఏమిటి ?''

"రాత్రి గొడవ సంగతి"

"ఎందుకు ?"

''చెప్పవా ?"

''నీకెందుకు రాజూ ? నువ్వు చేసేది ఏం లేదులే"

"నే పరాయివాడినా ?"

"పరాయివాడివని కాదు. అనవసరంగా నువ్వు తలకాయ నొప్పి కొని తెచ్చుకున్నట్లవుతుంది"

"చెప్తావా లేదా!" అడిగాను చివరికి విసుగ్గా.

''నాకో పెళ్ళి సంబంధం వచ్చింది"

"అయితే గొడవ దేనికి?"

మాట్లాడలేదు శాంతి.

''నీ కిష్టం లేదా?" అడిగాను.

అరక్షణం నా కళ్ళలోకి చూసింది శాంతి.

''చెప్పు?" అన్నాను.

''ఏం చెప్పమంటావు?" అంది తల దించుకుని.

''నీ కిష్టం ఉందో లేదో చెప్పు?"

''నా యిష్టాయిష్టాలతో పనుందంటావా?'' అంది శాంతి. తన గొంతు వణికింది. కళ్ళు మసకకమ్మాయి కన్నీళ్ళతో.

నా గుండె నీరయిపోయింది.

ఉబక వస్తున్న కన్నీళ్ళని బలవంతాన ఆపుకున్నాను.

''నన్ను క్షమించు శాంతీ!'' అన్నాను

''...............''

''నీ మనసు నాకు తెలుసు. కానీ నా మనసు నీకు తెలియదు.''

''తప్పు నాదే'' అంది శాంతి.

''లేదు శాంతీ! అది తప్పుకాదు. ఆ ఉద్దేశం నీలో కలగటం, దానికి ప్రేరణా -అవి మన చేతిలో లేవు. మన ఊహ కందని శక్తి ఏదో అటువంటి భావన పుట్టిస్తుంది ప్రతి మనిషిలోనూ.అయితే.."

తలెత్తి నా వేపు చూసింది శాంతి.

"కారణం నాకు తెలియదు కాని, నిన్ను ఆ దృష్టితో చూడలేకపోతున్నాను. మనసుతోడుగా నిలవని అటువంటి పరిస్థితుల్లో, నేను నిన్ను పెళ్ళి చేసుకున్నా మనం సుఖపడగలమంటావా?"

''ఆ విషయం ఇంక వదిలేద్దాం బావా" అంది శాంతి.

"నామీద కోపం వచ్చింది నీకు"

"లేదు బావా కోపం దేనికి! నీ నిజాయితీకి సంతోషంగా వుంది నీ మనసులో మాట నిక్కచ్చిగా చెప్పినందుకు థాంక్స్"

"క్షమిస్తావు కదూ !"

"క్షమ అర్థించాల్సినంత పొరపాటు నువ్వేం చేయలేదులే. ఫర్ గెట్ ఇట్"

"థాంక్స్ శాంతీ. మరి నే చెప్పినట్టు వింటావా ?"

"ఏమిటి ?"

''మావయ్య చెప్పిన మనిషిని పెళ్ళి చేసుకో"

నవ్వింది శాంతి.

''ఎందుకు నవ్వుతున్నావు ?"

"అది జరిగే పని కాదు బావా!''

"ఏం ?''

"అతను డాక్టర్. పదిహేను వేలు కట్నం కావాలిట. పెళ్ళికీ, లాంఛనాలకీ మరో పదివేలు తేలిగ్గా అవుతుంది. అమ్మ లెక్క ప్రకారం మొత్తం పాతిక వేలు కావాలి"

"అపును"

''నాన్నని అప్పు తెమ్మంది అమ్మ.

ఆయన మాత్రం ఎక్కడనుంచీ తేగలడు. దొరకాలిగా! పదిరోజుల నుంచీ తిరిగితే రెండు వేలు పుట్టించే సరికి తలప్రాణం తోక్కొచ్చింది"

"దానికి అంత పోట్లాట దేనికి ?"

"ఆ సంబంధం వద్దంటాడు నాన్న"

"మరి ...?"

"మన తాహతుకి తగిన వాడినీ, అందుబాటులో ఉన్న వాడినీ చూసి పెళ్ళి చేస్తానంటాడాయన అలా కాదు, అతనికే ఇచ్చి చెయ్యాలంటుంది అమ్మ"

"మీ అమ్మ చెప్పిందే కరెక్టు."

"ఎక్కడన్నా కన్నం వెయ్యాలి మా నాన్న."

"అంత అవసరం లేదులే. పద వెళ్దాం" అంటూ లేచాను. శాంతి తన పని మీద వెళ్ళిపోయింది.

గుండె తేలికపడింది.

ఉన్నదున్నట్లు శాంతికి చెప్పటం తప్ప వేరే గత్యంతరం లేదనిపించింది ఆ క్షణంలో. ఎంత చక్కగా అర్థం చేసుకుంది శాంతి! ఎందుకో తన మీద కృతజ్ఞతతో నిండిపోయింది నా మనసు.

తను సుఖపడాలి.

అందుకు నా చాతనయినంత సాయం చెయ్యాలి.

మావయ్య ఆఫీసుకి బయలుదేరాను.

అది రెండోసారి ఆయన ఆఫీసుకి నేను వెళ్ళటం. నన్ను చూడగానే కాఫీ తెప్పించాడు మావయ్య వద్దంటున్నా.

"ఏరా ఇలా వచ్చావు?" అడిగాడు మావయ్య.

"చిన్న పనుంది మావయ్యా."

"చెప్పు"

"శాంతికి సంబంధం వచ్చిందటగా?"

"నీకెవరు చెప్పారు?"

"ఎవరు చెప్తే ఏంలే. నువు మాత్రం



చెప్పలేదుగా?''

"ఖాయమయితే చెప్పేవాడిని.''

"ఎందుకు ఖాయం కాలా?''

"కుదరదురా అది.''

''డబ్బేగా సమస్య?''

అవునన్నట్టు తలూపాడు మావయ్య.

"నేను ఇరవై వేలు ఇస్తాను. మిగతాది ఎలాగో అలా అవస్థపడొచ్చు."

''ఇది చెప్పటానికా నువు ఆఫీసు కొచ్చింది?''

''అవును"

''నాకవతల బోలెడంత పనుంది. నువ్వు ఇంటికెళ్ళు."

''నే చెప్పిన మాట సంగతి?''

"నువు నాకిదివరకు చెప్పావుచూడు?''

''ఏమిటి?''

''డబ్బులు తీసుకోకపోతే మీ ఇంట్లో ఉండను, వెళ్ళిపోతాను అన్నావు. గుర్తుందా?''

"అన్నానూ, అయితే?''

"నేనూ ఉప్పుకారం తింటున్నా కదర్రా?''

"..................''

"నీకుండే అభిమానం నాకెందుకు ఉండ దనుకున్నావు?''

ఏం చెప్పాలి ఆయనకి?

''దానికీ దీనికీ లంకె పెడతావెందుకు? అలా అంటేనే కానీ నువు ఒప్పుకోవని ఏదో అన్నాను."

''నాకక్కర్లేదురా నీ దానం.''

''దానం అని ఎందుకనుకుంటావు?"

''మరేమిటి?''

"అప్పుగా తీసుకో పోనీ."

''నేను చచ్చాక కూడా తీరదు నీ అప్పు.''

''అర్థం లేకుండా మాట్లాడకు. పోనీ ఓ పని చెయ్యి.''

''ఏమిటి?''

''ఇప్పుడు నెలనెలా నీకు నూటయాభై ఇస్తున్నా కదా?''

"అయితే?''

''ఇకనుంచీ నువ్వే నాకు నెలకి వంద రూపాయల చొప్పున ఇవ్వు. ఏమంటావు?''

"..................''

''నా చదువయ్యేదాకా నీతోనే ఉంటాగా? ఎలాగో ఎమ్. ఎ. కూడా చదువుతాను. చదువయ్యేటప్పటికి అప్పంతా తీరిపోతుంది.''

'' రాజా! నా మాట విను. దానికి డాక్టరు దొరక్కపోయినంత మాత్రాన కొంప మునిగేది లేదు. చదువుకుంటోంది. ఏదో ఉద్యోగం వేయిస్తాను ఆ చదువు కాస్తా కాగానే ఎవడి కాళ్ళోపట్టుకుని. దాని బతుకది బతుకుతుంది.''

'' అలా అంటే ఎలా మావయ్యా? నువు అడ్డు చెప్పబోకు. చేతులారా ఎందుకు పాడు చేస్తావు ఒచ్చిన మంచి సంబంధాన్ని? అసలు నీకు ఈ మాత్రం కట్నంతో డాక్టర్లు దొరుకుతారా చెప్పు ఈ రోజుల్లో?''

''దానికి ఎవరితో రాసిపెట్టి వుందో!''

''అలాఅని ప్రయత్నం మానేస్తావా?''

"..............''

''నీకు నేను డబ్బిచ్చిన సంగతి ఎవరికీ తెలియదులే మావయ్యా. నాదగ్గర తీసుకోవటానికి నీకు నామోషీగా ఉందేమో''

అరగంట సేపు లెక్చరిచ్చాను. శత విధాల చెప్పి చివరికి ఎలా అయితేనేం ఒప్పించాను ఆయన్ని.

''ఇవాళే వెళ్ళి అంతా సెటిల్ చేసు

కుని రా."

"కానీ రాజూ ........."

"ఇంకేం మాట్లాడకు. రేపే ఏలూరెళ్ళి డబ్బు తీసుకొద్దాం."

యింకా ఆయనలో సంశయం పోలేదు.

"డబ్బు దీసుకురావటానికి పొరుగూరిలో స్నేహితుడి దగ్గరకి వెళ్తున్నానని చెప్పు ఇంట్లో."

"అలాగే."

"నే వెళ్తానిక" అంటూ లేచాను.

తలుపు దాకా వెళ్ళాక మావయ్య పిలిచాడు.

ఆగి వెనక్కి తిరిగాను.

కుర్చీలోంచి లేచి నా దగ్గర కొచ్చాడాయన. ఏదో చెప్పాలని ఆయన పెదిమలు కదిలాయి. కానీ మాట బయటకి రాలేదు. నా నుదుటి మీద ముద్దు పెట్టుకున్నాడు. కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి తనకి.

చంటి పిల్లాడిలా నన్ను అతుక్కుపోయాడు. చిత్రమనిపించింది ఆయన బేలతనానికి. నాకేదో పెద్దరికం ఆవహించి ఆయనకి ధైర్యం చెప్పాను.

నాకూ కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి ఎందుకో.

వచ్చేశాను అక్కడి నుంచి.

ఆశాదేవి దగ్గరకు వెళ్ళాలనిపించింది. వెంటనే పరశువాకం బయలుదేరాను.

ఎంతటి ఆనందం, ఎదుటి వాళ్ళకి ఏదైనా చేయటంలో?

ఎదుటి మనిషి కోసం కార్చే ఒక్కొక్క కన్నీటి బొట్టూ ఎంతటి తృప్తి నిస్తుంది!

మనసారా అనుభవించాను అ అలవి కాని తృప్తిని.

నాకు ఒక కొత్త జీవితం ప్రసాదించాడు మావయ్య మద్రాసు తీసుకొచ్చి. నేను మళ్ళీ రవ్వంత సంతోషంగా హాయిగా రోజులు గడపటానికి ఆయనే పరోక్షంగా కారకుడు.

అటువంటి మనిషికి నేను సాయంచేసి అండగా నిలబడటం నా బాధ్యత కాదూ? ఏదో విధంగా నారుణం కొంతైనా తీర్చుకోవాలిగా?

నేను చేసింది ఆశాదేవికి చెప్పాలనిపించింది.

వెళ్ళగానే అంతా చెప్పాను.

"చాలా మంచిపని చేశావు రాజూ" అంది తను.

"ఎంత బ్రతిమాలానో తెలుసా?"

"దేనికి?"

"ఒద్దంటాడు నా సహాయం"

"చాలా అరుదే ఈ రోజుల్లో అటువంటి మనుషులు."

"అందుకే నా అంతట నేనే వెళ్ళాను. ఆయన నోరు తెరిచి అడగడని నాకు ఎలాగూ తెలుసు. నన్నంటాడు కాని ఆయనకి నాకంటే ఎక్కువ అభిమానం."

ఓ గంట సేపు ఇద్దరం కబుర్లు చెప్పుకున్నాం.

"రేపే వెళ్తున్నా చింతలపూడి."

"ఎందుకు?"

"డబ్బు తీసుకు రావాలిగా?"

"మళ్ళీ ఎప్పుడొస్తావు రేపెళ్తే?"

"రేపు రాత్రికి బయలుదేరతాం. ఎల్లుండి పని చూసుకుని ఆదివారం పొద్దున్నకల్లా వచ్చేస్తాం."

"ఇంతవరకూ రెండు రోజులపాటు వరసగా నిన్నెప్పుడూ చూడకుండా ఉండలేదు" అంది ఆశాదేవి.

ఆ మాటలు విన్నాక కదలబుద్ధి కాలేదు అక్కడ నుంచి.

రెండు నెలల పరిచయంలో తను నాకు ఎంత దగ్గరయింది!

ఎన్నో ఏళ్ళ బట్టి ఇద్దరం ముడిపడి ఉన్నట్లు అనిపించింది. లేకపోతే రెండు రోజుల దూరానికి ఎందుకు అంతగా బాధపడటం?

దగ్గరకెళ్ళి ఆశాదేవిని హత్తుకుపోవా లనిపించింది!

"రెండు రోజులేగా? " అన్నాను.

"ఊర్నించి రా గా నే కనపడు" అంది తను.

"అలాగే" అంటూ వచ్చేశాను.

డబ్బు సమస్య తీరిపోయిందని మావయ్య చెప్పాడేమో ఇంట్లో అందరూ హుషారుగా ఉన్నారు. నాకూ హుషారు పుట్టింది వాళ్ళందరి హుషారూ చూడగానే.

అత్తయ్య వచ్చి చెప్పింది నాతో డబ్బు దొరికిందని. శాంతి కూడా చెప్పింది. నవ్వొచ్చింది నాకు. ఏం ఎరగనట్లు భోజనం కానిచ్చి మంచం మీద వాలాను.

తృప్తితో మనసు నిండిపోయింది నిండుగా.

మనకున్నది చుట్టూ వున్న మనుషులకి పంచి పెట్టటంలో అంత తృప్తి దొరుకు తుందా?

మరి అందరూ ఎందుకు పంచిపెట్టరు? ఆ తర్కం నా కెందుకని కళ్ళు మూసుకున్నాను తృప్తితో.

*　*　*

తెల్లారి ఆరుగంటలకి బెజవాడ చేరింది రైలు.

అక్కడి నుంచి ఏలూరు మరో గంట పట్టింది. ఏలూరు నుంచి చింతలపూడి ప్రయాణం చాలా విసుగు పుట్టిస్తుంది ప్రతి చిన్న ఊర్లోనూ బస్సు ఆగుతుంది. అందుకని దూరం తక్కువైనా టైం ఎక్కువ పడుతుంది.

చింతలపూడి దగ్గరవుతున్న కొద్దీ ఎందుకో గుండె భారమయింది.

గతం లోని చేదు జ్ఞాపకాలన్నీ మనసు చుట్టూ మూగినందుకేమో!

తాతయ్య రూపం గుండెలో నుంచి బయటకొచ్చింది.

మౌనంగా రోదించింది నా ప్రతీ అణువూ.

లక్ష్మి కూడా గుర్తొచ్చింది మళ్ళీ.

తను గుర్తురాగానే తియ్యటి,భరించలేని బాధలో మునిగిపోయేవాడిని ఇదివరకు.

కాని —

ఆ క్షణంలో ఏ బాధా కలగలేదు. కాలం గడిచినందుకు రాటు తేలిపోయిం దేమో గుండె.

ఆ మాత్రంగా మ న సు సద్దు కున్నందుకూ, లక్ష్మిని మరచిపోయే స్థితికి చేరుకున్నందుకూ నన్ను నేనే అభినందించు కున్నాను.

చింతలపూడి చేరాం.

కాలేజీలో అందరినీ చూసి ఎన్నిరోజుల యిందో. ఒకసారి వెళ్ళిచూసి రావా లనిపించింది. కాని వెళ్ళలేకపోయాను ఎందుకో. పాతిపెట్టిన గతాన్ని తవ్వటం ఎందుకు?

బస్టాండ్ నుంచి తిన్నగా బ్యాంకుకి వెళ్ళాం.

ఫిక్సెడ్ డిపాజిట్ పదేళ్ళకి వేశాడు తాతయ్య. రెండేళ్ళు ముందరే తీసు కుంటున్నాం కాబట్టి' కాస్త నష్టం వస్తుందని అన్నారు బ్యాంకువాళ్ళు. ఫరవాలేదన్నాను.

డబ్బంతా ట్రావెలర్స్ చెక్స్ కింద మార్పించాను మామయ్య చేత సంతకం పెట్టించి. పంథొమ్మిది వేల చిల్లర వచ్చింది మొత్తం. మామయ్య ముఖంలో సంతోషం

చూస్తే చాలా ఆనందం వేసింది.

తిరుగు ప్రయాణంలో బాగా నిద్ర పట్టింది నాకు.

మద్రాసు చేరగానే మావయ్యతో చెప్పి నేను ఆశాదేవి ఇంటికి బయలు దేరాను. ఆయనా ఇంటికెళ్ళిపోయాడు.

"పనయిందా?" అడిగింది ఆశాదేవి వెళ్ళగానే.

"అయింది. నేను స్నానం చెయ్యాలి."

"ఇంటి కెళ్ళలేదేం?"

"ఇద్దరం ఒకసారే వెళ్ళటం దేనికని"

"అదేం?"

"ఎవరికీ చెప్పనని అన్నాలే మావయ్యతో."

"ఏ విషయం?"

"అదే....ఆయనకి డబ్బిస్తున్న విషయం."

"గుప్తదానం అన్నమాట?"

"చెప్పాగా ఆయన తత్వం?"

స్నానానికి నీళ్ళు పెట్టింది ఆశాదేవి. స్నానం చేయగానే మంచంమీద వాలాను. ప్రయాణంలో బాగా అలసిపోయాను.

నా పక్కనే వచ్చి కూచుంది తను.

"అలా వాలిపోయావేం ?"

"నీరసం మేడమ్"

కడుపు నిమిరింది ఆశాదేవి.

"అన్నం తినలేదా నిన్న ?" అడిగింది.

తాతయ్య గుర్తొచ్చాడు.

"ఆకలేయలేదు. పైగా హోటలు తిండి కదా? అసలు తినబుద్ధి కాలేదు. అన్నం పెట్టవూ ?"

చకచకా వంట చేసి వడ్డించింది.

"ముద్దలు చేసి పెట్టు" అన్నాను.

"మళ్ళా అదొకటా ?" అంటూ నవ్వుతూ ముద్దలు కలిపి తినిపించింది.

కడుపు నిండిపోయి చాలని చెప్పినా వినకుండా కొసిరి కొసిరి తినిపించింది.

ఏ జన్మలో బంధం ?

"పెళ్ళెప్పుడు ఇంతకీ?" అడిగింది.

"పదహారో తారీకు"

"ఈ నెల్లోనేనా?"

"అవును. బయలుదేరే ముందతే చెప్పాడు మావయ్య. వాళ్ళదీ ఈ ఊరేగా. అన్నీ మాట్లాడటం అయిపోయింది"

"అతని ఉద్యోగం ఎక్కడ?"

"బెజవాడలో"

"పదిహేను వేలకి డాక్టర్ అల్లుడు రావడం మీ మావయ్య అదృష్టం"

"మా శాంతి బావుంటుంది తెలుసా?"

"అలాగా నువ్వు చేసుకోపోయావా?" అంది నవ్వుతూ.

"నేనా ?"

"అవును"

"శాంతి అలా ఎప్పుడూ అనుకోలేదు. అయినా నాకు పెళ్ళెందుకు ?"

"అదేం ? విరక్తా ?"

"అలాంటిదే"

"ఎందుకు ?"

లక్ష్మి విషయం చెప్పాను.

"నీకూ, తనకీ రాసి లేదేమో" అంది అంతా విని.

"నేనూ అదే అనుకున్నాను"

"అది సరేకానీ ఇరవై నింటీ పరీక్షలు తమరికి"

"అయితే ఏం ?"

"ఈ పెళ్ళి గొడవలో పడి నీ చదువు అంతా గంగలో కలిసిపోయింది రాజా ! ఎంత టైం వేస్టయిందో చూశావా ?"

"అంతా ప్రిపేర్ అయ్యాగా. ఫరవా లేదు"

"నీదంతా ఓవర్ కాన్ఫిడెన్స్"

"నోట్సులన్నీ రెడీగా ఉన్నాయి. ఒక్కసారి రివిజన్ చేసుకుంటే చాలు. అన్నీ గుర్తొస్తాయి మళ్ళీ"

"కాలేజీ ఫస్ట్ పోయినట్టే"

"నీకవాళ పాటల పోటీ అప్పుడు చెప్పాను గుర్తుందా?"

"ఏమని?"

"నేను సెక్రటరీని అవుతానని"

"అయితే?"

"కాలేజీ ఫస్ట్ రాకపోవచ్చు. కానీ యూనివర్సిటీలో ఫస్టొస్తాను''

"నీ కసలు టైముంటేగా? పెళ్ళికి ఇంకా పన్నెండు రోజులుంది. పెళ్ళయ్యే దాకా ఎలాగూ నీకు తీరిక దొరకదు. ఆ తరువాత నాలుగు రోజులేగా మిగిలింది?"

నా గురించి తను పడుతున్న ఆరాటానికి నా మనసు పొంగిపోయింది. తనకి కాస్త సరిచెబుదామనిపించింది.

"నేనేం పేకమేడలు కట్టడం లేదుగా? ఎన్ని రోజులు చదివానో నీకు తెలియదూ? ఎంత కష్టపడ్డాను రెండు నెలల బట్టీ? అంతా గాలికి పోయిందనుకుంటున్నావా? పరీక్ష ముందురోజు ఒక్కసారి నేను రాసుకున్న నోట్సులన్నీ తిరగేస్తే చాలు. అక్షరం పొల్లు పోకుండా అన్నీ రాయగలను. అర్థమయిందా మేడమ్?"

"నీ యిష్టం బాబూ. అయినా అంతా అయ్యాక ఇప్పుడు చేసేది మాత్రం ఏముంది?"

"అలాకాదు చెప్పటం"

"మరెలా?"

"నవ్వుతూ చెప్పాలి"

నవ్వింది ఆశాదేవి పల్చగా

సినిమా కెళ్ళాం ఆవాళ ఇద్దరం. సాయంత్రం అట్నుంచి బీచికెళ్ళి చాలాసేపు కబుర్లు చెప్పుకుంటూ కూచున్నాం.

చీకటి పడ్డాక పారిస్ కార్నర్ దాకా వచ్చి బస్సు రాగానే వెళ్ళిపోయింది ఆశాదేవి. నేనూ యింటికి చేరాను.

మర్నాటి నుంచీ పెళ్ళి హడావిడితో సరిపోయింది.

దగ్గర బంధువులు ఎవరూ ఎక్కువ మంది లేకపోవటంతో పెళ్ళి పనులన్నీ చూసుకోవటం చాలా కష్టమయింది. పిలవవలసిన స్నేహితుల లిస్టు మాత్రం పెద్దదే.

ఓ చిన్న బంగళా తీసుకున్నాం విడిది కోసం.

మావయ్యా, నేనూ, మురళీ ఊపిరి సలపకుండా తిరిగాం పెళ్ళిరోజు వరకూ ఎలా అయితేనేం మొత్తానికి పనులన్నీ. అనుకున్నట్లు. సక్రమంగా జరిగాయి.

పెళ్ళి చాలా బాగా జరిగింది.

దాదాపు పిలిచినవాళ్ళందరూ వచ్చారు. కొంతమంది పొరుగూళ్ళనుంచి కూడా వచ్చారు. ఆశాదేవి కూడా వచ్చింది పెళ్ళయ్యే దాకా ఉండి వెంటనే వెళ్ళిపోయింది.

ట్రాన్సిస్టర్ కొనిచ్చింది శాంతికి.

ప్రెజంటేషన్స్ చాలానే వచ్చాయి. మావయ్యకి ఉన్న పలుకుబడి డబ్బు పుట్టించటానికి ఉపయోగపడేది కాకపోయినా, ఆవిషయంలో అక్కరకొచ్చింది పెళ్ళికి పెట్టిన పదివేలూ. ఆ రూపంలో వెనక్కి వచ్చేసింది.

పెళ్ళయిన రోజునే చాలామంది వెళ్ళిపోయారు. పొరుగూరి నుంచి వచ్చిన వాళ్ళు మాత్రం ఇంకో రోజుకని ఉండి పోయారు.

ఆశాదేవి యింటికెళ్ళటం కుదరలేదు

ఒక్కసారి కూడా అన్ని రోజుల్లోనూ. ఎలాగో అనిపించింది.

పరీక్షలు మొదలవటానికి మూడు రోజులే.

మర్నాడు పొద్దునేవెళ్ళాను ఆశాదేవి దగ్గరికి.

"వచ్చేశా మేడమ్!"

"సుస్వాగతం !"

"థాంక్యు ! ఇక చూడండి మన తడాఖా ఎలా చదువుతానో"

"చూస్తాగా! ఎంతయినా రిజల్ట్స్ వచ్చాక కానీ తమరి ప్రతాపం బయట పడదులెండి."

"ఇక్కడే ఉంటాను ఈ మూడు రోజులూ.కాస్త సాయం చెయ్యాలి నువ్వు. ఉండొచ్చా ?"

"మూడురోజులుకాదు ఈపదిరోజులూ పరీక్షలన్నీ అయిపోయేంత వరకూ ఇక్కడే ఉండాలి"అంది ఆజ్ఞాపిస్తున్నట్టు.

"చిత్తం మేడమ్!" అన్నా వినయంగా.

"రాజూ ఈజ్ ఎ గుడ్ బోయ్" అంది ఆశాదేవి నవ్వుతూ నా చెవి మెలిపెడుతూ.

తన ప్రతి కదలికా ఎంతో బావుంటుం దనిపిస్తుంది నాకు. ఎన్నో సొగసులు విర జిమ్ముతూ ఉంటుంది ఆ రూపం.

"ఇంటికెళ్ళి బట్టలు తెచ్చుకుంటాను" అన్నా.

"తొందరగా వెళ్ళిరా" అంది.

ఇంటికెళ్ళి మూడు జతల బట్టలూ, కావలసిన పుస్తకాలూ అవీ సర్దుకున్నాను.

అత్తయ్యతో చెప్పలేదు. పది రోజుల పాటు ఫ్రెండ్ రూంలోనే చదువుకుంటా నని మావయ్యతో చెప్పాను. ఆయనేం అభ్యంతరం చెప్పలేదు.

నేను వెళ్ళేటప్పటికి వంటచేస్తోంది ఆశాదేవి.

"నీ కోసం పలావు చేస్తున్నా" అంది.

"పలావా ?"

"ఏంచిట్టితండ్రీ ముఖం అలా పెట్టావు? అప్పుడే మొహం మొత్తిందా పలావు మీద ?"

"మరి ! నువుఅడిగినప్పుడల్లా ఇంతింత చేసి పెడుతుంటే అంతేగా?"

"ఈసారి అడిగినా చేసిపెట్టనులే"

"అంత మాటనకు మేడమ్"

"తొందరగా తినేసి చదువు మొదలు పెట్టాలి తమరు."

ఇద్దరం తినటం కాగానే మొదలు పెట్టినవాడిని రాత్రి పన్నెండింటి దాకా చదువుతూ కూచున్నాను.

"పడుకో రాజూ ఇంక" అంది ఆశా దేవి.

"నిద్రరావటం లేదు"

"అంతేలే! ఎవరికైనా అంతే పరీక్షల ముందు. కానీ రాత్రంతా అలా నిద్ర కాచు కుని కూచుంటే మంచాన పడతావు"

"ఏం కాదులే" అన్నా.

బలవంతాన నా చేత నిద్రమాత్ర మింగించి పడుకోమంది ఆశాదేవి చేసేది లేక మంచం మీదికి చేరాను.

మొదటిసారి ఆశాదేవి ఇంట్లో అలా మకాం వేయటం. సాధారణంగా కొత్త చోట్లో నాకు అసలు నిద్ర పట్టదు. మావయ్య యింటికి వచ్చాక కూడా చాల రోజులు కొత్తలో నిద్ర పట్టేది కాదు.

కానీ, ఆశాదేవి ఇల్లు కొత్తగా తోచ లేదు. తాతయ్యతో మా ఊర్లో, మా ఇంట్లో ఉన్నట్లే అనిపించింది.

తరువాత రెండు రోజులూ కూడా ఆశాదేవి ఎంతో కష్టపడింది. రాత్రి పద కొండున్నర దాకా నాతో పాటు తను కూడా మేలుకుని ఉండేది.



నా కెంత వరకూ వచ్చో తెలుసు
కోవటానికి ఎన్నో ప్రశ్నలడిగేది. ఎక్క
డన్నా తప్పులుంటే, నా సమాధానాలు
సరిదిద్దేది.

మర్నాడు పరీక్షన్న రోజున ఎనిమిది
గంటలకే పడుకోబెట్టింది బలవంతంచేసి.

పరీక్షరోజున పొద్దునే తలంటుపోసింది.

చిన్నప్పుడు గోచీకట్టి, నలుగుపెట్టి,
తలంటు పోసేవాడు తాతయ్య. ముందర
ఒంటినిండా నూనె పట్టించి గంటసేపు
కూచోపెట్టేవాడు గోచీగుడ్డతో.

అంత హడావిడి ఆశాదేవి చేయక
పోయినా, ఆ రోజెందుకో గతం అంతా
గుర్తొచ్చింది.

పూజచేసుకున్నా సుప్రభాతం చదువు
కుని.

"విష్ యు సక్సెస్" అంది వెళ్ళే
ముందర.

తన చేతుల్ని ముద్దు పెట్టుకోవాలని
పించింది.

''నీ చేతులేవీ?''

''ఎందుకు?''

''ఇటుతే''

నవ్వుతూ చేతులు రెండు చాపింది
ఆశాదేవి.

కళ్ళకి అద్దుకున్నా ముద్దు పెట్టుకునే
ముందర!

పరీక్ష పేపరు చాలా తేలికనిపించింది
చూడగానే. ఛాయిస్‌లో ఏవి రాయాలో,
ఏవి వదిలిపెట్టాలో తోచలేదు.

వేటికి సమాధానం రాసే వీలయినన్ని
ఎక్కువ మార్కులు వస్తాయో చూసుకుని
పేపరు పూర్తి చేశాను.

అరగంట ముందరే పేపరు అయి
పోయినా, మళ్ళీ అంతా ఒకసారి సరిగ్గా
ఉందోలేదో చూసుకున్నాను. తృప్తితో
వచ్చాను బయటకు.

పరీక్ష రోజులన్నీ చాలా తొందరగా గడిచాయి. పేపర్లన్నీ చాలా బాగా చేశాను. ఆశాదేవి లేకపోతే అంత చక్కగా రాయగలిగే వాడిని కాదేమో.

ఆ ఆరు రోజులు ఇంటికెళ్ళగానే అడిగేది ఆశాదేవి పేపరు ఎలా చేసిందీ. ఓ రెండు గంటలసేపు నేను రాసిందంతా తనకి వివరంగా చెప్పేవాడిని.

అంతా చెప్పొద్దు, టైం వేస్టవుతుందని ఆశాదేవి అన్నా తను తృప్తి పడుతుందని అంత సేపు చెప్పేవాడిని.

ఆఖరి రోజు పేపరు అయిపోయింది బయటకొస్తుంటే నాకు అనుమానం వేసింది.

నిజంగానే యూనివర్సిటీ ఫస్టొస్తానేమో అని!




పరీక్షల హడావిడి అయిపోయింది.

అయినా ఆశాదేవిని వదిలి ఇంటికెళ్ళ బుద్ధికాలేదు. బతికినంత కాలం తనతోనే అలా ఉండిపోగలిగితే ఎంత బావుంటుంది.

ఆకాశంలో మిల మిల మెరిసే తారకలూ, చల్లదనాన్ని పంచే నిండు జాబిలీ, వాటి ఆవలి అనంత సృష్టీ, అంతా నా గుప్పెట్లో దాగి ఉన్నాయనిపిస్తుంది ఆశాదేవి తోడులో.

తను తప్ప వేరే ప్రపంచం లేదనిపిస్తుంది.

ఎక్కడికి దారి తీస్తుందో ఈ స్నేహం?

మహాబలిపురం వెళ్దామంది ఆశాదేవి. సరేనన్నాను వెంటనే. కాదనే శక్తి నాలో ఎక్కడిది?

తనతోడి ప్రతిక్షణం నాక్కావాలి.

మరుక్షణం నాకు మిగులుతుందో లేదో ఎవరికి తెలుసు?

నా జీవితంలో కాలానికి కూడా నిలకడ లేదుగా?

ఎంతో సరదాగా గడిచిపోయింది అయిదు రోజులూ మహాబలిపురంలో. జీవితంలో ఆనందానికి నిర్వచనం ఆ క్షణాలేనా అనిపించింది.

కాలం ఆగకుండా అంత వేగంగా పరుగులు తీస్తున్నందుకు కోపం వచ్చింది నాకు.

ఆ సమయం, ఆశాదేవితోడి ఆ సాంగత్యం అలాగే నిలిచిపోకూడదూ?

శాంతితో కలిసి ఇదివరకు మహాబలిపురం వచ్చినా, అంతగా పరిశీలనగా తెలుసుకోలేదు అక్కడి శిల్పాల గురించి. ఎవరున్నారు చెప్పేందుకు? నాకున్నంత ఆసక్తి కూడా లేదు శాంతికి.

కళ్ళప్పగించి చూశానంతే.

ఒక్కొక్క శిల్పం గురించీ, దాని చరిత్ర గురించీ, ఆశాదేవి కథలు చెబుతుంటే, తనకున్న పరిజ్ఞానానికి ఆశ్చర్యపోయాను. నాలో ఉన్న కొద్దిపాటి జిజ్ఞాస మరింతగా పెరిగింది తన మాటలు విన్నాక.

ఊహా జగత్తులో మునిగిపోయాను.

ఇంకెన్నో ఉన్నాయి అటువంటి ప్రదేశాలు ఈ విశాల సృష్టిలో. ఎన్నని చూడగలను నా జీవిత కాలంలో?

సృష్టి అనంతం.

ఆ అనంత సృష్టితో పోలిస్తే మనిషి జీవితకాలం ఎంత చిన్నది!

ఎన్ని పుస్తకాలు తిరగేసినా, ఎన్ని ప్రదేశాలు తిరిగినా ఎంత మంది మనుషులని చదవగలిగినా, మనిషి అజ్ఞానిగానే మిగిలిపోతాడేమో చివరికి.

మద్రాసుకి తిరిగి రావాలని అనిపించలేదు. కాని ఆరో రోజున వెనక్కి బయలుదేరాం.

ఇంటికెళ్ళి అప్పటికి పదిహేను రోజులయింది.

అత్తయ్య అడగనే అడిగింది నేను యింట్లో కాలు పెట్టగానే.

"ఏరా నాయనా? మేం గుర్తున్నామా?"

"బలేదానివే. అదేం మాట?"

"ఇన్ని రోజుల నుంచి నీ ఫ్రెండ్ రూంలోనే ఉన్నావా?"

"ఆ"

"ఎవ్వడా నాయనా అంత పుణ్యాత్ముడు? రోజుల తరబడీ నిన్ను అట్టే పెట్టుకున్నాడు?"

"'వాడు' కాదు మమ్మీ. ఆవిడ!" అన్నాడు మురళి.

"ఏమిటీ?" అంది అత్తయ్య కళ్ళు పెద్దవి చేసుకుని.

"వాళ్ళ కాలేజీలోనే పనిచేస్తోంది ఆవిడ"

"ఏరా నిజమేనా వీడు చెప్పేది?" అడిగింది అత్తయ్య నన్ను.

"అవునత్తయ్యా."

"మరి ఫ్రెండ్ రూమంటావే?"

"అవును. ఆ అమ్మాయి నా ఫ్రెండే."

"ఇన్ని రోజులనుంచీ అక్కడికే అన్నమాట వెళ్తూంది?"

"అవును."

"ఎన్నేళ్ళు ఆ అమ్మాయికి?"

నాకు చిరాకేసింది అత్తయ్య ధోరణి.

"దేనికి?" అడిగాను.

"శాంతక్క పెళ్ళి కొచ్చిందికదే ఆవిడ. పక్కింటి ఆంటీ అంత ఉంటుంది" అన్నాడు మురళి మళ్ళీ.

మురళిగాడి మీద కోపం ముంచుకొచ్చింది నాకు.

"నీకెందుకురా రాజా అటువంటి వాళ్ళతో సోపతు" అంది అత్తయ్య.

"ఊరికే గొడవ చేయకత్తయ్యా! ఆ అమ్మాయి నా స్నేహితురాలు అంతే!" అన్నాను.

"ఎందుకు చెబుతున్నానో విను నాయనా! దూరంగా ఉండు అటువంటి వాళ్ళతో."

మాట్లాడకుండా నా గదిలోకి వెళ్ళిపోయాను.

ఆవిడ ఎందుకు చెబుతోందో నాకేం తెలుసు?

ఆశాదేవి గురించి ఈవిడగారికేం తెలుసు?

ఒళ్ళు మండింది ఆవిడ మాటలకి. ప్యాంటులో కాలి వేళ్ళు చిక్కుకుపోతే విసురుగా లాగాను. గావుకేక పెట్టినట్టు సర్రున చిరిగి పోయింది.

నా కోపం దాని మీద చూపిస్తే ఎలా?

అసలే చాలా పాతదైపోయింది. బలంగా లాగగానే చిరిగిపోయింది. మిగతా బట్టలన్నీ కూడా చూశాను ఎందుకో ఒకసారి.

అన్నీ అవతారం చాలించేందుకు సిద్ధంగా ఉన్నాయి.

మరో నెల రోజులు కూడా రావటం

కష్టమనిపించింది.

గడవటానికి కనీసం రెండు జతలైనా కుట్టించుకోవాలి. మావయ్యని ఓ వంద రూపాయలు ఎక్కువ అడిగి తీసుకుని ఇన్‌స్టాల్‌మెంట్ మీదనైనా రెండు జతలు తీసుకుందామనుకున్నాను.

తాతయ్య ఉండగా ఎన్ని బట్టలుండేవి! ప్రతి సంవత్సరం తప్పనిసరిగా అరడజను జతలైనా కుట్టించేవాడు. అవి కాక పండగలొచ్చినప్పుడల్లా, ఒక్కో జత కొనేవాడు. అవి మరో అయిదారు జతలయ్యేవి.

ఇప్పుడో?

బట్టకి కూడా దరిద్రం వచ్చింది.

స్నానం, భోజనం కానిచ్చి పడుకున్నాను. మూడు గంటలకు మెలకువొచ్చింది. లేవగానే గుర్తొచ్చింది ఆశాదేవి నాలుగున్నరకల్లా ఇంటికి రమ్మన్న సంగతి. చకచకా తయారయి బయలుదేరాను తన దగ్గరికి. బస్సు చాలా ఆలస్యంగా దొరికింది అవాళ ఎందుచేతనో.

''ఇంత సేపయిందేం?'' అడిగింది ఆశాదేవి నేను వెళ్ళగానే.

"బస్సు దొరకలేదు. ఇంతకీ ఎందుకు రమ్మన్నట్టు?''

"చెప్తా."

"సస్పెన్సులో పెట్టేశావు.''

"ఏం లేదులే. సినిమా కెళ్దామని" అంది.

"దానికి ఇంత దాపరికం దేనికి?''

"పద వెళ్దాం''

"అప్పుడే ఎందుకు? ఇంకా టైముందిగా?''

''దార్లో పనుందిలే.''

''ఆ సూట్‌కేస్ ఎక్కడికి?'' తన చేతిలో ఉన్న సూట్‌కేస్ చూసి అడిగాను.

''పద చెప్తాను.''

తిన్నగా టైలర్ దగ్గరికి తీసికెళ్ళింది.

''ఇతను కొలతలు తీసుకోండి" అంది టైలరుతో.

"దేనికి?'' అన్నా అర్థంకాక.

''రాజూ! కాసేపు మాట్లాడకుండా ఉండు."

మాట్లాడలేదు నేను.

టైలర్ కొలతలు తీసుకున్నాడు.

''బట్టలేవండీ?" అడిగాడు టైలర్.

సూట్‌కేస్ తెరిచింది ఆశాదేవి టైలర్ ముందు పెట్టి. ఒత్తు పేర్చినట్టున్నాయి ఒకపక్క లాగూ గుడ్డలూ మరోపక్క చొక్కా గుడ్డలూ.

ఎన్ని జతలుంటాయో కూడా లెక్క పెట్టలేకపోయాను.

"ఇవన్నీ ఎవరికి?'' అడిగాను.

"నాకే" అంది ఆశాదేవి.

"నాలుగొందల యాభై అయిందండీ" అన్నాడు టైలర్ బిల్లు ఆశాదేవి చేతిలో పెడుతూ.

రెండొందలు అడ్వాన్సు ఇచ్చింది తను.

"నాలుగు రోజుల్లో కావాలి అన్నీ" అంది.

"నాలుగు రోజుల్లో కష్టం అండీ.''

"మరా మాట ముందు చెప్పొద్దూ? ఇంకో చోటన్నా ఇచ్చుకునే వాళ్ళంకదా?'' అంది ఆశాదేవి కోపంగా.

''చూస్తాం లెండి'' అంటూ నసిగాడు టైలరు.

''అలాకాదు పక్కాగా చెప్పాలి" అంది తను.

''సరే అలాగే లెండి.''

ఏం మాట్లాడకుండా బొమ్మలా నిలబడిపోయాను నేను. జబ్బ పుచ్చుకొని షాపు బయటకు తీసుకొచ్చింది ఆశాదేవి.

చాలా సేపు మాట్లాడలేదు నేను.

"కోపం వచ్చిందా రాజూ?"

"దేనికి కోపం?"

"నీతో చెప్పకుండా కొన్నందుకు"

మాట్లాడలేదు నేను. అలాగే మౌనంగా తల వంచుకుని నడిచాను మరి కాసేపు.

"రాజూ!"

"ఏమిటి?"

"ఇటుచూడు నా వేపు"

తన వేపు చూశాను.

"నాకా మాత్రం అధికారం లేదా నీ మీద?" అడిగింది.

తన కళ్ళలో నీళ్ళు కనిపించాయి లీలగా.

ఆ కంట తడిని చూడలేకపోయాను. తల వంచుకున్నాను,

"నువు ఎంత ఇబ్బంది పడుతున్నావో అని చేశాను."

"నీకేం చెయ్యటానికైనా అధికారం ఉంది" అందామని అనుకున్నాను. కానీ నోట మాట రాలేదు ఎందు చేతనో.

"ఇంకా కోపం పోలేదా?" అంది ఆశాదేవి కాసేపయాక.

నాకు కోపం అసలు వస్తేగా, పోవటానికి? ఏదో అనిర్వచనీయమైన ఆనందంతో నిండిపోయింది. నా కోసం, నా సుఖం కోసం తాపత్రయపడే మనిషి దొరికింది.

జీవితంలో నాకూ ఓ వెలకట్టలేని పెన్నిధి దొరికింది!

"మేడమ్!"

"ఏమిటి?"

"అయిస్‌క్రీం కొని పెట్టవూ?" అన్నాను.

గలగలా నవ్వింది ఆశాదేవి.

తన బుగ్గల మీదనుంచి రాలిన నీటి చుక్కలు తళతళా మెరిశాయి సాయంత్రపు నీరెండలో కూడా.

మాటల్లోనే చింతామణి సెంటరుదాకా వచ్చాం.

"రా! అయిస్‌క్రీం కావాలన్నావుగా!" అంటూ హోటల్లోకి దారి తీసింది ఆశాదేవి.

"మా మంచిది ఆశాదేవి" అన్నాను.

మళ్ళీ నవ్వింది తను.

చల్లటి ఆ నవ్వు చూస్తూ, ఏ పునాదులూ లేకుండానే ఎన్ని తాజ్‌మహల్లైనా కట్టగలననిపించింది.

సుతారంగా అయిస్‌క్రీం తింటున్న తనని చూస్తూ కూచున్నాను. రెప్ప వాల్చకుండా చూస్తూ ఉండిపోయాను.

"అదేమిటి గుడ్లప్పగించి అలా చూస్తావు? తినూ" అంది.

చెంచాతో అయిస్‌క్రీం పట్టుకున్న తన చేతిని దగ్గరికి తీసుకుని, తను తింటున్నది నేను తినేశాను.

"ఏమిటిది?" అంది ఆశాదేవి చిరుకోపం నటిస్తూ.

"అయిస్‌క్రీం"

"ఎంగిలి"

"అయితే"

"ఎవరయినా చూస్తారు"

"చూస్తే ఏం?"

మాట్లాడలేదు తను. కొంటెగా కింది పెదవి నొక్కి పెట్టి నిశ్శబ్దంలోకి జారిపోయింది. తలొంచుకుని తింటున్న తననే చూస్తూ కూచున్నాను మళ్ళీ.

"ఏం సార్! తమరివాళ తినరా?"

"నువ్వు తినిపిస్తే తింటాను"

"గారాలు పోతున్నావే!"

"తినిపిస్తావా లేదా?"

"బావుండదు"

"ఇంట్లో తినిపించలా ముద్దలు చేసి"

"ఇది హోటలు"

"ఫరవాలేదు. ఫేమిలీ రూం. ఎవరూ రారులే"

"మొండి మనిషివి"

"నీ కన్నానా మేడమ్"

పాపం చేసేదిలేక తినిపించింది ఆశాదేవి.

సినిమాకెళ్ళాం ఇద్దరం అక్కడి నుంచి.

పిచ్చహుషారుగా ఉంది నాకు. హాల్లో తన చేతిని నా చేతిలోకి తీసుకుని గట్టిగా ముద్దు పెట్టుకొన్నాను.

"ఫారిన్ నుంచి దిగినట్టున్నారు దొరవారు?"

"యస్ మేడమ్!"

"సినిమా చూడండి ముందర"

నవ్వుకున్నాను నాలో నేను.

పారిస్‌కార్నర్ దగ్గర అంది ఆశాదేవి—

"రేపు పొద్దునే రా రాజూ"

"రేపేం కొనిపెడతావు?"

"బాటా చెప్పులు. రాళ్ళలా ఉంటాయి" అంది చిలిపిగా.

నవ్వేశాం ఇద్దరం.

"రేపు పనుంది రాజూ! తప్పకుండా రావాలి నువ్వు పొద్దునే" మళ్ళీ అంది ఆశాదేవి బస్సు రాగానే.

"అలాగేలే" అన్నాను.

వెళ్ళిపోయింది తను.

రంగు రంగుల భవిష్యత్తు, అందాల ప్రపంచం నా కళ్ళముందు తిరిగాయి ఎగ్జిబిషన్‌లో తిరిగే పెద్ద చక్రంలా.

ఆ రోజే అనిపించింది మొదటిసారిగా.

ఆశాదేవి నా తోడు కావాలి!

జీవితాంతం నిలిచిపోవాలి తోడుగానే!

అందుకోలేని స్వర్గాలు సొంతం అవుతాయి ఆ మనిషి ఎవరికి తోడైనా!

ఆ స్వర్గం నాది కావాలి.

ఇంటికి చేరి, మంచం మీద వాలి, కళ్ళు మూతలు పడేలోపల ఎన్నిసార్లనుకున్నానో ఆ మాట!

* * *

"నేనో ప్లాను వేశాను" అంది ఆశాదేవి మర్నాడు నేను వెళ్ళగానే. చాలా హుషారుగా కనపడింది.

"దేనికి? దోపిడీ చేయటానికా?"

"చెప్పేది కాస్త విను"

"చిత్తం"

"ఈ సెలవుల్లో శ్రీనగర్ వెళ్దాం"

"శ్రీనగరా! ఎందుకు?"

"సరదాగా గడపొచ్చు అక్కడ ఈ నెలా పదిహేను రోజులూ"

"నేనెప్పుడూ అడగలేదు కానీ, నాకోటి చెప్పు" అన్నాను.

"ఏమిటి?"

"నీకెంత ఆస్థి వుంది?"

"అబ్బో చాలా ఉందిలే. నా సెక్రటరీని అడిగితేనే కాని తెలియదు" అంది నవ్వుతూ.

"మొన్న ఖర్చు పెట్టింది చాల్లే— మూడు వేలన్నా అయివుంటుంది"

"నేనేం ఊరికే అనవసరంగా ఖర్చు పెట్టటం లేదుగా?"

"లక్షలు సంపాదించి నీ చేతుల్లో పోయగలననుకున్నావా?"

"లక్షలొద్దు. కానీ నే చెప్పినట్టు వింటే వేలు సంపాదించొచ్చు రాజూ!"

"అలాగే మేడమ్! సెలవివ్వండి."

"నే చెప్పినట్లు మనం శ్రీనగర్ వెళ్దాం. అక్కడ సరదాగా రోజులు గడుపుతూనే మరో పని కూడా చేసుకోవచ్చు."

"ఏమిటది?"

"వచ్చే సంవత్సరం నీకెన్ని పేపర్లున్నాయి చెప్పు?"

"ఆరు"

"ఈ సెలవుల్లో వాటన్నిటికీ చక్కటి నోట్స్ తయారు చేద్దాం"

"చేసి...?"

"ఇక్కడికొచ్చాక సైక్లోస్టయిల్ చేయించి అమ్మొచ్చు"

"చాలా మంచి అయిడియా. నీ బుర్ర అమోఘం. కానీ..."

"ఏమిటా కానీ?"

"వాటిని కొనేదెవరని?"

"నవ్వులాటకి కాదు రాజా. చుట్టు పక్కల ఇంకా నాలుగు కాలేజీలు ఉన్నాయి. తేలిగ్గా అమ్ముడుపోతాయి. మన కాలేజీలో ఎదురుగుండా రెండు షాపులున్నాయి చూడు...వాళ్ళిద్దరిలో ఎవరితో ఒకరితో మాట్లాడు. లాభాలు చెరి సగం అని చెప్పు - వాళ్ళే అమ్మి పెడతారు."

"దీనికంతా డబ్బు?"

"నేనిస్తాగా."

"ఎంత నిలపేశావు?"

"నే చెప్పేది నీ బుర్రకెక్కుతోందా అసలు?"

"................"

"ఇంకోటి. ముందే అలా అడ్వాన్స్‌గా ప్రిపేరవుతే వచ్చే ఏడంతా నీకెంత తేలిగ్గా ఉంటుందో తెలుసా?"

"ఎందుకు అనవసరంగా. ఆ చేసేది ఇక్కడే చెయ్యొచ్చు. సెలవులు ఇక్కడే గడిచిపోతాయి. శ్రీనగర్ వెళ్లటం దేనికి?"

"నా మాట వినవూ?"

బలవంతాన ఒప్పించింది నన్ను.

ప్రయాణానికి అన్ని ఏర్పాట్లూ తనే చూసుకుంది.

అక్కడ మేం నోట్సులు రాయటానికి అవసరమయిన రిఫరెన్సు పుస్తకాలన్నీ కొంది మూడొందలు పెట్టి. నా బట్టలన్నీ టైలరు దగ్గర్నించి తెప్పించి ఓ సూట్‌కేస్‌లో సర్ది రెడీగా పెట్టింది ప్రయాణం రోజుకి.

వెళ్ళేరోజున కూడా అత్తయ్యతో చెప్పలేదు. ఎందుకో ఆవిడ తత్వానికి,నా తత్వానికి సరిపడదనిపిస్తుంది. చిన్న చిన్న సామానులన్నీ ఓ సంచీలో పెట్టుకుని బయలుదేరాను.

మావయ్య ఆఫీసుకెళ్ళాను ఆయనకి చెప్పటానికి.

"ఒక్కడివే వెళ్తున్నావా?" అడిగాడు మావయ్య.

"లేదు. ఆశాదేవనీ...నా ఫ్రెండ్ కూడా వస్తోంది."

"ఫ్రెండా?"

మావయ్య 'టోన్' అర్థమయింది నాకు.

"అవును మావయ్యా! ఫ్రెండ్! ఎ గుడ్ ఫ్రెండ్. దట్సాల్!" అన్నాను తన కళ్ళలోకి సూటిగా చూస్తూ.

"వెళ్ళిరా" అన్నాడు తనూ నవ్వుతూ.

ఆశాదేవి దగ్గరకి బయలుదేరాను.

నేను ఇంటికెళ్ళేటప్పటికి సామాన్లు సర్దుతోంది తను. ఆ సామానంతా చూసేటప్పటికి ఆశ్చర్యం వేసింది. చాలా వుంది.

"ఈ సామానంతా ఎందుకు?"

"శ్రీనగర్ తీసుకుపోవటానికి."

"ఇంతెందుకు?"

"మనం రెండు రోజులకని కాదుగా వెళ్ళేది? నెలపైన ఉండాలి. అక్కడ. తెలుసా?"



"నీ యిష్టం. బయలుదేరాక నీకే తెలుస్తుంది"

"పద పద. రైలు టైమవుతోంది."

కరెక్ట్ టైంకే బయలుదేరింది రైలు.

రైల్లో టైమంతా పేకాడుకుంటూ, రాయబోయే నోట్స్ గురించి డిస్కస్ చేసుకుంటూ గడిపాం.

ఢిల్లీ చేరటానికి రెండు పూర్తి రోజులు పట్టింది. అక్కడ నుంచి మరో ఆరొందల మైళ్ళు పోవాలి శ్రీనగర్‌కి.

బస్సులో ఢిల్లీ నుంచి జమ్మూ బయలు దేరాం. నాలుగొందల మైళ్ళూ బస్సు ప్రయాణం కావటం మూలాన చాలా యాతన పడ్డాం

జమ్మూ నుంచి శ్రీనగర్‌కి మరో రెండొందల మైళ్ళు. ప్రయాణ బడలికతో బాగా అలిసిపోయిఉంటంచేత పొద్దున బస్‌లో వెళ్టానికి ఓపిక లేకపోయింది. హోటల్లో దిగి రెస్ట్ తీసుకున్నాం.

రాత్రి పది గంటలకి భోజనాలు చేసి బస్సెక్కితే శ్రీనగర్ చేరేటప్పటికి తెల్లారింది.

అంత ప్రయాణం జీవితంలో ఎప్పుడూ చేయలేదు నేను. ఏలూరు నుంచి మద్రాసు కున్న కాస్త దూరానికే విసుగుపుట్టేది నాకు.

ఎప్పుడెప్పుడు శ్రీనగర్ చేరుకుంటామా అన్నంత విసుగు పుట్టినా, ఆ భూమ్మీద అడుగుపెట్టగానే చిరాకంతా ఎగిరిపోయింది. హోటలుకెళ్ళి స్నానం, భోజనం కానిచ్చాం.

''చాలా బావుంది'' అన్నాను.

''శ్రీనగరా? హోటలా?'' అంది తను.

''హోటలు సంగతి నే చెప్పేది''

''రోజుకి ఎనభై రూపాయలు దీనికి''

''ఇక్కడ ఎలా ఉంటాం?'' అడిగాను.

''కాదులే ఇక్కడ బోట్‌హవుస్‌లని ఉంటాయి. అటువంటిది ఒకటి అద్దెకు తీసుకుందాం''

"అద్దెంతుంటుంది?"

"నెలకి అయిదారొందలుంటుంది. వేసవి కాలం మామూలుగా కాస ఎక్కువుంటుంది. మనం ఉండేది నెలేగా"

"నేనెప్పుడూ చూడలేదులే అది"

"చాలా బావుంటుంది తెలుసా? చెక్కలతో కడతారు ఇంటిని మొత్తం. సిటీ మధ్యలో ఉంటుంది"

"నువ్విదివరకు ఎప్పుడన్నా ఇక్కడికొచ్చావా?" అడిగాను.

"చాలాసార్లు వచ్చాను. నాకు ఈ వాతావరణం చాలా యిష్టం. కాసేపు రెస్టు తీసుకుని సాయంత్రం వెళ్ళి మాట్లాడదాం"

ఇద్దరం సాయంత్రం దాకా రెస్టు తీసుకుని, హోటలు బయటపడ్డాం.

బోట్ హవుస్‌లు అద్దెకిచ్చే ఆఫీసు కెళ్ళాం.

మూడు మాత్రం ఖాళీగా ఉన్నాయి. వాటిల్లో బావున్నదీ, ఒడ్డుకి కాస్త దగ్గరగా ఉన్నదీ చూసి అడ్వాన్సు ఇచ్చింది ఆశాదేవి.

ఆ రోజే మారిపోయాం అక్కడికి.

వింత లోకంలోకి అడుగుపెట్టినట్లనిపించింది.

జీవితమంతా అక్కడ గడిపినా తనివి తీరదేమో.

దాచుకున్న తన అందాలన్నీ ప్రకృతి అక్కడ నగ్నంగా బయటపెడుతున్నట్లు అనిపించింది.

ఆ ప్రకృతి సాన్నిధ్యంలో ఆ అందాలన్నీ చూస్తూ ఏ మనిషైనా తనని తాను మరిచిపోవచ్చు.

రెండో రోజు పొద్దునే లేపింది ఆశాదేవి.

"రాజా! తొందరగా స్నానం కానీ. బయటకి వెళ్ళాలి" అంది.

"ఇంకాసేపు పడుకుంటా"

"ఇంత పొద్దెక్కేదాకా పడుకోకూడదు తెలుసా?"

"ఇంతకీ ఎక్కడికి వెళ్ళాలి?"

"చెప్తా. ముందు నువ్వు తయారుకా"

స్నానం చేసి టిఫినూ, కాఫీ అయిన తర్వాత బట్టలు వేసుకున్నాను. తెప్ప మీద ఇద్దరం ఒడ్డుకి చేరాం. మాట్లాడకుండా నడిచింది ఆశాదేవి. నేనూ వెనకనే నడిచాను.

ఆ పరిసరాలన్నీ బాగా తెలిసినట్టే నడుస్తోంది ఆశాదేవి.

"ఎక్కడికి మనం వెళ్తోంది?" అడిగాను.

"ఒకళ్ళింటికి వెళ్ళాలి"

"ఎవరింటికి?"

వెంటనే జవాబు చెప్పలేదు తను.

"మా మావగారింటికి" అంది కాసేపాగి.

అర్థం కానట్టు చూశాను.

"ఆయన పోయాక కొన్ని రోజుల్లోనే వాళ్ళ అమ్మగారు కూడా పోయారు. ఇప్పుడు మా మావగారు ఒక్కరూ ఉంటున్నారిక్కడ. సొంత ఇల్లుంది ఆయనకి" అంది.

అన్ని రోజుల బట్టీ నాకెప్పుడూ చెప్పలేదు ఆశాదేవి వాళ్ళ మావగారి గురించి. ఎవరూ లేరనే అనుకున్నాను.

"ఆయన ఇక్కడే ఉండగా నువ్వు బయట విడిగా ఉండటం ఏం బాగోలేదు. ఆయన ఏమనుకుంటాడు చెప్పు?"

"ఏం అనుకోరు. నా తత్వం ఆయనకి తెలుసులే. ఎందుకో నాకిష్టంలేదు రాజా ఆ యింట్లో ఉండటం"

మౌనం వహించాను.

"నా పెళ్ళి మద్రాసులో జరిగింది. ఆయనకి అర్జంటుగా ఏదో పని ఉండటం మూలాన మర్నాడే వేరే ఊరు వెళ్ళారు. నేనూ, మా అత్తయ్యా వాళ్ళూ శ్రీనగర్ కొచ్చేశాం. ఇక్కడికి చేరిన మర్నాడే తెలిసింది నాకు ఆయనకి ఆయుర్దాయం తీరిపోయిందని"

"............"

"ఈ ఇంట్లోనే ఆయనకోసం ఎదురు చూశాను"

"............"

"అందుకే ఆ ఇంట్లో ఉండలేను నేను. కానీ ఇక్కడికి ఎప్పుడొచ్చినా మా మావ గార్ని చూడకుండా వెళ్ళను"

మాటల్లోనే చేరుకున్నాం ఆ యింటికి.

'మేజర్ సత్యనారాయణ' బోర్డు కనిపించింది గేటు దగ్గర. చాలా పెద్ద ఇల్లు. ఓ రెండు మూడు కుటుంబాలు ఉండొచ్చేమో అనిపించింది బయటనుంచి చూస్తేనే.

ఇంటి చుట్టూ ఖాళీస్థలంలో చక్కటి పూలమొక్కలూ, తివాచీ పరిచినట్టు పచ్చ గడ్డి కళకళలాడుతూ కనిపించింది.

గేటు తెరిచి లోపలకెళ్తున్న మమ్మల్ని చూడగానే నౌకరు కాబోలు ఇంట్లోకి వెళ్ళాడు పరుగు పరుగున. ఓ ముసలాయనని వెంటబెట్టుకొచ్చాడు.

దాదాపు తాతయ్యా వయసుంటుందేమో ఆయనకి.

ఇద్దరం ముందు బాల్కనీ దగ్గరకి నడుస్తుంటే చకాచకా అంగలువేసి ఆశాదేవిని కౌగలించుకున్నాడు.

మిలటరీలో పనిచేసిన మనిషి.

బాధలు తట్టుకునే ఓరిమీ, పటుత్వం ఉంటాయి సాధారణంగా.

కానీ...

పసిపిల్లాడు తల్లిని కావలించుకున్నట్లూ, ఏళ్ళు పైబడ్డ ముదుసలి ఎదిగిన బిడ్డను హత్తుకుపోయినట్లూ ఉంది ఆయన వాలకం.

నన్ను పరిచయం చేసింది ఆశాదేవి ఆయనకి.

బోట్ హవుస్‌లో వున్నామని తెలియగానే ఆయనకి కోపం వచ్చింది.

"ఇక్కడ ఉండలేనని వెళ్ళిపోయావు. పోనీలే అని సరిపెట్టుకున్నాను. ఎప్పుడో ఒకసారి నాలుగురోజులకని వచ్చినప్పుడు కూడా యింట్లో ఉండకుండా, పరాయి మనిషిలా బయటవుంటే ఎలా చెప్పమ్మా?" అన్నాడు ప్రాధేయపడుతున్నట్లు.

"మీరిలా అన్నారంటే నేను చూడటానికి కూడా రాను" అంది ఆశాదేవి సన్నగా నవ్వుతూ.

మాట్లాడలేదాయన పాపం.

ఓ గంటసేపు కూచున్నాం. అంతే!. ఆయన బలవంతం మీద భోజనాలు అక్కడే చేశాం. ఆ ఒక్కరోజుకీ అక్కడే ఉండిపొమ్మని బ్రతిమాలాడాయన.

ఆశాదేవి వినలేదు.

మళ్ళీ వస్తానని చెప్పి లేచింది. ఎందుకో ఆయన్ని చూస్తుంటే జాలేసింది నాకు.

వచ్చేస్తుంటే అడిగాను ఆశాదేవిని–

"అంతగా ఆయన బ్రతిమాలినప్పుడు ఓ రెండు రోజులు అక్కడ ఉంటే నీ సొమ్మేం పోతుంది?"

"నేనుండలేను రాజా అక్కడ. నీ కర్థం కాదు."

"నీ బాధ నాకర్థం కాలేదనుకున్నావా? అర్థం చేసుకున్నాను. కానీ ఆయన్ని చూస్తే జాలేసింది. ఎవరైనా జాలిపడతారు"

'' జాలి మూలానే వచ్చినప్పుడల్లా చూడటానికి వెళ్తూ ఉంటాను. కానీఅక్కడ ఉండటం మాత్రం నా తరం కాదు.''

మనసుని కృంగదీసే జ్ఞాపకాలు ఏ మనిషి కోరుకోడేమో. మర్చిపోవాలని ప్రయత్నం చేసాడు. అది సహజం.

ఇద్దరం కాసేపు బయట తిరిగి సాయంకాలం నాలుగ్గంటల వేళకి బోట్ హవుస్‌కి చేరుకున్నాం.

నీళ్ళు పడకపోవటం మూలానేమో మర్నాడు జ్వరం వచ్చింది నాకు. కుర్రాడి చేత డాక్టర్ని పిలిపించింది ఆశాదేవి.

ఇంజక్షనిచ్చి వెళ్ళిపోయాడు డాక్టరు. మాత్రలు కూడా ఇచ్చాడు. కానీ చిత్రం అర్ధరాత్రయినా జ్వరం జారకపోగా, ఎక్కువయినట్లు అనిపించింది.

నా పక్కనే కూచుంది ఆశాదేవి నిద్ర పోకుండా.

''నువ్వు పడుకోరాదూ!''

"పడుకుంటాలే. నువ్వు కళ్ళు మూసుకుని రెస్టు తీసుకో సుందర" అంది తను ఆవులిస్తూ.

నామనిషి, నాతోడు తనేననిపించింది.

నా బాగు చూసుకోవటం ఒకటే తన బాధ్యత అయినట్లు అలా సపర్యలు చేసే మనిషి ఎవరుంటారు?

''ఆశా!'' నా గొంతు నాకే కొత్తగా వినిపించింది.

"పడుకో రాజూ!''

"నిద్ర రావటం లేదు.''

''.........''

''ఎందుకు డబ్బంతా ఇలా ఖర్చుపెడుతున్నావు?''

''బావుంది. ఇప్పుడు నీకు డబ్బు గొడవ పట్టుకుందేం?''

'' అయిపోతే మళ్ళా నీకెవరిస్తారు చెప్పు?''

'' పిచ్చి రాజూ! ఇంకా అయిదు వేలుంది నా దగ్గర.''

''అదీ అయిపోతుంది.''

''నాకేం అవసరం ఉంది చెప్పు డబ్బుతో.''

''చెప్పి వస్తుందా అవసరం?''

''ఉద్యోగం లేదూ!''

''ఉద్యోగం పోతే...?''

''ఎందుకు పోతుంది?''

అవును. ఎందుకుపోతుంది? కానీ నా మనసేదో కీడు శంకిస్తోంది. దురదృష్ట జాతకుడిని. నా దురదృష్టం తనకి కూడా అంటుకుని పీడిస్తే?

''ఒకవేళపోతే ఏం చేస్తావు?'' ఎందుకడిగానో నాకే తెలియదు.

''నువ్వు లేవూ?''

నాగుండె పొంగిపోయింది ఆనందంతో. ఆ ఆనందం పట్టలేక ఆగిపోతుందేమో అనిపించింది. తన జీవితంలో నా స్థానం ఎక్కడుందో తెలిసినందుకేమో.

"నేను రిటైరయిపోయాక నీ దగ్గరే ఉంటాను. ఉండనిస్తావా?" అంది ఆశాదేవి నా జుట్టు సవరిస్తూ.

"అంతకంటే నాకేం కావాలి?" అన్నాను.

"కబుర్లు తెలికే. చదువయి ఉద్యోగం రాగానే నీకు పెళ్ళవుతుంది. ఆ వచ్చే పెళ్ళాం నన్నుండనిస్తుందా నీ దగ్గర?"

"ఎవరూ రారు"

"పిచ్చి రాజువి"

తన చేతుల్ని నా నుదుటిమీద పెట్టుకున్నాను.

చల్లదనం వచ్చింది.

"ఆశా!"

"ఏమిటి?"

"నా జ్వరం అంటుకోదు కదూ?''

"ఏం ?"

"నీ ఒళ్ళో పడుకోవాలనుంది"

నా తలని తన ఒళ్ళో చేర్చింది. చల్లటి చేతులతో నా నుదురూ, కళ్ళూ ఆశాదేవి నిమురుతూంటే జ్వరం అంతా మంత్రం వేసినట్లు జారిపోయినట్లని పించింది.

మరో రెండు రోజులకి కాని జ్వరం పూర్తిగా తగ్గలేదు. లంఖణాలు చేసింది నేనయితే పాపం ఆశాదేవి నీరసించి పోయింది ఆ అయిదు రోజుల్లోనూ.

ఓ వారం రోజులవరకూ చూడాల్సిన వన్నీ చూశాం. నిమిషాల్లా గడిచిపోయాయి రోజులు.

ఆశాదేవి సాంగత్యంలో ఎన్ని జీవితాలైనా నిమిషాల్లా గడిపేయచ్చేమో!

సత్యనారాయణగారి దగ్గరికి వెళ్దామని మళ్ళీ అనలేదు ఆశాదేవి ఎందుచేతనో.

వచ్చి పది రోజులయినా పుస్తకాల జోలికి పోలేదు. టైం ఎక్కువ లేదని నోట్సులు రాయటం మొదలు పెట్టాం.

మొదటి రెండు మూడు రోజులూ కాస్త విసుగు పుట్టినా, మెల్ల మెల్లగా దాంట్లో లీనమయిపోయాం.

రోజూ పొద్దునే లేచి సాయంత్రం దాకా నోట్సు తయారు చేయటం తప్ప వేరే పని పెట్టుకోలేదు. ప్రతి సాయంత్రం ఓ గంటసేపు ఎటన్నా షికారుకి వెళ్ళే వాళ్ళం అంతే.

ఒకో పేపరూ అయిదు రోజుల్లో అయిపోయింది ఇద్దరికీ ఉన్న పట్టుదల వల్ల. నెలరోజులూ చకచకా గడిచి పోయాయి.

మేం బయలుదేరటానికి ఇంకో రెండు రోజులుండనగానే నోట్సులన్నీ పూర్తయి పోయాయి. అనుకున్న దానికంటే బాగానే రాశామనిపించింది. తన పేరు మీదే సైక్లోస్టయిల్ చేయించాలని పట్టు బట్టాను. ఒప్పుకుంది ఆశాదేవి.

తిరుగు ప్రయాణంలో అన్నాను ఆశాదేవితో-

"నా జీవితాంతం తియ్యగా ఉండే జ్ఞాపకాలివి"

"అల్పసంతోషివి" అంది తను.

"కాదు"

"ఇంకా ఇటువంటి రోజులు నీ జీవితంలో ఎన్నో వస్తాయి రాజా" అంది ఆశాదేవి.

తన నోటి చలవ వల్ల అలా జరిగితే అంతకంటే నాకింకేం కావాలి ?

"రావాలి" అన్నాను.

ఇటువంటి రోజులే రావాలి అనుకున్నాను మనసులో.




మద్రాసు చేరగానే స్టేషన్ నుంచే ఇంటికి వెళ్తానన్నాను ఆశాదేవితో. సాయంత్రం అయిదు గంటలకల్లా వచ్చేయమని చెప్పింది నాతో.

ఇంట్లోకి అడుగు పెట్టడం మావయ్య గదిలోకి వెళ్ళాను. ఆయన గది కాస్త మారిపోయినట్లనిపించింది. అత్తయ్యని

చూద్దామంటే ఎక్కడా కనిపించలేదు పిల్లల జాడా లేదు ఎక్కడా. అత్తయ్యని కేకేశాను.

"రాజూ"

కొత్తగొంతులా వినపడటంతో ఉన్న పళాన వెనక్కి తిరిగాను.

బొట్టులేని అత్తయ్య ముఖం బోసిగా కనపడింది.

చంటిపాపలా కరుచుకుంది నన్ను అత్తయ్య. భోరుమని ఏడవటం మొదలెట్టింది. తన అణువణువూ వణుకుతున్నట్లు అనిపించింది.

"వెళ్ళిపోయార్రా రాజా ఆయన" అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

"పోయేదాకా బాగానే మాట్లాడుతూ ఉన్నార్రా" అంటూ మామయ్య ఆఖరి క్షణాలు ఘడియలుగా చెప్పింది.

దేవుడెందుకలా మనుషుల సౌభాగ్యాలని అర్ధాంతరంగా తుడిచివేస్తాడు? ఒక్క ప్రాణాన్ని తీసుకుపోయి ఎన్ని ప్రాణాలకు క్షోభ కలిగిస్తాడు !

అత్తయ్యని ఊర్కోబెట్టాను.

నాకూ ఏడవాలనిపించింది ఎక్కడన్నా తల దాచుకుని.

ఆశాదేవి ఒడి గుర్తొచ్చింది.

కాసేపు ఇంట్లోనే వుండి ఆపైన ఉండలేక ఆశాదేవి ఇంటికి బయలుదేరాను.

"అదేమిటి అప్పుడే వచ్చేశావు" అడిగింది తను.

"మా మావయ్య..." పూర్తి కాలేదు ఎందుకో.

"మీ మావయ్య...? ఏమయింది ఆయనకి ?"

"పోయారు"

"ఎప్పుడు పోయారు ?"

"వారం రోజులయింది"

"ఇంత హఠాత్తుగా ఎలా జరిగింది?"

"గుండెపోటు"

ఆ రోజు ఆశాదేవి దగ్గరే ఉండిపోవాలనిపించింది. వెనక్కి అత్తయ్య దగ్గరకి వెళ్ళబుద్ధి కాలేదు.

శ్రీనగర్ వెళ్ళేముందర చూశాను మావయ్యను. బాగానే ఉన్నాడు.

వచ్చేసరికి ఏ గుర్తూ మిగలకుండా పోయింది. నెలా పదిహేను రోజుల్లో ఒచ్చిన ఈ ఆకస్మిక మార్పు చాలా చిత్రంగా కనిపించింది. బాధ కూడా చిత్రమైన బాధ !

ఇంట్లో మగతోడు ఎవరూ ఉండరనీ, ఆ పరిస్థితుల్లో అత్తయ్యని ఒక్కతినీ వదిలి రావటం సరయిన పని కాదనీ బలవంతాన ఇంటికి పంపించింది ఆశాదేవి. అక్కడినుంచి కదలటం ఇష్టం లేక పోయినా కదలక తప్పింది కాదు.

రాత్రంతా నిద్ర పట్టలేదు.

"వెళ్ళిరా !" అన్నాడు మావయ్య.

నేను వెళ్ళే ముందర చూసిన ఆయన నవ్వు ముఖం కళ్ళ ముందు మెదిలింది. ఆయన రూపం కళ్ళకి కట్టినట్లు స్పష్టంగా కనపడింది.

రెండు రోజులు ఎక్కడికీ కదల్లేక పోయాను. మూడోరోజు పొద్దున కూడా కాలేజీకి వెళ్ళలేదు.

అన్ని క్షణాలూ, గంటలూ గడిచినా మావయ్య పోయాడని నమ్మకం కలగటం లేదు ఎందుకో. ఆఖరి క్షణాల్లో ఆయన దగ్గర ఉండలేకపోయినందుకా ?జీవం లేని ఆ శరీరాన్ని చూడలేక పోయినందుకా?

ఎన్ని రోజులని కూచోను ఇంట్లో ?

పిచ్చెక్కుతుందేమోనని భయమేసింది. మధ్యాహ్నం కాలేజీకి బయలు

దేరాను. ఏదో ఒక వ్యాపకం ఉంటే కాస్త మనసు మరల్చుకోవచ్చుగా ?

"రాజూ!" నారాయణస్వామి పిలిచాడు నేను క్లాసుకి వెళ్తుంటే. ఆగాను.

"ఏమిటి?"

"ఎలా గడిచాయి హాలీడేస్ ?"

"మా మావయ్యగారు పోయారు"

"ఈజిట్ ? సో సారీ టు నో దట్. ఎలా జరిగింది ?"

"హార్ట్ ఎటాక్"

ఇద్దరం కాంటీన్‌కి వెళ్ళాం. కాఫీ తాగుతూ అన్నాడు నారాయణస్వామి-

"సెకండ్ ఇయర్‌లో నువ్వు కాలేజీ ఫస్ట్ ఒచ్చావు తెలుసా ?"

"తెలియదు. నీకెవరు చెప్పారు"

"ఆఫీసులో నీ మెమో చూశాలే"

వెంటనే మార్కులు చూసుకోవాలనిపించింది. ఆఫీసుకెళ్ళి మార్క్స మెమో తీసుకుని, క్లాసులో అడుగు పెట్టాను.

ఎకనమిక్స్ క్లాసది.

ఆయన తెలుగాయనే. ఎజిటేషన్ రోజుల్లో ఎమ్. ఎ. పాసయిన మహానుభావుడు. ఎంతో ఆవేశంతో చెబుతున్నాడు దేశంలో ఇన్‌ఫ్లేషన్ అనేది ఎలా ఉంటుందో.

బూతులు వినిపించాయి నాకు మటుకు.

నాకు మద్రాసు వచ్చాక అర్థం కాని చిక్కు ప్రశ్న ఒకటే ఒకటి.

మా ఎకనమిక్స్ లెక్చరర్ గారికి ఎకనమిక్స్ లెక్చరర్‌గా ఉద్యోగం ఎలా వచ్చిందా అని !

ఆశాదేవి దగ్గరికి వెళ్ళాలనిపించింది.

ఆయనగారి అనుమతి తీసుకుని లైబ్రరీకి వెళ్ళాను తిన్నగా. తనని చూశాక మనసు కాస్త కుదుట పడింది.

"ఇంటికి కూడా రాలేదే ?" అంది.

"బయటికి ఎక్కడికీ కదలబుద్ధి కాలేదు" అంటూ మార్క్స మెమో తన చేతిలో పెట్టాను.

"గుడ్! మాట నిలబెట్టుకున్నావు" అంది.

నవ్వాను సన్నగా.

"కానీ ఈ సంవత్సరం ఒకటీ బాపున్నంత మాత్రాన చాలదు. ఫైనల్‌లో కూడా రావాలి"

"చూద్దాం"

"చింతలపూడిలో ఫస్ట్ ఇయర్ ఎంత పర్సెంటేజ్ వచ్చింది ?"

"అరవై రెండనుకుంటా"

"ఈ ఏడు కూడా బాగా రావాలి. మూడేళ్ళ మార్కులకీ ఏవరేజ్ చూస్తారు. తెలుసుగా ?"

"తెలుసు మరే..."

"ఏమిటి ?"

"ఇవాళ సెలవు పెట్టగలవా ?"

"దేనికి ?"

"ఎక్కడికయినా పోదామని. మనసేం బావుంటలేదు"

"సరే" అంది తను.

ఇద్దరం ఇంటికెళ్ళాం ముందు.

టిఫిన్ చేసి పెట్టింది.

"ఎక్కడికెళ్దాం ఇంతకీ ?"

"మహాబలిపురం పోదాం"

"ఇప్పుడా?"

"ఏం?"

"ఎప్పటి కొచ్చేటట్టూ?"

"రేపు రాత్రికల్లా వచ్చేద్దాంలే"

కాదనకుండా బయలుదేరింది.

మనసు బావుండనప్పుడు పరిసరాల మార్పు ఎంతో అవసరమనిపించింది మహాబలిపురంలో అడుగు పెట్టగానే. ప్రతి



మనిషి విషయంలోనూ అంతేనేమో.

కాటేజ్ తీసుకున్నాం.

ఎందుకో హుషారు రాలేదు అంతగా.

మావయ్య గుర్తొచ్చాడు.

"ఇందుకా ఇక్కడికి కొద్దామన్నది?" అంది ఆశాదేవి.

"ఏమిటి?"

"వచ్చినప్పటినుంచీ చూస్తున్నాను.



ఉలుకూ పలుకూ లేదు. ఈ భాగ్యానికి ఇక్కడికి రావటం ఎందుకు చెప్పు?"

"సారీ మరచిపోలేక పోతున్నాను"

"టైం పడుతుంది రాజూ! నువ్వే మర్చిపోతావు"

"ఏమో. ఈ కొద్ది నెలల పరిచయం మావయ్యని నాకు ఎంతో దగ్గర చేసింది. అందుకే మర్చిపోలేక పోతున్నాను. చాలా బాధగా ఉంది"

"కొంత మందితో నెలల పరిచయమే అయినా చాలా దగ్గరవుతారు. మరికొంత మంది ఏళ్ళతరబడి ఎదురెదురుగానే ఉన్నా వాళ్ళ మధ్య దూరం పోదు. అంతే అది. నేనొకటడుగుతాను చెప్పు?"

"ఏమిటి?"

"అనకూడదు కానీ, ఇదే మీ అత్తయ్య పోయిందనుకో? నువ్వింతగా బాధపడేవాడివా?"

"లేదేమో"

"అదే నే చెప్పేది. ఇద్దరూ నీ జీవితం లోకి ఒకసారే ప్రవేశించారు. అయినా కానీ నీకు మీ మావయ్య అంటేనే ఎక్కువ యిష్టం. దానికి ఒక కారణం అంటూ ఉండదు. కొన్ని పరిచయాలంతే"

"ఆయనలో మా అమ్మ కనిపించేది"

"మర్చిపో రాజూ. మనసు వేరే వేపు మరల్చుకోవాలి. ప్రతి మనిషీ ఎప్పుడో అప్పుడు పోవాల్సిందే కదా?"

"ఈ బంధాలన్నీ బూటకాలంటావా?"

"ఎందుకంటాను?"

"మరి?"

"ఏ బంధమూ బూటకం కాదు. దానికి విలువ ఉంది. ఎందుకంటే, అది నీవు తృప్తినిస్తుంది. నిన్ను సుఖపెడుతుంది. ఆ బంధంతో అంత ఆనందాన్ని నువ్వు అనుభవించినప్పుడు కొంత దుఃఖాన్ని నువ్వు భరించాల్సి వుంటుంది''

"ఎందుకు?"

"అర్థంలేని ప్రశ్న అది. ఆకలయినప్పుడే అన్నం విలువ తెలుస్తుంది ఏ మనిషికయినా. అలాగే దుఃఖం నీడలా వెను వెంటనే ఉన్నప్పుడే సుఖానికీ విలువ పెరుగుతుంది. జీవితమంతా ఏ బాధా లేకుండా ఆనందంతో గడిచిపోతే మనిషి ఏమనుకుంటాడో తెలుసా?"

"ఏమనుకుంటాడు?"

"అదే తన దౌర్భాగ్యం అనుకుంటాడు"

"లాజిక్ చెబుతున్నావు నువ్వు"

"కాదు రాజూ! మనం అన్వయించుకుని తెలుసుకోవటంలో ఉంది ఏదైనా"

ఆలోచనలో మునిగిపోయాను నేను.

ఒక్కరోజే ఉందామనుకున్నా, చివరికి మూడు రోజులు ఉండిపోయాం మహాబలిపురంలో. గుండెలో బాధ కొంత వరకూ మాసిపోయినట్లనిపించింది. మూడో రోజు రాత్రి కూడా అక్కడే వుండి మర్నాడు పొద్దున్నే బయలుదేరాం.

ఎనిమిదయింది మద్రాసు చేరేటప్పటికి.

నోట్సుల కోసం పేపరు కొందామంది ఆశాదేవి. ఇంటికెళ్ళలేదు నేను. కాలేజీకి వెళ్ళేముందర ఇద్దరం బజారుకెళ్ళి రెండు రీములు పేపర్ కొన్నాం. మేం ప్రిపేర్ చేసిన నోట్సులన్నీ సైక్లోస్టయిల్ చేయటానికి ఇచ్చాం.

కాలేజీకి వెళ్ళి క్లాసులో కూచున్నాను. రెండో క్లాసు జరుగుతూండగా ప్రిన్స్‌పాల్ గారు కబురు పెట్టారు రూంకి రమ్మని.

కూచోమన్నారాయన వెళ్ళగానే.

"ఫర్వాలేదండీ" అన్నాను.

"కూచో రాజూ! నువ్వు కల్చరల్ సెక్రటరీవి. ఓ అరగంట మాట్లాడాలి నీతో. అందుకే కూచోమంటున్నా."

కూచున్నాను.

"ఈ ఏడు మనకి మూడు ఫంక్షన్సుంటాయి రాజూ! ఫండ్స్ ఆరువేలదాకా ఉన్నాయి. పనంతా నువ్వే చూసుకోవాలి."

"ఈసారికి ఇంకెవరికయినా అప్పజెప్పండి."

"దేనికి?"

"................"

"మీ మావయ్యగారు పోవటం గురించి విన్నాను. కానీ రాజూ ఆ కారణంగా అదే తలుచుకుంటూ, నువ్విలా డల్‌గా ఉండకూడదు. ఆ డల్‌నెస్ అలవాటయిందంటే ఓ పట్టాన బయటపడలేవు."

"............"

"మర్చిపోవాలి రాజూ. మర్చిపోవాలంటే ఏదో ఒక పనిలో బిజీగా ఉండాలి. నా మాట విను."

ఒప్పుకున్నాను చివరికి.

ఆయన చెప్పింది కూడా నిజమేనని అనిపించింది.

కల్చరల్ ప్రోగ్రాం అర్గనైజ్ చేస్తూ ఆ హడావిడిలో మునిగిపోతే, కొంతవరకూ తాత్కాలికంగా అయినా నా బాధకి ఉపశమనం కలుగుతుందేమో!

"శాస్త్రిగారు నీకంతా చెబుతారు!" అంటూ ఓ అరగంట పైచిలుకు ఏది చెయ్యాలో ఆయనే చెప్పేశారు. నాకూ కాస్త ఉత్సాహం వచ్చింది.

బయటకొచ్చాక అనిపించింది-అంత

బాధలో ఉన్నా నాకు రవ్వంత ఉత్సాహం మ న సు లో ఉందంటే, 'కళ'కున్న ప్రభావం సామాన్యమయిందికాదని.

మొదటిప్రోగ్రాం కాలేజీ వార్షికోత్సవం నాడు.

ఇంకా రెండు నెలలు టైం ఉంది.

శాస్త్రిగారితో కూచుని అంతా ప్లాను వేశాను.

వెయ్యి రూపాయలు తీసుకుని ఆర్కెష్ట్రాకి కావలసిన మెయిన్ ఇన్‌స్ట్రుమెంట్స్ కొన్నాను. ఆస క్తి ఉన్న స్టూడెంట్స్‌ని సెలెక్ట్‌చేసి, ఒక్కొక్కటీ వాళ్ళకిచ్చి ప్రాక్టీసు చెయ్యమని చెప్పాను.

ప్రతి క్లాసులోనూ ఎవరికి దేనిమీద ఆస క్తి ఉందో తెలుసుకున్నాను. కొందరు నాటకాలు వేస్తామన్నారు. మరికొందరు మిమిక్రీ చేస్తామన్నారు.

ఓ పదిహేను రోజులు నేనూ, శాస్త్రిగారూ స్టూడెంట్స్ అసలు ఎలా చెయ్యగలరో రిహార్సల్స్ వేయించి చూశాం. బాగా చేసిన వారిని సెలెక్ట్‌చేసి ప్రోగ్రాం లిస్ట్ తయారు చేశాం.

కొంతవరకూ మళ్ళీ ఇదివరకులా గడిచాయి రోజులు.

కొ త్తగా పెట్టుకున్న పనివల్ల ఊపిరి సలపలేదు. ఆశాదేవిని రోజూ లంచ్ అవర్‌లో కలవటం కష్టమయిపోయింది. అయినా తనని కలపటం మానలేదు. కాలేజీలో కుదరకపోవటంతో ప్రతీరోజూ ఇంటికెళ్ళేవాడిని.

సైక్లోస్టయిల్ చేయించిన నోట్సులు రెడీ అయిపోయాయి. కాలేజీ దగ్గర షాపు వాడితో మాట్లాడాను. లాభాలు చెరిసగం అనగానే వెంటనే ఒప్పుకున్నాడు. పెట్టుబడి లేని లాభాలు కదా! ఎందుకు ఒప్పుకోడు?

ఎదురు చూసిన ప్రోగ్రాం రోజు రానే వచ్చింది.

ఫంక్షన్ చాలా బాగా జరిగింది.

అందరూ నన్ను పొగిడేవారే.

అందులో ఆ రోజు కార్యక్రమంలో నా పాటలే అందర్నీ ఎక్కువగా ఆకట్టుకోవటం మూలాన నన్నందరూ ఆకాశానికి ఎత్తేశారు.

ఇదివరకు ఎన్నో క ల్చ ర ల్ ప్రోగ్రామ్స్ జరిగాయి నాచేతిమీదుగా. అందరూ నన్ను పొగుడుతుంటే ఎంతో గర్వపడేవాడిని.

ఆ మాత్రానికి అందుకోలేని ఆశలు నేనెప్పుడూ పెం చు కో లే క పో యి నా, నాలోనూ టాలెంటుందని తృ ప్తిపడేవాడిని.

కానీ...

ఆరోజు అంతగా తృ ప్తి కలగలేదు. మెడమీది గుదిబండ నించి విము క్తి దొరికినట్లనిపించింది ప్రోగ్రాం అయిపోగానే.

మిగతా అయిటమ్స్ కూడా చాలా బాగా వచ్చాయి. కార్యక్రమం అయిపోగానే జనం పలచబడ్డారు. ప్రిన్సిపాల్ గారొచ్చారు నా దగ్గరికి. చాలా బాగా చేశావని మెచ్చుకున్నారు.

ఆశాదేవి ఇంకా వెళ్ళలేదు. తన కొలీగ్స్‌తో మాట్లాడుతూ నుంచుంది. ఇంకా చూడాల్సిన పనులు చాలా ఉన్నాయి. కానీ నీరసంగా ఉండటంతో పనంతా భజన బృందానికి అప్పగించి కదిలాను.

'వెళ్దాం' అన్నట్టు చూశాను ఆశాదేవి వేపు. వెంటనే బయలుదేరింది తను.

"చాలా బాగా పాడావు రాజూ!" అంది ఆశాదేవి నవ్వుస్తూ.

"ఏం బాగోలే. ఈ రెండు నెలల నుంచీ నన్ను తినేశారందరూ. ఎందుకు

ఒప్పుకున్నానా అనిపించింది"

"అవునూ అంత కష్టపడబట్టే ఇవాళ ఫలితం దక్కింది. ఛీఫ్ గెస్ట్ కూడా నిన్నెంతగా పొగిడాడో చూశావుగా!"

"నాకు మటుకు నిజంగా విసుగు పుట్టింది. టైమంతా వేస్టవటం తప్ప, దీంట్లో మిగిలేది ఏముంది చెప్పు? ఈ ఒక్కరోజు జాతర కోసం ఎంత యాతన పడ్డానో."

"సరే కాని రేపు కాలేజీకి సెలవు"

"తెలుసు."

"పొద్దున్నే వచ్చేయ్ ఇంటికి."

"అలాగేలే"

వెళ్ళిపోయింది ఆశాదేవి బస్సురాగానే.

చదువు తొందరగా అయిపోతే బావుంటుందనిపించింది. పుస్తకం ముట్టుకో బుద్ధి కావటం లేదు చాలా రోజుల నుంచీ. ఎలర్జీ పెరుగుతోంది ఎందుకో చదువు మీద.

బస్టాండ్‌లో నిలబడ్డ నా ముందు నుంచి స్కూటర్ ఓ జంటతో రివ్వున దూసుకుపోయింది. తరంగాలలా గాలిలో తేలుతూ వినిపించాయి వెనక కూచున్న ఆమె నవ్వులు.

నేను కన్న కలలూ, కడుతున్న ఊహా సౌధాలూ కనిపించాయి లీలగా, వాళ్ళని చూడగానే.

సుఖ దుఃఖాలు, పక్క మనిషితో పోల్చుకుంటే ఇంతింతలుగా కనబడతా మేమో మనిషికి.

ఏదన్నా మంచి ఉద్యోగం చూసుకో వాలి.

నేనూ ఓ చిన్న ప్రపంచం కట్టుకో వాలి

మరోసారి ఒంటరితనం పలకరించింది నన్ను ఆ రాత్రి పడుకోబోయే ముందర.

ఎందుకో?

* * *

ఆశాదేవి ఇంటికి వెళ్ళాను మర్నాడు పొద్దునే.

ఇల్లు తాళం వేసివుంది.

నన్ను రమ్మని చెప్పిన మనిషి ఎక్కడికెళ్ళిందో అంతుపట్టలేదు. అంత వరకూ ఎప్పుడూ అలా చేయలేదు ఆశా దేవి. మెట్లమీదే కూచున్నాను వస్తుం దేమోనని చూస్తూ.

గంటయింది. తను మాత్రం అయిపూ జాడా లేదు.

ఏదయినా చిన్న పనిమీద కాసేపట్లో తిరిగొచ్చేద్దాం అని వెళ్ళిందా? మరి ఇంత సేపైనా తిరిగిరాదేం?

ఎంతసేపైనా ఎదురు చూస్తూ కూచోటం తప్ప చేసేదేముంది? ఎక్కడికి వెళ్ళిందో తెలిస్తేగా?

కాలేజీ ఇల్లూ తప్ప తెలియదు ఆశా దేవికి నేను చూసినంతవరకూ. ఏ సినిమా కన్నా అయితే నేను లేకుండా వెళ్ళనే వెళ్ళదు.

మరో గంట గడిచిపోయింది నిరీక్షణలో.

విసుగు పుట్టి లేచాను. ఏం చెయ్యాలో అర్థం కాలేదు. ఎక్కడికెళ్ళాలో అంత కంటే తోచలేదు. మేడ దిగి రోడ్డు మీద కొచ్చి ఎటూ అడుగు వేయలేక పోయాను కాసేపు.

బీచికి బయలుదేరాను.

మౌంట్ రోడ్డుమీద నడుస్తుంటే కన పడింది ఆశాదేవి.

ఎదురుగా వంద గజాల దూరంలో ఏదో హోటల్లోంచి బయటకొస్తోంది. వెంట ఎవరో ఒకతను వున్నాడు.

తనని పిలవబోయాను.

నన్ను చూసిందో, చూసీ చూడనట్టు చేసిందో తెలియదుకాని ఇద్దరూ హోటల్ నుంచి బయటకు రాగానే చకచకా టాక్సీ ఎక్కి వెళ్ళిపోయారు.

అతనెవరో నాకు తెలియదు.

అంతకు ముందెప్పుడూ చూడలేదు కూడా.

కానీ...

కోపం వచ్చింది అతని మీద 'ఆ రోజుని' నాకు కాకుండా దోచుకున్నందుకు. ఆశాదేవి అతనితో ఎందుకు కనిపించిందో అర్థం కాలేదు. ఏం ఊహించటానికీ నా మనసు ఒప్పుకోలేదు. అంతా చాలా అయోమయంగా కనిపించింది.

మతి చలించింది.

సాయంత్రం దాకా ఎలా గడిపానో నాకే తెలియదు. పిచ్చి పిచ్చిగా రోడ్లమ్మట తిరిగాను. ఇల్లొదిలేసి బయటకొచ్చేసిన వాడిలా తిరిగాను.

చీకటి పడింది.

మళ్ళీ ఆశాదేవి దగ్గరకు వెళ్దామనిపించింది.

వెళ్ళలేదు.

బీచ్‌లో ఒక్కడినీ వెల్లకిలా పడుకున్నా ఆలోచిస్తూ. ఆకాశంతో తళతళా మెరిసే నక్షత్రాలనీ, నిండు చందమామనీ చూడాలనిపించింది తనివితీరా.

అవేం కనపడలేదు మబ్బులు కమ్మిన అకాశంలో.

అన్నిటినీ మింగేసిన నిశీధి కనిపించింది!

అక్కడ–

ఆ హోరుమంటున్న ఏకాంతంలో, ఒంటరితనం మళ్ళీ పైశాచిక నృత్యం చేస్తూ కనపడింది తన విశ్వరూపంతో.

మనస్సు శూన్యంతో నిండిపోయినట్లనిపించింది మళ్ళీ.

ఎంతసేపు స్తబ్ధత నన్నలా కావలించుకుందో!

గస్తీ తిరిగే జవానొచ్చి అరవంలో అరవటం మొదలు పెట్టాడు. అతని మాటలు అర్థం కాకపోయినా, ఆ అరిచే తీరును బట్టి, నన్నక్కడ నుంచి వెళ్ళిపొమ్మంటున్నాడని అర్థమయింది.

మాట్లాడకుండా లేచి రోడ్డుమీద కొచ్చాను అక్కడి నుంచి. ఎవరో ఒకరిద్దరు తప్ప పెద్దగా జనం కనపడలేదు రోడ్డు మీద. టైం నాకు తెలియకుండానే చాలా గడిచిపోయిందని అప్పుడు తెలిసింది.

ఆ రోజు రాత్రి బస్సు దొరకలేదు.

నడిచే వెళ్ళాను ఇంటికి.

మర్నాడు కాలేజీకి వెళ్ళలేకపోయాను. బయటకీ వెళ్ళలేదు. ఇంట్లోనే ఉండిపోయాను.పొరపాటు పడి ఏదో ఊహించుకున్నానా అన్న అనుమానం పీడించింది నన్ను.

ఆశాదేవి నాకు దూరమయిపోతుందా?

ఆ ప్రశ్న తప్ప నా ఇంద్రియాలు దేనినీ గుర్తించలేదు.

మద్రాసు వదిలిపెట్టి వెళ్ళిపోతే? ఆశాదేవికి దూరంగా ఉంటే? మళ్ళీ గతాన్ని ఏ గుర్తూ మిగలకుండా పాతి పెడితే?

ఇంక ఆ ఓపిక నాలో లేదేమో! ఎన్నని మరిచిపోగలను? ఎన్నిటికని సమాధి కట్టగలను? గుండె భరించగలదా ఆ నిరాశల ఊగిసలాటను?

గతంలో ఎదురైన అనుభవాలు వేరు. కానీ ఆశాదేవితోడి అనుభవం వేరు.

నా మనసు నాది కాదుగా?

ఆశాదేవిది!

మరెలా పారిపోగలను నా మనసు

నుంచి నేనే?

ఎంత దూరం పోగలను?

ఆలోచనతో, ఆవేదనతో మనసు వేడెక్కి తనకి బానిసతనం చేస్తున్న శరీరానికి కూడా ఆ వేడిమిని పంచిపెట్టింది.

మూడు రోజులు మంచం మీదే ఉండిపోయాను.

జ్వరం తగ్గాక కూడా కాలేజీకి వెళ్ళలేదు. ఏం చెయ్యాలో తోచలేదు. సమాధానం కనిపించలేదు ఎంత ఆలోచించినా.

ఆశాదేవినే అడిగితే?

కాని...

ఏం అడగాలి?

అసలు నాకేం అధికారం ఉందని అడగాలి?

ఆ శక్తి నాలో ఎక్కడిది?

గుండెలో బాధనంతా అక్షరాల రూపంలో కాయితం మీద పెట్టాను.ఓ చిన్న కవిత 'లాంటిది' తయారయింది ఒంటరితనం మీద.

ఆశాదేవికి చూపించాలనిపించింది.

కాలేజీకి బయలుదేరాను.

అప్పుడే లంచ్ అవర్ అయినట్లుంది. కాంటీన్ నిండా జనం కనబడ్డారు. దూరం నించే పలకరించారు ఇద్దరు ముగ్గురు. నేనూ చెయి ఊపాను ఉన్న చోటే నిలబడి.

లైబ్రరీకి వెళ్ళాను.

"ఎక్కడికి మాయమయిపోయావు ఇన్ని రోజులూ?" అంది ఆశాదేవి.

"ఒంట్లో బావుండలేదు"

"చూస్తేనే తెలుస్తుందిలే. డాక్టరు దగ్గరికి వెళ్ళావా?"

"నేనొకటి రాశాను. చూస్తావా?"

"ఏమిటి?"

"కవిత లాంటిది"

"కవిత్వం!!!"

"అటువంటిదే అన్నాగా! చూడు" అంటూ తన చేతిలో పెట్టాను నే రాసిన కాయితం.

"'ఒంటరితనం!' పేరు మాత్రం బావుంది" అంది.

"చదువు పైకి"

చదవటం మొదలెట్టింది తను.

"ఒంటరితనం అంటే నీకు తెలుసన్నావు.

నమ్మాను నేను.

ఒంటరితనం నాకూ తెలుసుకనక"

ఆపి నా వేపు చూసింది ఆశాదేవి".

"మొత్తం చదువు" అన్నాను.

ఆ నా నమ్మకంతో.

మరో ప్రపంచంక డదామనుకున్నాను.

ఎందుకో తెలుసా?

నన్ను నీకు అర్పించుకోవటానికి!

కానీ...

ఆ కలల ప్రపంచం

పునాదులు వేయకముందే కూలిపోయింది.

కారణం?

ఒంటరితనానికి

ఎన్ని అక్షరాలో కూడా నీకు తెలీదు కనక"

"బాగా రాశాను కదూ!" అడిగాను ఆశాదేవిని.

చించిపారేసింది తనా కాయితాన్ని.

"ఆ రోజు ఇంట్లో లేవెందుకు?" అడిగాను.

"నీకెవరు చెప్పారు?"

"ఏమిటి?"

"ఆ రోజు సంగతి" అంది.

"నేనొచ్చేసరికి నువ్వు లేవు"

"అదికాదు నేనడిగింది"

"మరి?"

"నటించబోకు"

"ఎవరూ చెప్పలేదు"

"అయితే .."

"నేనే చూశాను నిన్ను మౌంట్ రోడ్డు మీద" అన్నాను.

"అందుకని కలవలేదా ఇన్ని రోజులూ?"

".........."

"ఆ రోజు ఎందుకు ఇంట్లో లేనో తెలుసా? "

"నాకెందుకు? "

"చెప్పొద్దా? " ఆశాదేవి గొంతు వణికింది.

తన కళ్ళలోకి చూశాను. కాసేపయితే ఏడుసుందేమో ననిపించింది. ఆ కళ్ళలోంచి వలికే కన్నీరు చూడగలనా?

తల వంచుకున్నాను.

"అతను బి. ఎ. లో నా క్లాస్‌మేట్. అయిదేళ్ళ తరువాత కలిశాడు. ఆ రోజే ఢిల్లీ వెళ్ళిపోతున్నాడు. నీకోసం మెసేజ్ రాసి గడియ దగ్గర పెట్టి అతనితో వెళ్ళాను. మౌంట్ రోడ్డులో లంచ్ చేద్దామన్నాడు. లంచ్ కాగానే స్టేషన్‌కెళ్ళాం."

"నాతో చెప్పలేదే? "

"నిన్ను చూస్తేగా చెప్పటానికి. "

"..................."

"ఎవరనుకున్నావు అతను? నా రెండో మొగుడనుకున్నావా? "

తన కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి.

"సారీ!" అన్నాను.

"ఆసూయకీ, ఆడవాళ్ళకీ ముడిపెడతారందరూ. అసూయ ఆడదానికే పరిస్తుందన్నట్లు. ఎవరితోనో నన్ను చూసినందుకు ఏవేవో ఊహించుకుని నన్నిన్ని రోజులూ కలవలేదన్న మాట! "

"లేదు ఆశా! అసూయపడలేదు నేను. నేనూహించుకున్నది నిజమే అయినా అసూయపడను. నా రక్తం వేరు, కానీ.."

నావేపు చూసింది ఆశాదేవి.

"బాధపడతాను. ఎందుకో తెలుసా? నువ్వు నాకు తోడుగా బ్రతికినంతకాలం నిలుస్తావనే నమ్మకం నాకు తెలియకుండానే పాతుకుపోయింది ఇన్నాళ్ళుగా. అందుకే - చాలా బాధ పడ్డాను. "

మాట్లాడలేదు ఆశాదేవి.

"మేడమ్!"

ఏమిటన్నట్లు చూసింది.

"సారీ మేడమ్!"

"..................."

''పలావు చేసి పెట్టవూ? "

నవ్వేసింది ఆశాదేవి గలగలా.

సాయంత్రం కాలేజీనుంచి ఇద్దరం తిన్నగా బీచికెళ్ళాం.

ఆశాదేవిని ఒక్క క్షణం కూడా విడిచిపెట్టలేననిపించింది. ప్రతిక్షణం, ఆ సాంగత్యం తోడి ప్రతిక్షణం నాదికావాలి.

గడిచిన వారం రోజులూ ఒక పీడకలేమో అనిపించింది ఆశాదేవి, పక్కనే ఉన్నప్పుడు.

ఆ రోజు ఆశాదేవి యింట్లోనే పడుకున్నాను.

వరసగా పది రోజులు ఇద్దరం ఎదురెదురుగా గడిపాక కాని నా మనసు కుదుటపడలేదు. ఓడిపోయిన రాజ్యలక్ష్మిని, మళ్ళీ యుద్ధంలో చేజిక్కించుకున్న వీరుడిలా కనిపించాను నాకు నేను.

పరీక్షలు ఇంకా దగ్గర పడలేదు.

అయినా, ఆ షాపు వాడు ఏం చేశాడో తెలియదు కాని, నేనిచ్చిన నోట్సు సగం దాకా అమ్మాడు. రెండు



వేలు నా చేతిలో పెట్టాడు. ఆశ్చర్యపోయాను.

'ఆశాదేవికిచ్చాను ఆ డబ్బు.

ఎంతో సంబరపడిపోయింది.

రోజులు గడిచిపోయాయి చకచకా.

మనసు మెచ్చిన తోడు దొరికితే?

దుఃఖం సుఖం అవుతుంది.

'కాలం' అనే ఒక శక్తి ఉందనీ, అది మనిషిని ఆటబొమ్మలా ఆడిస్తుందనీ మర్చిపోతాడు మనిషి.

ప్రపంచం అనేదీ ఒకటి ఉందని కూడా మర్చిపోతాడు.

పరీక్షలు దగ్గర పడ్డాయనీ, చదువు మీద మనసు లగ్నం చేయమనీ, ఆశాదేవి చెప్పేదాకా, నేనా కలలో మునిగిపోయాను.

మళ్ళీ వెనకటి జీవితం మొదలయింది.

సైక్లోస్టయిల్ చేయించిన నోట్సులే చదువుకునే వాడిని. సిలబస్‌లో అంతకుముందు కొన్ని లెసన్స్ వదిలేశాం. ఆఖరికి అవి కూడా నాకు అర్థం చెప్పి నోట్స్ డిక్టేట్ చేసింది ఆశాదేవి.

రోజూ కాలేజీకి వెళ్లటం, ఆశాదేవి దగ్గరకి వెళ్లటం, చాలాసార్లు తన దగ్గరే ఉండిపోవటం— ఇదివరకు కంటే ఎక్కువగా అలవాటైంది.

రాను రానూ 'ఇంటికి వెళ్ళాలీ, అత్తయ్య ఏమన్నా అనుకుంటుందీ,' అని కూడా అనిపించేది కాదు. వారం రోజుల దాకా కూడా ఉండిపోయేవాడిని ఆశాదేవి దగ్గర.

ఏదో ఒకరోజు మొహం చూపించటానికని వెళ్ళినప్పుడు నసగటం తప్పించి, అత్తయ్యా అడిగేది కాదు.

మరో మూడు నెలలు గడిచిపోయాయి.

ఒకరోజు నారాయణస్వామి నన్ను పక్కకి తీసుకెళ్ళాడు కాలేజీలో. అంతగా పనికట్టుకుని ఎందుకు తీసుకెళ్ళాడో అర్థం కాలేదు నాకు.

''రాజూ!''

''ఏమిటో చెప్పు బ్రదర్! ఇంత ఆర్భాటం దేనికి ఆ మాత్రానికి ?'' అన్నాను.

"నీ గురించి, ఆశాదేవి గురించీ ఏవేవో చెప్పుకుంటున్నారు కాలేజీలో అందరూ"

''ఏం చెప్పుకుంటున్నారు ?"

"అది నన్నడగబోకు''

"మరి నన్నెందుకు పిలిచినట్టూ ? ఎందుకు చెప్పినట్టూ ?"

"నువ్వంటే నా కిష్టం రాజూ!'' అన్నాడు నారాయణస్వామి.

''అసలు విషయం చెప్పు స్వామీ''

"చాలా చెడుగా చెప్పుకుంటున్నారు రాజూ''

''థాంక్స్! వస్తాను'' అంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయాను.

ఎవరి సొత్తూ నేను దోచుకోలేదు.

మరెందుకు భయపడాలి ?

ఎవరేమనుకున్నా, ఆశాదేవి చల్లటి తోడు నేను విడిచి పెట్టగలనా ?



ఒకరోజు కాలేజీలో కాంటీన్‌లో కూచుంటే

ప్రిన్స్‌పాల్‌గారు పిలుస్తున్నారని కబురొచ్చింది. ఆయన గదిగుమ్మం దాకా వెళ్ళాక ఎవరివో మాటలు వినిపించాయి నా గురించే.

ఆగిపోయాను.

"అదండి సంగతి. తలకొట్టేసినట్టుందంటే నమ్మండి. ఏమన్నా అందామా అంటే రౌడీయిజమ్ చలాయిస్తాడు. నేను క్లాసులో అడుగు పెట్టగానే బయటకి వెళ్ళిపోతాడు. పర్మిషన్ అడిగే వెళ్తాడనుకోండి కానీ అలాచేస్తే ఎలా ? మీరే గట్టిగా బుద్ధి చెప్పాలి" ఎకనమిక్స్ లెక్చరర్‌గారు ఒలకబోసుకున్న ఆవేదన అది.

"రాజు విషయం నాకు తెలుసులెండి చాలా మంచి కుర్రాడు. కాకపోతే ఆ లైబ్రేరియన్ విషయం అంటారా నేను చెప్తాను రాజుకి. తప్పు రాజుది కాదు. ఆ ఆశాదేవిది" అన్నారు ప్రిన్స్‌పాల్‌గారు.

"అసలు అటువంటి వాళ్ళు మన కాలేజీలో ఉద్యోగం చేస్తే కాలేజీకే తలవంపులండీ..."

మరి వినలేకపోయాను.

ఒక్క విసురున లోపలికి వెళ్ళాను.

స్వింగ్‌డోర్స్ టపటపకొట్టుకున్నాయి.

నన్ను చూడగానే తేలుకుట్టినట్టు ఎగిరిపడ్డాడు ఎకనమిక్స్ లెక్చరర్. తప్పు చేసినప్పుడు ఏ మనిషీ తన మనసుకి సమాధానం చెప్పుకోలేడుగా ?

"నేను వెళ్తానండీ" అంటూ వెళ్ళిపోయాడు అక్కడ నించి వెనక ఎవరో తరుముతున్నట్టు.

"సర్ పిలిచారట?" అడిగాను.

"నీతో మాట్లాడాలి రాజూ!"

'చెప్పండి' అన్నట్టు చూశాను.

"నువ్వీమధ్య క్లాసులకి వెళ్టం లేదుట కదా!"

"ఎవరు చెప్పారు మీకు?"

"ఎవరు చెప్తే ఏం? అన్సర్ మి"

"ఎకనమిక్స్ క్లాస్‌కే నేను వెళ్ళంది. మిగతా క్లాసులన్నిటికీ వెళ్తున్నానండీ"

"ఏం? ఎకనమిక్స్ అంతా వచ్చేసిందా నీకు?"

ఆయన వ్యంగ్యానికి నాక్కాస్త కోపం వచ్చింది.

"పండితుడివయిపోయావన్నమాట ఎకనమిక్స్‌లో?"

"అది కాదండీ"

"మరెందుకు వెళ్ళటం లేదు ?"

"మీరొక్క రోజు క్లాసులోకూచుంటే మీకే తెలుస్తుంది"

"సరిగ్గా చెప్పు ఆ చెప్పేది"

"క్షమించండి ఇలా మాట్లాడుతున్నందుకు. ఇందాక అడిగారు మీరు 'ఎకనమిక్స్‌లో పండితుడివా?' అని

"అయితే...?"

"నాకంత ప్రావీణ్యం లేదండీ. కాని ఎకనమిక్స్ లెక్చరర్‌గారికి మటుకు ఎకనమిక్స్ చెప్పగలను"

పెళ్ళున నవ్వారు ప్రిన్స్‌పాల్‌గారు.

"నాకు తెలుసు రాజా ఆ సంగతి. కానీ నీకంటే పెద్దవాడు కదా! ఆయన రాగానే నువ్వుక్లాసులోంచి వెళ్లిపోతేఏమనుకుంటాడు చెప్పు?" ఆయన్ని అవమానించినట్లు కాదూ?"

"........."

"గౌరవం ఇవ్వాలి ఆయన లెక్చరర్ అయినందుకైనా"

"ఆయనకి రోజూ పొద్దునా సాయంత్రం నమస్కారాలు చేస్తానండి కావలిస్తే."

"ఇంకోటి చెప్పాలి నీకు."

"చెప్పండి."

"దానికంటే సీరియస్ విషయం."

"చెప్పండి"

"చాలామంది చెప్పారు. నేనూ చూశాను ఈమధ్య. ఎప్పుడు చూసినా లైబ్రరీలో కనపడతావు. ఏం చేస్తావక్కడ?"

"చదువుకుంటూంటానండీ."

"నే విన్నది వేరు."

"ఏం విన్నారు?"

"రాజా మంచి కుర్రాడివి. అన్నిట్లో ఫస్టొస్తావు. అందుకే నువ్వంటే నాకిష్టం. అంతా బావుంది. కానీ..."

"ఏమిటి?"

"కాస్త జాగ్రత్తగా ఉండు" అన్నారు.

వచ్చేశాను అక్కడినుంచి.

మళ్ళీ కాంటీన్‌కి వెళ్ళి కూచున్నాను.

చుట్టూ ఉన్న ప్రపంచం మొత్తం పెద్ద అబద్ధంలా, అనవసరంగా కనిపించింది నాకు.

ఎందుకు వీళ్ళకి నా గొడవ?

ఆశాదేవితో నేను చనువుగా ఉంటే వీళ్ళకెందుకు? వాళ్ళకేం నష్టంలేదే? ఏనాడూ, వేలెత్తి చూపించేటట్టు ప్రవర్తించలేదే కాలేజీలో? అటువంటప్పుడు ఏదో మహా పాపం జరిగిపోయినట్టు గొడవ చేస్తారెందుకు?

ఆశాదేవిని నాకు కాకుండా చేస్తారా? చెయ్యనివ్వను.

ఇంకో మూడు నెలలయితే పరీక్షలు అయిపోతాయి. ఏదో ఒక ఉద్యోగం చూసుకుంటాను. నాతో తీసుకుపోతాను ఆశాదేవిని వీళ్ళందరి నుంచీ దూరంగా.

ధైర్యం చెప్పుకున్నాను.

"ఇంతకీ ఎవరు ఎవర్ని ఉంచుకున్నట్టు ?"

వెనకనుంచి వినపడింది.

వెనక్కి తిరిగి చూశాను. ఎవరి ప్రపంచంలో వాళ్లు కనపడ్డారు.

రక్తం ఉడికిపోయింది.

ఆ మాట ఎవరన్నదీ తెలియలేదు. తెలిస్తే రక్తం కళ్ళచూసేవాడినేమో. ఆ మనిషిని అక్కడే పాతేసేవాడినేమో.

అలాగే కూచుండిపోయాను మౌనంగా.

ఏం చెయ్యాలి వాళ్ళను? చివరికి ఏ దారీ తోచక కాంటీన్ నుంచి బయట కొస్తూ అన్నాను కసిగా.

"ఆవిడే నన్ను ఉంచుకుంది!"

ఎవరి చేతిలోదో కాఫీ కప్పు జారి కింద పడి ముక్కలయింది. ఖంగు తిన్నట్టున్నారు కూచున్నవాళ్ళందరూ.

గుండెలో మంట కాస్త చల్లారింది. ఇంటికి బయలుదేరాను మధ్యాహ్నమే. చికాకనిపించింది మనుషుల బుద్ధులు చూస్తూంటే.

అంతమాట ఎలా అనగలిగారు.

ఆడా,మగా కలిసి తిరిగినంత మాత్రాన దాని అర్థం ఇద్దరూ పడుకున్నట్టేనా? స్నేహం అనే పదానికి చోటులేదా ? ఇద్దరినీ పాపం చేసిన వాళ్ళకింద జమ కట్టాలా?

అవును.

నాగరికత కళ్ళెం లేని గుర్రంలా పరుగులు తీస్తున్న ఈ రోజుల్లో అందరూ అలాగే అనుకుంటారేమో!

ఆ అవకాశం ఇచ్చేవాళ్ళూ ఉన్నారుగా?

మళ్ళీ అనిపించింది పరీక్షలు తొందరగా అయిపోతే బావుండునని.

చేతిలో డిగ్రీ!

చేయటానికి ఏదో ఒక ఉద్యోగం !

ఆ మూడు నెలల అవతల నేను కలలు కన్న అందాలు నిండిన లోకం కనపడింది. మూడో మనిషికి ప్రవేశం లేని లోకం !

ఇంటికిచేరి మంచంమీద వాలిపోయాను నిశ్శబ్దంగా.

అత్తయ్యొచ్చింది గదిలోకి.

"నీ పద్ధతేం బాగాలేదు రాజూ"

లేచి కూచున్నాను.

"ఏమిటి?"

"మీ కాలేజీలో ఆవిడ గురించీ, నీ గురించీ ఏవేవో వింటున్నాను"

అసలే విసుగ్గా ఉంది. ఇంట్లో అత్తయ్య కూడా ఆశాదేవి గురించి మాట్లాడగానే చిర్రెత్తుకొచ్చింది.

"ఏం విన్నావు?" విసురుగా అడిగాను.

"నా నోటితో చెప్పమంటావా?"

"చెప్పు"

"అవన్నీ అబద్ధాలంటావా?"

"ఈ క్షణం వరకూ నువ్వు విన్నవన్నీ అబద్ధాలే అత్తయ్యా! ఒకవేళ అవి నిజమే అయినా నువ్వు విస్తుపోవద్దు. నీకెందుకు బాధ?"

"ఏమిటి నువ్వనేది?"

"ఆ అమ్మాయంటే నా కిష్టం"

"అయితే?"

"అందుకే వెళ్తున్నా ఆమె దగ్గరికి"

"ఎందుకు ?"

"కారణం ఏం లేదు. ఊరికే వెళ్తున్నానంతే."

"నీకంటే అయిదారేళ్ళు పెద్దది. అటువంటి విధవతో నీ కేమిటి సంబంధం ?"

"నువ్వలా అనకూడదత్తయ్యా"

"లేకపోతే ఏమిటి నీ వెర్రి?"

"........"

"ఇక నుంచీ నువ్వా కొంపకి వెళ్టానికి

"వెళ్ళాన త్తయ్యా"

"ఏమంటున్నారో తెలుసా అందరూ?"

"చెప్పు. విని తరిస్తాను"

"నిన్ను ఆవిడగారు ఉంచుకుందట"

"అత్తయ్యా! నిజంగా తను నన్ను ఉంచుకున్నా ఆ మాట పదిమందీ నా మొహం మీదే అని నన్ను దుమ్మెత్తి పోసినా నాకేం అభ్యంతరంలేదు. చాలా?"

"సిగ్గులేదురా నీకు ?"

"ఎందుకు సిగ్గు ?"

"బరితెగించావురా"

"ఎవరినీ కష్టపెట్టటంలేదుగా"

"ఇంతకీ నువ్వు చెప్పేదేమిటి?"

"ఒకసారి చెప్పాగా?"

"సరే అయితే నేనూ చెప్తున్నాను విను"

"ఏమిటి ?"

"నువ్వు నా యింట్లో ఉండటానికి వీల్లేదు."

"వెళ్ళిపొమ్మంటున్నావా ?"

"అర్థం కాలేదా ?"

"అర్థమయింది."

"నే చెప్పినట్లు ఉండగలిగితే ఉండు. ఇన్నిరోజులు అన్నం పెట్టాం.ఎన్నిరోజులయినా భరిస్తాను ఏదో జన్మలో రుణం అనుకుని"

ఆవిడ మాటలకీ, నామీద ఏదో దయాదాక్షిణ్యాలు చూపిస్తున్నట్లు ఆ మాట్లాడిన తీరుకీ నాకు చాలా కోపం వచ్చింది.

"అత్తయ్యా!"

"........."

"ఇన్నిరోజులూ నేను ఇంట్లో ఊరికే తింటున్నాననుకున్నావా ? నేను డబ్బివ్వటం ఎందుకు మానేశానో తెలుసా ?"

నిర్లిప్తంగా నిలబడింది అత్తయ్య.

"నీ పెద్దకూతురు కన్నె చెర విడిపించటానికి నాకున్న ఇరవైవేలూ మావయ్యకి ఇచ్చాను. ఆయన వద్దంటున్నా బలవంతం చేసి ఇచ్చాను"

"........."

"ఎవరికీ నేను రుణపడలేదు. అర్థం అయిందా ?"

"నేను నమ్మను" అంది అత్తయ్య.

"నమ్మమని నిన్ను అర్థించటంలేదు. నీ యింట్లో ఉండనివ్వమని నిన్ను బ్రతిమాలను కూడా! రుణం ఎక్కడ మిగిలిపోయిందో తెలుసుకుంటావనిచెప్పానంతే"

బయటకొచ్చేశాను.

* * *

ఆవేదన దాచుకోవటం నా వల్ల కాదనిపించింది.

"మధ్యలోనే వెళ్ళిపోయావేం కాలేజీనుంచి ?" అడిగింది ఆశాదేవి నన్ను చూడగానే.

"ప్రిన్స్‌పాల్‌గారు అడిగారు"

"ఏమని ?"

"కాలేజీలో మిగతావాళ్ళు అడిగారు"

"ఏమిటి ?"

"ఇప్పుడే మా అత్తయ్య కూడా అడిగింది"

"ఏమిటో చెప్పు ?"

"నువ్వు నాకేమవుతావు ?"

ప్రతిమలా చూసింది ఆశాదేవి.

ఆమె కళ్ళు తళ తళ మెరిశాయి కన్నీళ్ళతో.

"నువ్వే చెప్పు" అంది.

నా అణువణువూ కరిగిపోయింది.

తన కళ్ళలోకి చూస్తుంటే నేను కలలు కన్న భవిష్యత్తు కనపడింది.

నా మనసంతా చెప్పాలనిపించింది.

నగ్నంగా పరచాలనిపించింది తన ముందర !

దగ్గరకెళ్ళి కావలించుకున్నాను.

లక్ష్మి గుర్తొచ్చింది అరక్షణం.

కానీ...

లక్ష్మి కావలింతలో నన్ను ముంచిపేసే పనికిరాని ఉద్రేకం కాదు ఆ క్షణంలో నన్నావహించిన భావం.

రోహిణీ కార్తె ఎండల్లో నడిరోడ్డు మీద నడిచి సొమ్మసిల్లిపోయిన అనాథకు ఓ చల్లటి ఆశ్రయం దొరికినప్పుడు ఎలా అనిపిస్తుందో నాకూ అలాగే అనిపించింది.

"చెప్తానన్నావుగా చెప్పవేం?" అంది ఆశాదేవి నన్ను మరింతగా దగ్గర చేసుకుంటూ.

"తల్లిని చూడలేదు ఆశా. భార్యనే మనిషినీ ఇంకా చూడలేదు నేను"

నా కళ్ళలోకి చూసింది తను.

"ఇద్దరినీ నీలో చూస్తున్నానిప్పుడు"

"పిచ్చివాడివి నువ్వు" అంది.

"మా అత్తయ్య ఏమందో తెలుసా?"

"ఏమంది?"

"ఉంచుకున్నావుట నువ్వు నన్ను"

నవ్వింది ఆశాదేవి

"నువ్వేమన్నావు?"

"నా కిష్టం అని చెప్పాను"

"అచ్చా!"

"అం చాలా చాలా యిష్టం అని చెప్పాను"

"సిగ్గు లేదూ నీకు?"

"మా అత్తయ్యా ఇదే అంది. కాని ఎందుకు సిగ్గు?"

"నేను నీ కంటే పెద్దదాన్ని"

"అయితే?"

"అయిదేళ్ళు పెద్దదాన్ని తెలుసా?"

"నువ్వు చిన్నపిల్లలా కనిపిస్తున్నావు నాకు మటుకు"

"ఇంత పెద్దరికం ఎప్పుడొచ్చింది నీలో?"

"ఏమో!"

"అన్నం తిన్నావా?"

"లేదు."

"రా తిందాం ఇద్దరం."

"నువు ముద్దలు తినిపించాలి."

"కోరికలకి తక్కువలేదు రాజా వారికి" అంటూ నా బుగ్గలు సాగదీసింది ఆశాదేవి.

"రాజుని కాదూ?" అన్నాను.

నవ్వుతూ ముద్దలు కలిపి తినిపించింది.

"అత్తయ్యతో పోట్లాడి వచ్చేశావా?" అడిగింది.

"ఇంట్లోంచి వెళ్ళిపొమ్మంది."

"దేనికి?"

"నిన్ను కలవకూడదట."

"అయితే ఏం?"

"నే బ్రతకలేనుగా."

"పుట్టినప్పటి నుంచి ఉన్నానా నేను?"

"ఏమో. కానీ ఇప్పుడున్నావుగా?"

"....................."

"కదూ?"

"పిచ్చి రాజువి."

"ఆశా"

"ఏమిటి?"

"నన్నెప్పుడూ విడిచిపెట్టబోకు. నువు లేకపోతే చచ్చిపోతాను"

తన గుండెల్లో దాచుకుంది నన్ను.

ఊపిరాడకపోయినా ఆ చోటు ఎంతో బావుందనిపించింది.

ఆ అనుభూతికి నిర్వచనం?

చెప్పలేనేమో మాటల్లో!

రాత్రంతా ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూనే వున్నాం. తెల తెలవారుతూండగా నిద్రపోవటం మూలాన మర్నాడు పొద్దున తొందరగా మెలకువరాలేదు.

పడకొండయింది కళ్ళు తెరిచేసరికి.

"లేటయిపోయింది రాజా" అంది ఆశాదేవి.

"దేనికి?"

"కాలేజీకి."

"ఫరవాలేదు."

"బలేవాడివే. నాకున్న లీవంతా అయి పోయింది. పోనీ నా విషయం పదిలేయ్. నీ మాటేమిటి?"

"ఏం?"

"నువ్వీ మధ్య చాలా సార్లు ఎగ్గొట్టావు కాలేజీ. ఎన్ని క్లాసులు మిస్సయ్యావో."

"కంగారేం లేదు. నే వెళ్ళకపోయినా కొంపలేం మునగవు, అన్నీ చదువుకున్న వేగా."

"నాతో చెప్పిన మాటలు మర్చి పోయావా?"

"ఏం చెప్పాను?"

"ఏం చెప్పావో కూడా నీకు గుర్తు లేదన్నమాట? దాన్ని బట్టే అర్థమవు తోంది నీ పట్టుదల."

"ఓహో. యూనివర్సిటీ ఫస్ట్ విష యమా?"

"ఫరవాలేదు గుర్తుందే?"

"వస్తుంది ఆశా. నాకే వస్తుంది."

"అంత తేలికనుకోకు రాజా! ఒక నెలరోజులు చదివి నోట్సులు రాసినంత మాత్రాన రాదు"

"....................."

"పరీక్షలింకా మూడు నెలలు కూడా లేవు. మళ్ళీ చదువులో పడాలి నువ్వు."

"అలాగేలే"

"ఇవాళనుంచీ సినిమాలూ, షికార్లూ అన్నీ బంద్."

"చిత్తం. కానీ...."

"ఏమిటి?"

"ఇవాళ ఒక్కరోజూ."

"ఒక్క రోజూ?"

"పర్మిషను కావాలి మేడమ్."

"దేనికి?"

"సినిమాకీ, షికారుకీ"

"గ్రాంటెడ్."

తను స్నానం చేసి తయారయేలోపల యింటికెళ్ళి నాకున్న కాస్త సామానూ తెచ్చుకుంటానన్నాను. సరేనంది ఆశా దేవి.

యింటికెళ్ళి సామాను సర్దుకుంటున్న నన్ను చూసి అత్తయ్య నిర్ఘాంత పోయింది.

"ఏరా రాజా! నిజంగానే వెళ్ళిపోతు న్నావా?" అంది.

నేనూ ఆశ్చర్యపోయాను తన మాటలకి.

"అవును అత్తయ్యా."

"నేను అన్నది నీ మంచి కోసం కాదూ?"

"అత్తయ్యా! నా మంచి నాకు తెలుసు నేనిక్కడుంటే నీకొచ్చే ఇబ్బందులూ తెలుసు. అందుకే వెళ్ళిపోతున్నాను."

సామానంతా సర్ది ఆటోలో పెట్టాను. అత్తయ్యకి ఆఖరిసారిగా ఒకమాట చెప్పాలనిపించింది. మళ్ళీ ఇంట్లోకి వెళ్ళాను.

"వెళ్తున్నానత్తయ్యా! నీ మీద నాకె టువంటి కోపం లేదు. ఏ రోజు ఏ అవ సరం వచ్చినా నన్ను మర్చిపోకు" అంటూ వచ్చేశాను.

ఎందుకో జాలేసింది అచేతనంగా నిల బడ్డ అత్తయ్యని చూస్తే.

ఇంక ఆ విషయం ఆలోచించదలుచుకో లేదు.



వెళ్ళేసరికి ఆశాదేవి తయారయి రెడీగా ఉంది. ఇద్దరం బయలుదేరాం. సాయంత్రం దాకా ఊరికే సిటీ అంతా తిరిగాం. ఫస్ట్ షో సినిమా చూసి ఇంటికి తిరిగొచ్చాం.

హాయిగా గడిచిపోయింది ఆరోజు కూడా! బాధలన్నీ తీరిపోయాయని పించింది.

ఇంక భవిష్యత్తులో ఏ దుఃఖమూ తలుపు తట్టదనిపించింది.

కానీ...

మర్నాడు కాలేజీలో అడుగు పెట్టగానే క్రిందటి రోజున్న ఉత్సాహం అంతా అణగారిపోయింది. స్థైర్యం సడలి పోయింది.

కాలేజీ గ్రౌండూ, ఆ బిల్డింగూ, ఆ పరిసరాలూ అన్నీ వెగటుగా కనిపించాయి నా కళ్ళకి.

దానికి కారణం కాలేజి కాదు.

దాంట్లో మనుషులు!

వాళ్ళ చూపులు!

దూరం నుంచి వాళ్ళని చూస్తుంటే నా గురించే మాట్లాడుకుంటున్నారనిపించింది. దగ్గరకెళ్ళగానే మాటలు మానేసి, వాళ్ళ గుసగుసలు ఆపేసి నవ్వుతూ పలకరించారు

అంత ఆసక్తి ఎందుకు నా మీద?

వాళ్ళకున్నదంతా నేను దోచుకుపోయినట్టూ, సర్కస్‌లో జంతువుని చూసినట్టూ ఎందుకా చూపులు?

మనసు మనసులో లేదు క్లాసులో కూచున్నా.

లంచ్ టైంలో ఆశాదేవి దగ్గరకెళ్ళాను.

అంతా చెప్పాను.

"నువ్వు తప్పు చేస్తున్నావా?" అంది తను.

"లేదు."

''ఇంకెందుకు నీకు వాళ్ళేమను కున్నా?"

"వాళ్ళ చూపులూ, వ్యంగ్యంగా మాటలూ..."

"పట్టించుకోకు. నీ పని నువ్వు చేసుకుపో."

''ఇవాళ్టికి నేనింటికి వెళిపోతాను ఆశా!"

"మళ్ళీ మొదటికొచ్చావు."

''అదికాదు. ఎందుకో కూచోబుద్ధి కావటంలా క్లాసులో.

"ఎందుకు?"

''ఏమో!''

''రాజా. నువ్వు లేకపోతే నష్టపోయేది ఎవరు? వాళ్ళా?"

"కాదు''

''మరి! నీ కిష్టంలేకపోయినా కూచోవాలి క్లాసులో. నీ కోసం, నీ చదువు కోసం."

''ఆశా."

"నా మాట విను రాజా. అలవాటు చేసుకో."

ఎలా?

"నా మాట వినవూ?" అంది.

సరేనన్నట్టు తలూపాను ఇష్టం లేక పోయినా.

"మరి వెళ్ళు క్లాసుకి టైమవుతోంది.''

కదిలాను అక్కడి నుంచి.

కాదనలేను ఆ మనిషినీ, ఆ మనిషి మాటనీ.

ఎందుకో!

కాలేజీ ఎప్పుడయిపోతుందా అని చూశాను. అటెండెన్స్ కోసం అయినా కూచోక తప్పదుగా. అందుకేగా ఆశాదేవి అంత బలవంతం చేసి పంపించింది.

ఆఖరి క్లాసయ్యాక గుండెమీది బరువు దిగిపోయినంత రిలీఫ్ వచ్చింది. లైబ్రరీకి వెళ్ళి ఆశాదేవిని కలిశాను.

బీచికెళ్ళాం ఇద్దరం.

''వీళ్ళ ధోరణి అర్థం కావటం లేదు ఆశా!"

"సంఘం."

''వీళ్ళా సంఘం?''

''అవును రాజా! నీ చుట్టూ బతుకుతున్న మనుషులే నీ మీద పెత్తనం చెలాయించే సంఘం."

''వాళ్ళకేం అధికారముంది?''

"సంఘంలో కొన్ని పద్ధతులుంటాయి. దాదాపు ప్రతి మనిషీ ఆ పద్ధతుల వలయంలో ఒక మరలా బతకటం అలవాటు పడ్డాడు. సంఘంలో పద్ధతుల్ని ఏ మనిషి కాదన్నా, పాటించకపోయినా, పక్కదారి పట్టినా అది అందరికీ వింతగా ఉంటుంది వినోదం కూడా అవుతుంది."

"ఎవరి జోలికీ మనం పోలేదుగా!"

"నిజమే! కానీ నువ్వు వద్దనుకున్నా వాళ్ళకి నువ్వెలా బతుకుతున్నావనేది కావాలి.''

"అయితే ఏం చెయ్యాలంటావు?"

"పట్టించుకోకు. నీ మనసు పాపం చేయలేదని చెబుతున్నంతవరకూ ఎవర్నీ లెక్కచేయబోకు.''

మౌనంగా ఉండిపోయాను చాలా సేపు.

"భయపడుతున్నావా రాజూ?''

అడిగింది ఆశాదేవి.

''లేదు ఆశా! నా తోడుగా నువ్వున్నంతవరకూ నాకే భయం లేదు."

''పద వెళ్దాం. చీకటి పడుతోంది!''

అంది.

"అప్పుడే?"

"నువ్వు చదువుకోవద్దూ!"

"అవును. అదొకటుంది కదూ?" అంటూ లేచాను.

"చదువుని అలా గుదిబండలా పిలవ కూడదు రాజూ! ఏం లాభం? ఎంత చదివినా వంటపట్టదు."

"విసుగు పుడుతోంది చదువంటే."

"కొన్ని రోజులేగా. ఓపికపట్టు."

కొందరి మనుషుల తోడుతో మనలో ఉన్న ఉత్సాహం, శక్తీ అన్నీ ఆవిరై పోతాయి. వాళ్ళ దురదృష్టం మనకి అంటుకోసటం దానికి కారణమేమో.

కాని...

కొందరు పక్కనుంటే చాలు. ఎక్కడ లేని ఆత్మస్థైర్యం, పట్టుదలా మన సొంత మయి ముందుకు నడిపిస్తుంది. ఏదన్నా సాధించగలమనే నమ్మకాన్ని కలిగిస్తుంది.

'నాకు లేని శక్తినీ, ఉత్సాహాన్నీ, ఒక టానిక్‌లా నాలో పోస్తోంది ఆశాదేవి' అనిపించింది.

* * *

ఆశాదేవి చెప్పింది ఎంత నిజం!

ఎవరో ఏదో అంటారూ, అనుకుంటారూ, అని భయపడి ఎంతకాలం బతకగలడు ఏ మనిషైనా?

అనుక్షణం చిత్రహింసతో బతుకు భారమయిపోదూ!?

చేతులారా అనవసరంగా, లేనిబాధలు కొని తెచ్చుకున్నట్లు అవుతుంది. ఎవర్నీ లెక్కచెయ్యకపోతే ఏ గొడవా ఉండదుగా!

రోజులు గడుస్తున్న కొద్దీ చుట్టూ జనం కూడా అలవాటు పడ్డారేమో, ఇది వరకులా లేదు వాళ్ళ ప్రవర్తన పాతబడి పోయిందనుకుంటా మా విషయం.

పరీక్షలు దగ్గర పడ్డాయి.

సైక్లోస్టయిల్ నోట్సులు తీసుకున్న షాపతను మరో రెండు వేలిచ్చాడు అమ్మిన వాటికని. అంత తొందరగా అమ్ముడుపోయాయంటే నమ్మలేక పోయాను.

"దీంతో మొత్తం లెక్క సరిపోయినట్టే కదండీ?" అన్నాడు.

"సరిపోయింది"

"ఇంకా ఉన్నాయా మీ దగ్గర?"

"లేవండీ"

"మరో వంద కాపీలయినా అమ్ముడు పోతాయండీ. పోనీ ఓ పని చేయ మంటారా?"

"ఏమిటి?" అడిగాను.

"నేనే ఇంకాసిని చేయిస్తాను"

"మీరా?"

"డబ్బులిస్తాను లెండి దానిక్కూడా"

"అలాగే!"

"ఇంతకీ ఇవి రాసింది మీరేనా?"

"ఏం"

"నాకు తెలిసిన పబ్లిషరు ఒకాయన ప్రింటు చేయిస్తానన్నాడు. డబ్బుకూడా బాగానే వస్తుంది. కాకపోతే ఒకటి..."

"ఏమిటి"

"ఇంకా నపెంచాలి"

"పరీక్షలయ్యాక చూద్దాం లెండి" అంటూ వచ్చేశాను.

ఆశాదేవికి డబ్బులిస్తుంటే అంది-

"అప్పుడే అయిపోయాయా అన్నీ? ఇంకా పరీక్షలు నెలరోజులున్నాయిగా?"

"సరే! ఇంకా కావాలన్నాడు తెలుసా?"

"అంత డిమాండ్ వచ్చిందన్న మాట?"

"ఎవరో అచ్చుకూడా వేసుకుంటా మన్నారట కాస్త పెంచి ఇమ్మన్నాడు నోట్సులన్నింటినీ. ఆలోచించి చెప్తా నన్నాను"

"తరువాత చూద్దాంలే. ఆడేంటి అప్పుడే పడకేశావు?"

"ఇవాల్టికి..."

"అదేం వీల్లేదు. పదకొండు దాకా చదవాల్సిందే"

తనూ మెలకువగానే కూచుంది నా చదువయి పోయేవరకూ.

పుస్తకం పుచ్చుకోవటం ఏ మాత్రం ఇష్టంలేకపోయినా తప్పలేదు. ఎలాగో మనసుని లగ్నం చేశాను.

రోజూ అలాగే దగ్గర కూచునేది ఆశా దేవి తనూ ఏదో ఒక పుస్తకం చదువు కుంటూ. ఆ ఓపికికి ఆశ్చర్యం వేసేది నాకు.

ప్రిపరేషన్ హాలిడేస్ ఇచ్చారు.

తెల్లవారు ఝామునే అలారం పెట్టి లేపేది ఆశాదేవి.

పుస్తకాల ముందు కూచో పెట్టేది. టిఫినూ కాఫీ ఇచ్చేది. తను స్నానం, భోజనాలకి పిలిచేదాకా అలాగే చదువుతూ కూచునేవాడిని. భోజనం తరువాత మళ్ళీ చదువు.

సాయంత్రం మేడమీదకెళ్ళి కూచునే వాళ్ళం. ఓ గంటసేపు కబుర్లు చెప్పు కోవటం, తరువాత మళ్ళీ చదువు మొదలు పెట్టటం.

అంతా టైం ప్రకారం జరిగిపోయింది.

పరీక్షలు మొదలవటానికి మరో వారం రోజులు మిగిలింది.

ఆశాదేవి లేకపోతే అంత శ్రద్ధగా చదవగలిగేవాడినా?

ఒకరోజు పొద్దునే ఇంటతను అద్దె కోసం వచ్చాడు. అతనొస్తే డబ్బిమ్మని చెప్పి ఆశాదేవి పనిమీద బయట కెళ్ళింది.

అద్దిస్తుంటే అన్నాడతను.

"కాస్తావిడను పిలవండి"

"ఎందుకు?" అడిగాను.

"పనుంది"

"నాతో చెప్పండి"

"మీతో కాదు ఆవిడతోనే చెప్పాలి"

"ఎవరో చెప్పినా ఒకటే"

"నాకు తెలుసులెండి ఆ సంగతి"

"ఏమిటి మీకు తెలిసింది?" కర కుగా అడిగాను. అతని మాటల్లో పంకర తనం నాకు నచ్చలేదు.

"అంతా తెలుసు. ఆ విషయం తేల్చు కుందామనే వచ్చాను"

"ఏం తేల్చుకుంటారు?" అంది ఆశా దేవి తీక్షణంగా గదిలోకి వస్తూ.

"మీరిల్లు ఖాళీ చెయ్యాలి" అన్నా డతను.

"దేనికి?" అడిగాను.

"ఈ ఇల్లు నాది. నాకిష్టం లేదు ఖాళీ చెయమంటున్నాను"

"అదే కారణం ఏమిటని అడుగు తున్నాను" నేనూ రెట్టించాను.

"రాజూ నువు ఊరుకో! అలాగే ఖాళీ చేస్తాం లెండి. ఈ నెలాఖరికి చేసేస్తాం" అంది ఆశాదేవి.

"అలాగే అనటం కాదు. వారం రోజుల్లో ఖాళీ చెయ్యాలి. మీ వెళ్ళే రోజున మిగిలిన అద్దె డబ్బు మీకు పారే స్తాను"

"ఖాళీ చెయ్యం ఏం చేస్తావు?" అన్నాను.

"నలుగురినీ పిలిచి చేయిస్తాను" అన్నాడు ఇంటాయన.

"వేరే ఇల్లు దొరికే అంతవరకూ ఖాళీ

చెయ్యం. అర్థమయిందా?"

"నా కనవసరం. వారం రోజుల్లో ఖాళీ కావల్సిందే"

ఏదో మాట్లాడబోయిన నన్ను వారించింది ఆశాదేవి.

"అయ్యా! ఇల్లు ఖాళీ చేయమన్నారు. చేస్తామని చెప్పాను.ఎందుకు అనవసరంగా ఘర్షణ పడతారు? వారం కాకపోతే ఓ పదిహేను రోజులైనా సరే. వెళ్ళిపోతాం లెండి" నచ్చచెప్పింది ఆశాదేవి.

కేకలు పెట్టుకుంటూ వెళ్ళిపోయాడు ఇంటతను.

"నువ్వు అడ్డు రాకుండా ఉండాల్సింది" అన్నా.

"లేకపోతే ఏం చేసే వాడివేం?"

"వాడి కాలో చెయ్యో విరగ్గొట్టే వాడిని"

"ఎందుకు రాజూ అంత కోపం?"

"కోపం కాకపోతే ఏమిటి? ఊరికే ఉంటున్నామా మనం? ఉన్న పళాన ఖాళీ చేయమంటే ఎక్కడికెళ్తాం చెప్పు?"

"ఊరికే గొడవ పడకూడదు రాజూ! అతనికి అసలు బాధ నేను అద్దె పెంచనివ్వలేదని. ఈ యింట్లో దిగినరోజు ఎంత అద్దె ఇచ్చానో ఈ రోజూ అంతే ఇస్తున్నాను. ఈ సాకు పెట్టుకుని ఖాళీ చేయిద్దామనుకున్నాడు. నీ పరీక్షలు అయిపోయేలోగా ఏదో ఒకిల్లు దొరక్కపోదు. వెతుక్కుని మారిపోదాం"

"అలాంటివాళ్ళని తేలిగ్గా వదిలిపెట్టకూడదు ఆశా"

"నీదంతా ఆవేశం. ఇదిగో నువ్వు చెప్పిన పుస్తకం"

"దొరికిందా?"

"పది షాపులు తిరిగాను. ఎందుకు దొరకదు. అన్నం తిన్నావా?"

"లేదు నువ్వొస్తావని కూచున్నా"

అన్నం తింటుంటే అంది ఆశాదేవి.

"రాజూ! ఇవాల్టినుంచీ నువ్వు రోజూ ఎనిమిది గంటలకే పడుకోవాలి"

"అదేం! పరీక్షలు వారం రోజులు కూడా లేవు"

"ఈ వారం రోజులూ నువ్వు చదివేది చాలా ముఖ్యం. ఆరోగ్యం కూడా చూసుకోవాలిగా. కావలసినంత నిద్రపోతే గానీ ఆరోగ్యం బావుండదు. అర్థమయిందా?"

"అలాగే మేడమ్!"

"స్వీట్ బాయ్!" అంది.

"నువ్వు నాకంటే స్వీటు"

నవ్వింది తను.

మర్నాటి నుంచీ ఇల్లు వెతకటం మొదలెట్టింది ఆశాదేవి. పొద్దునే వంట చేసి నాకు పెట్టి తను కాస్త తిని వెళ్ళేది. పదీ పదకొండు గంటలకి వెళ్ళిన మనిషి సాయంత్రానికి కాని వచ్చేది కాదు

అయినా ఇల్లు దొరకలేదు ఎక్కడా. రెండు మూడు ఉన్నా అద్దె చాలా ఎక్కువ. వెతకటం మటుకు మానలేదు ఆశాదేవి.

సోమవారం వచ్చింది.

మొదటి పరీక్షఅవాళే.

ఎంత ఉత్సాహం వచ్చిందో.

అన్ని రోజుల నా శ్రమకి ఫలితం దక్కుతున్నందుకేమో.

పొద్దునే గుడికి తీసుకెళ్ళింది ఆశాదేవి.

"ఏమడిగావు దేవుడిని?" అడిగింది తను గుడి బయటకు రాగానే. వెంటనే మాట్లాడలేకపోయాను.

తనవేపు చూశాను.

ఎర్రటి పట్టుచీరా, చీర చుట్టూ సన్న జరీ అంచు బోర్డరూ, ముఖాన అర కాసంతా కుంకుమా... దేవతలా కనిపిం

చింది ఆశాదేవి.

"ప్రతి శనివారం నువ్వు నన్నిలాగే గుడికి తీసుకురావాలని"

"అదేం కోరిక?"

"అంతకంటే ఆ దేవుడిని ఏమడగాలో తోచలేదు"

నవ్వింది తను.

"నువ్వేం అడిగావు?" అడిగాను.

"నీకు యూనివర్సిటీ ఫస్ట్ రావాలని"

"వస్తుంది ఆశా!"

అట్నుంచే పరీక్ష హాలుకి వెళ్ళిపోయాను.

మూడు రోజులు గడిచిపోయాయి మూడు పేపర్లూ పూర్తయ్యాయి. నాలుగో రోజు పొద్దున లేచేసరికి ఒళ్ళంతా భారంగా అనిపించింది. బద్ధకంతో అలాగే పడుకున్నాను.

"రాజూ టైమయింది నీకు. నీళ్ళు కూడా కాగాయి" వంటింట్లో నుంచే కేక పెట్టింది ఆశాదేవి.

"వస్తున్నా"

"వస్తున్నా అంటే కాదు. లేవాలి" అంటూ జబ్బ పుచ్చుకుని లేవదీసింది నన్ను.

"ఒళ్ళు వెచ్చగా ఉందే?" అంది.

"లేదే"

"కొంపతీసి జ్వరం కాని కాదుగదా?"

"అబ్బే అదేం లేదు. కాస్త ఒళ్ళు నొప్పులుగా ఉందంతే"

"మొహం చూస్తే తెలియటంలా"

"నువ్వు కంగారు పడకు ఊఁకే"

వద్దని చెప్పినా వినకుండా డాక్టరు దగ్గరికి తీసుకెళ్ళి మందిప్పించింది. కాలేజీ దాకా వెంట వచ్చి నన్ను దిగబెట్టి మరీ తను ఇంటికెళ్ళింది.

పరీక్ష హాల్లో కూచున్న ఓ అరగంటకి ప్రాణం తేలిక పడింది మందు వెంటనే పడిన మూలానేమో. ఆశాదేవి డాక్టరు దగ్గరకు తీసుకెళ్ళి ఉండకపోతే ఏమయిపోయేదో.

పేపరు బాగానే చేశాను.

కాలేజీ నుంచి బయటకు రాగానే ఎదురయింది ఆశాదేవి.

"ఎలా ఉంది ఒంట్లో?" అడిగింది.

"ఇంత కంగారెందుకు ?"

"పొద్దున్న ఎంత జ్వరం ఉందో తెలుసా అసలు?"

"ఇప్పుడు తగ్గిందిలే"

"పేపరు బాగా చేశావా?"

"బాగానే చేశాను. అనవసరంగా ఇంతదూరం ఎందుకు వచ్చావు చెప్పు? ఇంటికి రాలేననుకున్నావా ?"

"ఇల్లు దొరికింది రాజూ !"

"ఎక్కడ ?"

"అంబత్తూరులో"

"సిటీకి చాలా దూరం కదూ?"

"అవును. కానీ ఊరి చివరలో అయినా చాలా బావుంది. అంతా కామ్‌గా ఉంటుంది. ఇప్పుడు అక్కడినుంచే వస్తున్నాను"

"అద్దెంత"

"నూటయాభై. ఇల్లెంత పెద్దదో తెలుసా ? అదే సిటీలో అయితే ఆరేడు వందలుంటుంది"

"పోనీలే తలనెప్పి వదిలింది"

"ఇవాళ పన్నెండు కదూ ?"

"అవును"

"ఎల్లుండితో పరీక్షలు అయిపోతాయిగా?"

"అయిపోతాయి"

"అవతలెల్లుండి మారదాం ఇల్లు. ఏం?"

"అలాగేలే"

తరవాత రెండు పేపర్లూ బాగా చేశాను.

పరీక్షలయిపోయిన రోజున ఎంత హాయనిపించిందో!

అవేవో నాకు భరించలేని భారం అయినట్లూ, ఆ రోజుతో భారం వదిలి పోయినట్టూ సంబరపడ్డాను.

కొత్తింట్లోకి మారాం మర్నాడే.



అంబత్తూరులో అంతగా హడావిడి వుండదు. అక్కడ ఇండస్ట్రీస్ పెట్టడం వల్ల జనం కూడా చేరారు.

చిన్న టౌన్‌లా ఉంటుంది.

నా కెంతో నచ్చింది ఆ వాతావరణం. అక్కడి పరిసరాలూ. కాకపోతే మా ఇల్లు కాస్త ఊరికి చివరగా ఉంటుంది.

ఓ వారం రోజులు చాలా సరదాగా గడిపాం ఆశాదేవీ, నేనూ. స్వర్గంలో విహరిస్తున్నట్లనిపించింది నాకు.

పరీక్షల మూలంగా బయటికి సినిమాకి కానీ, బీచికి కానీ రావటం అసలు కుదర లేదు నెలరోజుల పైగా. పరీక్షలయిపోవటంతో పంజరంలోంచి బయటపడ్డట్టు అయింది. క్షణాల్లా గడిచిపోయింది కాలం.

పొద్దునే ఓ రోజు అంది ఆశాదేవి–

"ఇంక ఉద్యోగాల వేట మొదలెట్టాలి రాజూ!"

"రిజల్ట్స్ రానీ, తొందరేం?" అన్నాను.

"అవసరంలేదు. రిజల్ట్స్ రాకపోయినా కొన్ని కాంపిటేటివ్ ఎగ్జామ్స్‌కి వెళ్ళొచ్చు"

"ఇప్పటినుంచే ఎందుకు?"

"నా మాట విను రాజూ! ప్రొబేషనరీ ఆఫీసర్స్ అడ్వర్టయిజ్‌మెంట్ పడింది. ఇదిగో చూడు. అంతా టైప్ కూడా చేయించాను. నెల రోజులు ఉంది టైం. సంతకం పెట్టు"

"అదికాదు ఆశా"

"చేసావా? లేదా?"

"మళ్ళీ రేపటి నుంచీ నన్ను చదువో చదువో అని చంపుకు తింటానికా?" అన్నాను విసుగ్గా.

"అలా అంటే ఎలా రాజూ! ఇన్ని రోజులు శ్రమ పడ్డావు. ఇంకొన్ని రోజులు కష్టపడు. నా మాట వినవూ?"

సంతకం పెట్టించింది నా చేత.

అవసరమైన పుస్తకాలన్నీ కొంది.

మర్నాటినుంచీ మళ్ళీ చదివించింది నన్ను. మళ్ళీ నెలరోజుల పాటు వెనకటిలా గడిచిపోయాయి.

టెస్ట్ మద్రాసులోనే.

బాగానే రాశాననిపించింది.

అయినా ఈ ఉద్యోగం వస్తుందని గ్యారంటీ లేదుగా. వేరే ప్రయత్నాలు కూడా చెయ్యాలనిపించింది. తలోవేపూ రాయి విసిరితే ఏదో ఒక అవకాశమన్నా దొరక్కపోతుందా?

లోకల్ లైబ్రరీకి వెళ్ళాను.

ఓ వారం రోజుల పేపర్లన్నీ ముందరేసుకుని వాంటెడ్ కాలమ్స్ తిరగేశాను.

ఆ అడ్వర్టయిజ్‌మెంట్స్ చూస్తుంటే తెగ చిరాకేసింది. ప్రతిదానికీ అనుభవం

కావాలి. అదీ వాటి సారాంశం.

ఏమిటో వాళ్ళ ఉద్దేశం?

ఉద్యోగం దొరికితేగా అనుభవం వచ్చేది ?

అనుభవం వచ్చేది ఉద్యోగం చేస్తేగా ?

'పెళ్ళయితే కాని పిచ్చి కుదరదండీ. పిచ్చి కుదిరితే కాని పెళ్ళి కాదండి' అన్నట్లుంది.

నాకున్న డిగ్రీకి ఏమాత్రం అవకాశం కనిపించలేదు.

"ఆడపిల్లకి పెళ్ళి కావటానికి 'కళ్యాణ ఘడియ' రావాలంటారు"

అలాగే, మగాడికి ఉద్యోగం రావటానికి అటువంటి ముహూర్తం రావాలేమో.

ఆశాదేవి చెప్పినట్లు కాంపిటేటివ్ ఎగ్జామ్స్‌లో కష్టపడి చదివి ఉద్యోగం సంపాదించుకోవటం తప్ప నాకు వేరే గత్యంతరం లేదనిపించింది.

"ఈ ఉద్యోగం వస్తే ఏం చేస్తావు?" అంది ఆశాదేవి ఓ రోజు మాటల సందర్భంలో.

"చెప్పనా ?"

"చెప్పు"

"నీచేత ముందు రిజైన్ చేయిస్తా"

"అదా నువు నాకు చేసే ఉపకారం?"

"ఉపకారం కాదూ ?"

"హాయిగా పన్నెండొందలు జీతం తెచ్చుకుంటున్నా"

"అయితే ఏం ?"

"పదిరూపాయల కోసం వెతుక్కోమంటావా ?"

"ఎందుకు అంత అవస్థ ?"

"కాకపోతే మరేంటి ?"

"నా జీతం... అదే రాబోయే జీతం నీదేగా ?"



"నీ జీతం నీది నాదెలా అవుతుంది?''

"అసలు నేనంటూ ఉంటేగా ?''

ఆశాదేవి కళ్ళు చెమ్మగిల్లాయి.

"నీలో భాగం కాదూ నేను ?'' అన్నాను.

ముద్దు పెట్టుకుంది నన్ను.

దాగిపోయాను ఆమెలో.

రోజులు గడిచిపోతున్నాయి. ఆశాదేవి పక్కన కూచుని కబుర్లు చెబుతున్నంతసేపూ ఏ విషయమూ గుర్తొచ్చేది కాదు. కాని ఒంటరిగా ఉన్న ప్రతిక్షణం నా కలలు నిజమవుతాయో లేవో అన్న ఆరాటం నన్ను కలచివేసేది.

ఓరోజు పొద్దున్నే హడావిడిగా తట్టి లేపింది ఆశాదేవి.

''ఏమిటి ఆశా పొద్దునే'' అంటూ మళ్ళీ దుప్పటి ముసుగుతన్ని పడుకున్నా.

"పెద్ద పోజు పెట్టావు''

"ఏమిటి'' అన్నా లేపకుండానే.

"నేనప్పుడే అనుకున్నా''

''ఏమిటో చెప్పు ?"

"చూడు ఎవరో ఆడపిల్ల యూనివర్సిటీ ఫస్టొచ్చింది''

''వాట్ !''

దుప్పటి తన్నేసి లేచి కూచున్నాను.

"అవును చూడు'' అంటూ పేపరు వేపు చూపించింది.

"నేను నమ్మను. ఏది ఆ పేపరిలాతే''

ఇవ్వకుండా పరిగెత్తింది ఆశాదేవి.

అర్థమయింది నాకు యూనివర్సిటీ ఫస్ట్ ఎవరొచ్చిందీ !

ఇంటిచుట్టూ పరుగెత్తించింది ఆశాదేవి పేపరు కోసం.

ఎన్నిసార్లు చూసుకున్నానో నా నంబరు !

ముద్దులతో నింపేసింది ఆశాదేవి నన్నవాళ.

పలావు చేసి పెట్టింది.

"నీ ఫొటో పేపర్లకి పంపించాలి'' అంది.

"ఎందుకు ?''

"ఎందుకేమిటి ? ఎంత గొప్పగా ఉంటుందో తెలుసా ఫొటో పేపర్లో పడితే ?''

"వాళ్ళు వేసుకోవాలిగా ?''

"కళ్ళకద్దుకుని వేసుకుంటారు''

"నీకు హడావిడి చాలా ఎక్కువ. నన్నంటావు'' అన్నాను.

పోస్ట్‌మాన్ వచ్చాడు మేం మాట్లాడుకుంటుంటే.

ఇంటర్వ్యూకి రమ్మని బ్యాంక్ వాళ్ళ నుంచి కాల్ లెటర్ అది! అదృష్టం వరదలా ముంచుకొచ్చినట్లనిపించింది. దేవుడు చేసే చిత్రాలు ఎంత చిత్రం!

ఒక్కసారిగా మనిషి భరాయించుకోలేనన్ని వరాలు కురిపిసాడు.

"ఎక్కడ ఇంటర్వ్యూ?" అడిగింది ఆశాదేవి.

''ఢిల్లీలో'' అన్నా కాయితం తన చేతికిస్తూ.

''వేరీగుడ్. అయితే రాజుగారు ఆఫీసరయిపోయారన్న మాట?'' అంది ఆశాదేవి నవ్వుతూ.

"అవ్వాలిగా''

"ఇంకా అవ్వాలిగా అంటావేం? యూనివర్సిటీ ఫస్టొచ్చిన నీకివ్వకుండా ఇంకెవరికిస్తారనుకున్నావు ఉద్యోగం?''

''చేతిలో పడేదాకా చెప్పలేం ఆశా.''

"వెళ్ళి టికెట్ రిజర్వ్ చేయించు.''

''నేను వెళ్ళను."

"ఏమిటీ?"

"అవును వెళ్ళను."

"ఎందుకు?"

"నువ్వు కూడా వస్తే వెళ్తాను."

"నేనెందుకు?"

"తోడు మేడమ్."

"నాకు సెలవు లేదు రాజూ"

"అదంతా నాకు తెలియదు."

ఒప్పుకుంది చివరికి.

స్టేషన్‌కి బయలుదేరాను రిజర్వేషన్ కోసం.

నా కలల ప్రపంచం మెల్లమెల్లగా అందమైన రూపం సంతరించుకున్నట్లనిపించింది. ఆ తృ త ముంచేసింది నిలువునా.

టైం ఎక్కువ లేకపోవటం వలన రిజర్వేషను దొరకటం కాస్త కష్టమయింది. ఎలాగో అవస్తపడి సంపాదించాను.

రెండు గంటలు పట్టింది బస్సు దొరికి అంబత్తూరు చేరేసరికి.

ఇంట్లోకి అడుగు పెడుతుంటే ఎవరిదో మగగొంతు వినిపించింది. నేను లోపలికి వెళ్ళగానే లేచి నుంచున్నాడతను.

"ఈయన పేరు శ్యామలరావట. ఆ తెల్ల డాబాలో ఉంటారు. నీతో పరిచయం చేసుకుందామని వచ్చారు" అంది ఆశాదేవి.

పలకరించానతన్ని మర్యాద కోసం–నన్ను పరిచయం చేసుకోవటానికి ఎందుకొచ్చాడో అర్థం కాకపోయినా.

"మీరీ మధ్యనే వచ్చారని తెలిసింది. ఊరికే పలకరిద్దామని వచ్చాను – మీకేం అవసరం వచ్చినా నన్నడగండి" అన్నాడతను.

"కూచోండి" అన్నాను.

కాఫీ ఇచ్చింది ఆశాదేవి. ఓ పావుగంట కబుర్లు చెప్పి వెళిపోయాడతను.

అతను వెళ్ళగానే విరగబడి నవ్వింది ఆశాదేవి.

"ఎందుకు నవ్వుతున్నావు?" అన్నాను.

"అదికాదు రాజూ! ఇందాక ఓ అరగంట క్రితం వచ్చాడతను. రాజుగారున్నారా అని అడిగాడు."

"నా పేరెలా తెలుసు అతనికి?"

"ఏమో!నువు లేవని చెప్పాను.వెళ్ళిపోవచ్చుగా? కదలడే ఓ పట్టాన చివరికి చేసేదేం లేక కూచోపెట్టాను. ఇంతకీ అతనెందుకొచ్చిందీ అర్థంకాలేదు. అదీ సంగతి."

నాకూ నవ్వొచ్చింది.

"దొరికిందా రిజర్వేషన్?"

"ఆ! ఎల్లుండికి దొరికింది. రెండు రోజుల ముందే వెళ్ళాలి అక్కడికి. అనవసరంగా టైం వేస్టు"

"పోనీలే. నష్టం ఏం లేదుగా. పద అన్నం తిందాం"

అన్నం తిన్న తరువాత సినిమాకి బయలుదేరాం ఇద్దరం. సినిమా నుంచి బీచికెళ్ళి కూచున్నాం. ఎనిమిది గంటల దాకా అక్కడే గడిపాం.

సిటీ మధ్యకొచ్చి చాలా రోజులయింది. సెకండ్‌షోకి కూడా వెళదామంది ఆశాదేవి. హోటల్లోనే భోంచేసి సినిమాకెళ్ళాం.

ఇంటికి తిరిగి రావటానికి కాస్త అవస్థయింది ఆ రోజు. ఊరి చివరి ఇల్లు తీసుకుంటే, ప్రశాంతత దొరికినా, మిగతా విషయాలన్నిటిలో ఇబ్బందే కదా!

ఆ రాత్రి ఎందుకో మళ్ళీ నిద్రపోలేకపోయాను. మెలకువగానే ఉన్న నన్ను చూసి అడిగింది ఆశాదేవి–

"ఏం రాజూ పడుకోలేదే ఇంకా?"

"నిద్రరావటం లేదు ఆశా"

"ఏం?"

"ఆరాటంగా ఉంది. నేను కన్న కలలన్నీ నిజమవబోతున్నాయి. అల్లంత దూరంలో కనపడుతోంది కలలుకన్న నా లోకం. ఎంత తొందరగా అందుకుందామా అని ఆరాటంగా ఉంది"

"పిచ్చిరాజూ!" నా తల నిమిరింది ఆశాదేవి.

"నీలో దాగిపోవాలనుంది ఆశా!"

దాచుకుంది తన గుండెల్లో.

నరాలు కొరికే చలికి భయపడి వెచ్చదనం కూడా ఆశాదేవి గుండెల్లో దాక్కున్నట్లనిపించింది!

* * *

ఢిల్లీ రెండు రోజుల ముందే చేరినా బయటకెక్కడికీ కదలనివ్వలేదు ఆశాదేవి.

కరెంట్ ఈవెంట్స్ అన్నీ చదివించింది నా చేత.

అవబోయే ఇంటర్వ్యూ ఎంత కష్టమైనా ఫరవాలేదనిపించింది నాకు ఆశాదేవి నన్ను చేసిన ఇంటర్వ్యూ తరువాత.

ఇంటర్వ్యూకి వెళ్ళేముందర అనిపించింది.

ఇంటర్వ్యూ జరుగుతున్నప్పుడూ, అయిపోయి గది బయటకొచ్చాక కూడా అనిపించింది.

నేను సెలక్ట్ అవుతానని.

ఆ నమ్మకం వెనకన ఎన్నో రోజుల శ్రమ ఉండబట్టేకదా!

ఢిల్లీ నుంచీ వచ్చేటప్పుడు ఆగ్రా వెళదామంది ఆశాదేవి. మూడు రోజులున్నాం ఆగ్రాలో.

రోజూ సాయంత్రం తాజ్‌మహల్ దగ్గర కూచునేవాళ్ళం.

ఒకరోజు చూస్తే తనివితీరేదా ఆ అందం?

మూడు రోజులు చాలవనిపించింది.

ఆశాదేవికి సెలవు లేకపోయినా వచ్చింది నా బలవంతం మీద. ఎక్కువ రోజులు ఉండటం కుదరక బయలుదేరి వచ్చేశాం.

నేను అనుకున్నట్టే జరిగింది.

నా కలలు ఫలించాయి.

మద్రాసు చేరిన ఇరవై రోజులకే అపాయింట్‌మెంట్ ఆర్డర్ వచ్చింది. ఎదురు చూసిన ఫలితం అది.

అయినా....

ఆర్డర్ కాగితం చూసినప్పుడు అరక్షణం గుండె కొట్టుకోవటం మానేసింది - అందుకోలేని స్వర్గం అంత సులువుగా, అంత తొందరగా నాదయినందుకు.

ఆశాదేవి ఇంట్లో లేదప్పుడు.

కాలేజీకి బయలుదేరాను.

దారిలో గంటసేపూ ఆత్రంతో మనసెంత ఊగిసలాడిందో! ఎప్పుడెప్పుడు ఆర్డర్ ఆశాదేవికి చూపిద్దామా అనిపించింది.

లైబ్రరీలో కనపడలేదు ఆశాదేవి.

బయటకెళ్ళిందని చెప్పాడు ప్యూను.

అక్కడే కూచున్నాను అరగంట సేపు.

అప్పటికీ తను రాకపోయేసరికి ప్రిన్స్‌పాల్ గారిని పలకరిద్దామని వెళ్ళాను. నన్ను చూడగానే ఆశ్చర్యంతో కుర్చీలోంచి లేచారాయన.

"పెద్దవాడివయిపోయావయ్యా! ఇక మేం ఎలా గుర్తుంటాం చెప్పు? యూనివర్సిటీ ఫస్టొచ్చావని తెలియగానే ఎంత సంబరపడ్డానో తెలుసా ? నన్ను చూడటానికి ఒక్కసారైనా వచ్చావా?"

"ఎంత పెద్దవాడినైనా మీ ముందు

ఎప్పుడూ చిన్నవాడినే కదండీ" అన్నాను నవ్వుతూ.

"అంతా కులాసానా ?"

"ఆ! నా కుద్యోగం కూడా వచ్చిందండీ"

"రియల్లీ! కంగ్రాట్స్. ఎక్కడ?"

"ప్రొబేషనరీ ఆఫీసర్"

"వెరీగుడ్. నాకు తెలుసయ్యా నువ్వు ఆఫీసరువవుతావని''

కాఫీ తెప్పిచ్చారాయన వద్దంటున్నా.

ఆయన ఏదో చెబుతుంటే వింటూ కూచున్నానన్నమాటేగానీ మనసక్కడ ఉంటేగా ?

ఆయనతో మళ్ళీ కలుస్తానని చెప్పి లైబ్రరీకి వెళ్ళాను. ఫ్యూన్‌ని అడిగాను ఆశాదేవి వచ్చిందా అని.

"ఆవిడ ఇంకెందుకొస్తుందండీ"

"అదేం?"

"ఇంటికెళ్ళిపోయారండీ"

"ఎప్పుడూ ?"

"ఇందాక మీరు రాకముందే వెళ్లిపోయారండీ"

అనవసరంగా గంటన్నర వేస్టయింది.

అంత తొందరలో ఇంటికి బయలు దేరితే దారిలో ట్రాఫిక్ జామయింది- ఏదో యాక్సిడెంట్ మూలాన.

దెబ్బతిన్న మనిషి చుట్టూ జనం పోగయ్యారు. దానికి తోడు ఆటోలూ కార్లూ అడ్డదిడ్డంగా నిలిచిపోయాయి

ఒళ్ళు నీరసించిపోయినా మనసు హుషారుగానే ఉంది ఇంటికి చేరేటప్పటికి.

గట్టిగా మాటలు వినిపించాయి ఇంట్లోంచి.

"ఒళ్ళెలా ఉంది ?"

"మతేపోయింది ఇక...''

శ్యామలరావు గొంతది.

"మా రాజుతో చెప్తే నీ రక్తం కళ్ళ చూస్తాడు''

"కుర్రాడు. వాడేం చేయగలడు చెప్పు? నీకూ సరిపోదు వాడి దెబ్బ. అందుకే వచ్చాను''

''నమస్కారం సార్"అంటూ లోపలి కెళ్ళాను.

నిర్ఘాంతపోయాడు నన్ను చూసి.

వాడి కనురెప్ప కిందికి వాలకుండానే బాదటం మొదలెట్టాను.

చర్మం ఊడి పొరలు పొరలుగా రాలేలా కొట్టాను.

ఆశాదేవి అడ్డుపడింది.

అంతు చూస్తానంటూ అరుస్తూ వెళ్లిపోయాడు.

"అలా కొట్టొచ్చా?" అంది ఆశాదేవి.

"చంపలేదు. సంతోషించు."

''జైలుకెళ్తావు చంపితే. నష్టపోయేది మనం"

"ఉరి తీసినా ఫరవాలేదు నన్ను"

ఆశాదేవి కళ్ళు చెమ్మగిల్లాయి.

"ఛ. ఏడుస్తావెందుకు?"

ఏడుపు మానలేదు ఆశాదేవి.

''అరె ఎందుకు ఇంత ఏడుపు? ఇప్పుడేమయింది చెప్పు?"

"భయమేసింది రాజూ."

"నేను నీకు ఓ మంచి న్యూస్ చెబుదామని వస్తే నువ్విలా ఏడిస్తే ఎలా?"

"ఏమిటి?"

"ముందు కళ్ళు తుడుచుకో"

"చెప్పు" అంది కళ్ళు తుడుచుకుంటూ.

''ఓ ముద్దు కావాలి."

''ఎందుకు?"

"నేను చెప్పేది అంత మంచి న్యూస్."

"ఎంత మంచి న్యూస్?"

"నీ ముద్దంత."

నవ్వుతూ ముద్దు పెట్టుకుంది ఆశాదేవి.

ఆర్డర్ కాయితం తన చేతిలో పెట్టాను.

తను చదువుతూండగానే రెండు చేతుల్లో తనని పైకెత్తాను.

"ఏయ్ రాజూ ఏమిటిది?"

"అదంతే"

"నన్ను కిందకి దించు ముందర"

"దించను"

"దించవూ?"

"నో మేడమ్"

"ఏం చేస్తావు మరి?" చిలిపిగా అడిగింది.

"పెళ్ళి చేసుకుంటాను."

"పెళ్ళి."

"యస్ మై బిలవ్డ్ మేడమ్."

"నేను చేసుకోనుగా"

"అలా అయితే ఓ పని చేస్తాను."

"ఏమిటి?"

"నిన్ను రేప్ చేసేస్తాను."

"అంత శ్రమ వద్దులే నీకు. కానీ దానికి కొన్ని షరతులు ఉన్నాయి, చెప్పనా?"

"చెప్పు."

"పెళ్ళయ్యాక నిన్ను నేను 'ఏమండీ శ్రీవారూ' అని పిలుస్తాననుకున్నావేమో అందరిలాగా"

"పిలవక్కరలేదు."

"నువు ముసలాడివయ్యేటప్పటికి నేను ఇంకా ముసలిదాన్నయిపోతాను."

"అయితే ఏం?"

"అప్పుడు నువ్వే నాకు సేవలు చెయ్యాలి."

"చేస్తాను."

"రోజూ వంట చేసి పెట్టాలి"

"అలాగే"

"ముద్దలు తినిపించాలి."

"అదీ అలాగే"

"పిల్లల్ని కూడా నువ్వే కంటావా పోనీ?"

"నువు కనమంటే కంటాను తప్పుతుందా?" అన్నాను.

నవ్వుతూ తన గుండెల్లో నా ముఖాన్ని దాచేసింది.

చంటిపాపనై పోయాను.

"వెళ్ళిపోదాం ఆశా! నీ ఉద్యోగం రిజైన్ చేసేసెయ్. దూరంగా వెళ్ళిపోదాం ఇక్కడినుంచి"

"........."

"నాకు ట్రయినింగులో కూడా ఎనిమిదొందలు వస్తుంది. మనిద్దరికీ అది చాలదూ?"

"........."

"నీకు శ్రీనగర్ చాలా యిష్టం కదా? చండీఘర్‌లో నా ట్రయినింగ్. పోస్టింగ్ కూడా అటువేపే వేయించుకుంటాను"

"అంతా నీ యిష్టమే?" అంది తను.

"నువ్వంటే నా కిష్టం కదా మరి?"

"ఎందుకంత యిష్టం నేనంటే?"

"నువు నాక్కావాలి?"

"ఎన్ని రోజులు?"

"చచ్చిపోయేదాకా

"ఏం చేసుకుంటావు?"

"ఏ భక్తుడూ, ఏ దేవతనీ, పూజించనంత ఆరాధిస్తాను."

"పిచ్చి రాజువి" అంది ముద్దులతో నింపేస్తూ తన గుండెలకి హత్తుకుంటూ.

"ఏమో కానీ ఒకటి మాత్రం నిజం" అన్నాను.

"ఏమిటి?"

"నీ రాజుని!"

★

# ఆఫీసరుగారి గేదె!

ఈ నవయువకుడుగారు ఓ బ్యాంకులో ఆఫీసరు. బ్రాంచి మేనేజరు..... కానీ, రోజూ తెల్లారక ముందే లేచి గేదెను తోలుకుంటూ ఊళ్లోని ఖాతాదార్ల ఇళ్లకు వెళ్ళి, పాలు పితికి పోసి వస్తుంటాడు. ఏ లోటూలేని ఈ కొత్త పెళ్లికొడుకు అన్ని సరదాలూ, సుఖాలూ చంపుకుని ఇలా ఎందుకు చేస్తున్నాడు? ఇదేమన్నా జబ్బా...? లేక...?
విశ్వకథా విపంచి "విపుల" సెప్టెంబరు సంచికలో తమిళ కథ "బ్యాంక్ అల్లుడు" చదివితే తెలుస్తుంది నిగూఢ రహస్యం. దేశంలో కెల్లా అత్యధిక పాఠకుల చేత చదువబడే వార, మాస పత్రికలు తమిళ భాషలోనే ఉన్నాయి. మరి ఆ భాషలో వెలువడుతున్న కథానికా సాహిత్యం ఎటువంటిది? సెప్టెంబరు "విపుల" ప్రత్యేకంగా విభిన్న రకాల తమిళ కథలను అందజేస్తోంది. కథానికాభిమానులకు ఇదొక సదవకాశం.

కథలు గాక అదనంగా ఎన్నో కార్టూన్లు, జోకులు, విచిత్ర విశ్వ విశేషాలు కూడా ప్రచురిస్తోంది 'విపుల'. ప్రతి కథకూ రెండు రంగుల్లో ఆకర్షణీయ చిత్రాలు, రంగుల ఆఫ్‌సెట్ ముద్రణ.

**132 పేజీలు, వెల 125 పైసలే!**



విపుల

*ప్రతి నెలా 1 వ తేదీకి వెలువడే విశ్వకథా వేదిక!*

# ఎద్దుల వైభవం

కేరళలో పాల్ఘాట్ జిల్లాలో ఎద్దుల రేసులు జరుగుతుంటాయి. ఈ రేసులు కూడ రకరకాలుగా జరుగుతాయి. కొన్ని పోటీల్లో నాగళ్ళతో పాటు అరవై కిలోల బరువున్న మనిషి కూడా ఎద్దు వెనక ఉంటాడు. మరికొన్ని పోటీల్లో ముగ్గురు మనుషులున్న బండిని ఎద్దుకి కడతారు. వీటి పరుగూ, వేగం చూడాల్సిందేగాని చెప్పనలవి కాదు. వీటి పరుగు వేగాన్ని అవి పరిగెడుతున్నప్పుడు ఎత్తుగా చిమ్మబడిన నీటిని బట్టి, తుళ్ళిన దూరం బట్టి నిర్ణయిస్తారు. వేలకొద్దీ మనుషులు ఉత్సాహంగా చూస్తుండగా మలబార్లో యీ పోటీ జరుగుతుంది.

1979లో ఇవి నిర్వహించడానికి 'కేటిల్ రేస్ క్లబ్' స్థాపించేరు. పాల్ఘాట్ చుట్టు పక్కలే ఈ రేసులు తరచూ జరుగుతుంటాయి. ఈసారి 'ఏనుగుల రేస్' ఏర్పాటు చేద్దామనుకుంటున్నారు క్లబ్ వాళ్లు.

సాధారణంగా ఈ రేసులు పంటల సీజన్లో జరుగుతాయి. విత్తనం నాటక ముందే మొలబంటి లోతు బురద నీటి పొలాల్లో రేసులు నిర్వహిస్తుంటారు. అప్పట్లో ఈ రేసులు భూస్వాములకే పరిమితమై ఉండేవి. అందువల్ల రకరకాల కక్షలు, వాటి మూలంగా తగాదాలు, కొట్లాటలు జరిగేవి. ఆఖరికి ఓ చిన్న దెబ్బలాటైనా జరగందే రేసు పూర్తి అయ్యేదికాదు. పాల్ఘాట్ జిల్లాలో దాచంకాడు అనే గ్రామం ఈ రేసులవల్ల ప్రాముఖ్యం సంతరించుకుంది. ఇక్కడి ఎద్దులకి రాజభోగాలు జరుగుతాయి.

మట్టా అనే పేరు పొందిన రేసు ఎద్దు రేసుల్లో పాల్గొంటూ చచ్చిపోవడంతో దాని యజమాన్లు కన్నీరు మున్నీరుగా విలపించి ఓ వెయ్యి కిలోల బియ్యంతో బ్రాహ్మణులకి సంతర్పణ చేశారు. దానికో చక్కటి సమాధి కట్టి పెట్టేరు. ఇప్పటికీ రేసుల్లో పాల్గొనే ముందు ఆ సమాధి దగ్గర ఓ కొబ్బరికాయ కొట్టి మరీ పాల్గొంటారు.



ఇహ పోటీల్లో పాల్గొనే ఎద్దులకి బలమైన తిండి పెడతారు. విస్కీ, బ్రాందీ, చికెన్ మటన్, వేరుశనగ పప్పు ఒకటేమిటి సర్వం పెడతారు. పోటీలో పాల్గోడానికి కొద్ది నిమిషాలుందనగా వాటికి హార్లిక్స్, బోర్నవిటా, విటమిన్ టాబ్లెట్లు కూడా ఇస్తారు.

పోటీల్లో గెలిచిన ఎద్దులకి గొప్ప డిమాండు. మార్కెట్లో బ్రహ్మాండమైన ధర పలుకుతుంది. గెలిచిన ఎద్దుకి 20 వేలకి తక్కువ పలకదు.

ప్రపంచం

# అభినవ గాడిద

గుర్రాలు, గాడిదలు లేని చోట వాటికి దగ్గర పోలికలున్న జంతువులకి ప్రాముఖ్యత పెరుగుతుంది. అలాగే పెరూలోని ఇండియన్స్ 'ఇల్మా' అనే జంతువు మీద ఎక్కువగా ఆధారపడ తారు. పెరూలో శ్వేత జాతీయులు అడుగు పెట్టక ముందు అక్కడ నివ సించే 'ఇంకాస్' తెగవారు గుర్రాలు, ఎద్దులు లేనందున ఇల్మాని బరువులు



మోయడానికి ఉపయోగించేవారు. వీరు ఆ జంతువు ఊలుతో తాళ్ళు, గోనె సంచులు తయారుచేసేవారు. మాంసాన్ని ఆహారంగా ఉపయోగించడమే కాక పేడను ఎండబెట్టి ఇంధనంగా వాడేవారు. ఇప్పటికీ పెరూలోని ఇండియన్స్, ఇంకాస్ తెగవారూ ఇల్మా మూత్రం నుంచి వచ్చే వాసన క్రిమి కీటకాల్నుంచి, దుష్ట శక్తుల నుంచి తమను కాపాడు తుందని నమ్ముతారు. పసిపిల్లలను ఆ జంతువు మూత్రంతో స్నానం చేయి స్తారు. ఇల్మా అంటే వీరికి భయభక్తు లెక్కువ.

ఈ జంతువు తన కోపాన్ని ప్రదర్శించే పద్ధతి చాలా విచిత్రంగా ఉంటుంది. బరువు మోస్తూ అలిసిపోయిన ఇల్మాను ఖర్మగాలి ఎవరైనా తొందరగా నడవమని అదిలిస్తే సహించక తల వెనక్కి తిప్పి మీద ఎక్కి కూర్చున్న వాడి ముఖం మీద తుపుక్కున ఉమ్మేస్తుంది. అందుకే ఇల్మా అలసట తీరేవరకూ వేచి ఉంటారు తప్ప దాన్ని ధస్తే అదిలించరు.

# గ్రంథ చౌర్యం

'పుస్తకాన్ని అరువిచ్చినవాడు మూర్ఖుడైతే దాన్ని తిరిగి ఇచ్చినవాడంతకన్నా పరమ మూర్ఖుడు' అన్నారు పెద్దలు. దాన్నక్షరాలా నిజం చేస్తున్నారు బ్రిటన్ దేశస్థులు.

బ్రిటన్‌లో సంవత్సరానికి సగటున 18 లక్షల రూపాయల విలువగల పుస్తకాలు గ్రంథాలయాల నుంచి దొంగిలించబడుతున్నాయి. ముఖ్యంగా ఇంటికి పుస్తకాలు ఇవ్వని రిఫరెన్స్ డిపార్టుమెంటులోని ఖరీదైన పుస్తకాలు ఎక్కువగా మాయం అవుతున్నాయి. ఈ నేరాల్ని ఎదుర్కోవడానికి బ్రిటన్ లైబ్రరీలు ఓ కొత్త ఎలక్ట్రానిక్ పరికరాన్ని ఉపయోగిస్తున్నాయి. న్నాయి. ప్రతి పుస్తకం బైండింగ్‌లో ఒక లోహపు ముక్కని ఉంచుతారు. పుస్తకం రేక్‌లోంచి తీయగానే లైబ్రేరియన్ పక్కనే వుండే ఎలక్ట్రానిక్ ప్లేట్ మీద ఆ పుస్తకం తాలూకు లైటు వెలుగుతుంది. తలుపులు యాంత్రికంగా మూసుకుంటాయి కాబట్టి దొంగ బయటకి పారి

పోవడానికి వీలుండదు. పుస్తకాల్ని తమ సభ్యత్వం ఉపయోగించి తీసుకునేవారు దాన్ని లైబ్రేరియన్‌కి ఇవ్వగానే అతను ఓ స్విచ్ నొక్కి పరిస్థితిని యథాస్థితికి తెస్తాడు. ఈ పద్ధతి వల్ల దొంగతనాలు చాలావరకు అరికట్టబడుతున్నాయి అని తెలిసింది.

## ఎలక్ట్రానిక యుగం

పెద్ద హోటళ్లలో వందలకొద్దీ గదులు ఉంటాయి. బస చేసే వాళ్లు బయటకు వెళుతూ తమ గది తాళం చెవులు రిసెప్షనిస్ట్‌కి ఇచ్చి వెళ్ళటం రివాజు. హోటల్ గదులలో దొంగతనాలు చేసే చోర



మహాశయులు సమయం కనిపెట్టి మారు తాళం చెవితో ఆ గదుల్లోకి పోయి పన్ను చక్కబెట్టుకుంటుంటారు. లేదా తామే బస చేసే వాళ్ళ లాగ పోజుకొట్టి రిసెప్షనిస్ట్ నుంచి తాళం చెవులు సంపాదించి దర్జాగా పనికానిస్తారు. పారిస్‌లోని ఫైవ్ స్టార్ హోటల్ హిల్టన్ ఈ దొంగలబారి నుంచి తమ కస్టమర్లని రక్షించుకోడానికి ఓ ఎలక్ట్రానిక్ పద్ధతిని 1979 ఫిబ్రవర్లో ప్రవేశపెట్టింది.

కస్టమర్ గది తీసుకోగానే ఒక నంబర్, కోడ్‌లో కంటికి కనపడని అక్షరాలు గల ప్లాస్టిక్ కార్డునిస్తారు. తన గది తలుపులు తెరవడానికి తలుపుకున్నస్లాట్ (కన్నం)లో ఆ కార్డ్‌ని వేస్తేచాలు తెరచుకుంటాయి. లోనికి వెళ్ళేక మళ్లీ ఆ కార్డ్ తీస్తేగాని తలుపు మూసుకోదు.

కొత్త కస్టమర్ వచ్చినప్పుడు ప్లాస్టిక్ కార్డ్ నంబర్, కంటికి కనపడని అక్షరాలు మార్చేస్తారు.

శతకోటి దరిద్రాలకి...

## వృద్ధుల కోసం

వృద్ధాప్యం భయంకరమైన శాపమనుకోవచ్చు. నా అనేవారే లేకపోతే వాళ్ల బతుకు మరీ దుర్భరమవుతుంది. ఇలా ఒంటరిగా నివసించే ముసలివాళ్లలో అంగవైకల్యం గానీ, అనారోగ్యంకానీ ఉన్నవాళ్ల క్షేమంకోరి డెన్మార్క్ దేశస్థుడైన కాజ్ నెల్సన్ అనే వృద్ధుడు టెలిఫోన్ ద్వారా వాళ్ల బాగోగుల్ని కనుక్కునే పద్ధతి 1971లో ప్రవేశపెట్టాడు. ఈయన కూడా గుడ్డివాడే. ఈ పద్ధతి ఇప్పుడు డెన్మార్క్ దేశమంతా పాకింది.

పదిమంది వృద్ధులు కలసి ఓ గ్రూప్‌గా ఏర్పడతారు. ఆ గ్రూప్‌కి ఎన్నుకోబడ్డ నాయకుడు ప్రతిరోజూ పుదయం తొమ్మిది గంటలకి ఒకరికి ఫోన్ చేసి యోగక్షేమాలు విచారిస్తాడు. అతను మరొకరికి, ఆ మరొకరు ఇంకొకరికి ఫోన్

చేసి అందరూ క్షేమమేనని నిర్ధారణ చేసుకుని తృప్తి పడతారు. ఎవరైనా ఫోన్ ఎత్తకపోతే వెంటనే నాయకుడికి తెలియ



చేస్తారు. అతని దగ్గర మిగతా తొమ్మిది మంది ఇళ్ళతాళం చెవుల డూప్లికేట్లుంటాయి. పోలీసుల్ని తీసుకుని ఆనాయకుడు టెలిఫోన్ ఎత్తని వ్యక్తి ఇంటికి వెళ్తాడు.

## దొరకునా...సేవ

అలనాటి శ్రీరామచంద్రుడికే తప్పలేదు కోతి సాయం. మనమనగా ఎంత? అమెరికాలోని న్యూఇంగ్లాండ్ మెడికల్ సెంటర్ వాళ్లు కోతుల్తో అంగవిహీనులకి అద్భుతంగా సేవలు చేయిస్తున్నారు. శిక్షణ ఇవ్వబడ్డ వానరాలు చక్కగా తమ విద్యుక్తధర్మాన్ని నెరవేరుస్తున్నాయి.

గుడ్డివాళ్లకి దారి చూపడం, తాళం చెవులు వెతికి అందివ్వడం, స్విచ్ నొక్కి లైట్లు వెలిగించడం, ఆర్పడం, స్పూన్‌తో చేతులులేనివాళ్ళకి అన్నం తినిపించడం, పుస్తకాలు, బట్టలు అందివ్వడం మొదలైన పనులుచేస్తూ, చలాకీగా తిరుగుతూ అధికారుల ప్రశంసలందుకుంటున్నాయి. ఈ విధంగా దక్షిణఅమెరికాలో 38,000 మంది అంగవికలురకి శిక్షణ ఇవ్వబడ్డ కపిసైన్యం చేస్తున్న సేవ సాటిలేనిది.

టిష్, క్రిష్టల్ అనే రెండు వానరాలు మాత్రంపైన చెప్పిన పన్లేకాక ఆశ్చర్యం కలిగించే మరికొన్ని పన్లుకూడా చేస్తున్నాయట.

చక్రాల కుర్చీలో కూర్చున్న యజమానిని తోసుకుంటూ బజారుకి పోయి కాయగూరలు, ఇతర సామాన్లు దుకాణం



వాడి నుంచి అందుకుని వాటిని చాలా జాగ్రత్తగా మళ్ళీ యజమాని కూర్చున్న కుర్చీలో భద్రపరిచి ఇంటికొస్తాయివి. వీటికి లిఫ్టు నడపడం, రికార్డ్‌ప్లేయర్లో రికార్డులు మార్చటంవంటి పనుల్లో కూడా శిక్షణ ఇద్దామనుకుంటున్నారధికారులు.

**Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.**

CHATURA Telugu Monthly, Hyderabad-500 004. Regd.No. H/HD/402




# ఎల్ల వేళలా...

ఉదాహరణకు అల్పాహార సమయంలో...

నోరూరించే 'ప్రియ' టొమాటో, అల్లం పచ్చళ్లు మీరారగించే అల్పాహారానికి సరికొత్త రుచులను సమకూరుస్తాయి. ఇడ్లీ, దోసె, పకోడీ, సమోసా, బజ్జీ, గారె... ఏదయినా సరే– 'ప్రియ'తో జోడించండి. ఆ రుచి అపూర్వం.

మామిడికాయ, నిమ్మకాయ, గోంగూర, అల్లం, టొమాటో...

అన్నీ మీకు నచ్చే పచ్చళ్లే. తెలుగు నేల నాలుగు చెరగులా గాలించి తెచ్చిన పళ్ళూ కాయలకు తగుపాళ్ళలో మసాలాలు మేళవించి, అధునాతన కర్మాగారంలో, పరిశుభ్రమయిన వాతావరణంలో తయారయిన పచ్చళ్లివి.

మీ 'ప్రియ'ను ఈరోజే కొనండి. మీరు వెచ్చించే ప్రతి రూపాయికీ మించిన కమ్మదనాన్ని చవి చూడండి.

తయారుచేయువారు:
**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్
పోరంకి, కృష్ణాజిల్లా.

Marketed by
**Margadarsi Marketing**
PRIVATE LIMITED
Eenadu Compound, Somajiguda
Hyderabad-500 004




ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ

KIRON/PF/80/9/TEL